# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 8 సంచిక : 4 హైదరాబాద్ 105 ఏప్రిల్ 2010 పేజీలు : 60 రు. 10

- ఫోకస్ : కేంద్ర, రాష్ట్ర బడ్జెట్లు
- అందరి ఆమోదంతో మహిళా బిల్లు
- రాయలసీమ ప్రత్యేక అస్తిత్వం
- తెలంగాణ ఉద్యమం - కొత్త సవాళ్లు
- చీమకుర్తి గ్రానైట్ దుర్ఘటన
- నారాయణపట్నా వేస్తున్న ప్రశ్నలు
- సోషలిజం మార్గదర్శి మెస్జరోస్

# ఒక్క నిమిషం ఆగి ఇది చదవండి!
# వీక్షణం ఆగిపోకుండా కాపాడవలసింది మీరే!!

మీరు మీ చేతుల్లోకి తీసుకుని చదవబోతున్న ఈ పత్రిక, ఎన్నో ఏళ్లుగా మీరు అభిమానించి ఆదరిస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి మీరు తెలుసుకోవలసి ఉంది.

వీక్షణం 2005 జూలై సంచిక నుంచి ఇప్పటివరకూ విడిప్రతి ఖరీదు గాని, సంవత్సర చందాగాని పెంచలేదు. మీ చేతికి ఈ పత్రిక పది రూపాయలకే అందుతున్నది. మీరు చందాదారులయితే ఆ పది రూపాయలలో కూడ మళ్లీ అర్ధరూపాయి పోస్టేజికి ఖర్చవుతుంది. మీరు దుకాణంలో కొనుక్కునే వారయితే మీరు ఇచ్చే పది రూపాయలలో నాలుగు రూపాయలు ఏజెంటుకే చేరుతాయి. అంటే చందామీద తొమ్మిదిన్నర రూపాయలు, ఏజెంటు ద్వారా అమ్మే ప్రతి మీద ఆరు రూపాయలు మాత్రమే వీక్షణంకు తిరిగి వస్తున్నాయన్నమాట. కాని వీక్షణం ఒక ప్రతి ఉత్పత్తి వ్యయం పద్నాలుగు రూపాయలు. (కాగితం, ముద్రణ ఖర్చు ఏడు రూపాయలు, కార్యాలయ నిర్వహణ ఖర్చు ఆరు రూపాయలు, రవాణా ఖర్చు ఒక రూపాయి). అంటే చందా మీద నాలుగున్నర, ఏజెంటు ద్వారా అమ్మే కాపీ మీద ఎనిమిది రూపాయలు నష్టం అన్నమాట. ప్రపంచవ్యాప్తంగా పత్రికల ఆర్థిక స్థితి ఇలానే ఉంటుంది. సాధారణంగా పత్రికలు ఉత్పత్తి వ్యయాన్ని అమ్మకం ధరగా పెట్టి, పాఠకుల మీద భారం వేయలేవు. అందువల్లనే పత్రికలు వ్యాపార ప్రకటనలు స్వీకరించి ఆ లోటును పూడ్చుకుంటాయి. వీక్షణంకు ఒకే ఒక్క ప్రకటన ఉందనీ, అది కూడా క్రమం తప్పకుండా రావడం లేదనీ మీకు తెలుసు. ప్రకటన ఉన్నప్పుడు కూడా వీక్షణం లోటులో మూడోవంతును మాత్రమే పూరించగలుగుతుంది. ప్రతినెలా కనీసం మరి రెండు ప్రకటనలు వస్తేగాని వీక్షణం ఆదాయ వ్యయాలు సమానం కావు. ఇంతకాలం వీక్షణం మాతృసంస్థ సిడిఆర్‌సి చేసిన కార్యక్రమాలతో ఈ లోటును భరిస్తూ వచ్చింది గాని అది ఎక్కువకాలం సాగదు. ఇప్పుడిక మీలో ప్రతి ఒక్కరూ పూనుకుని మీ వ్యక్తిగత బాధ్యతగా భావించకపోతే వీక్షణం ఆర్థిక పరిస్థితి నెలనెలకూ మరింతగా క్షీణిస్తుంది. వీక్షణంను ఆదుకోవలసింది మీరే.

మీరు తలచుకుంటే

- ప్రతి ఒక్క చందాదారూ తమ బాధ్యతగా కనీసం మరొక చందా చేర్పించవచ్చు.
- ఏజెంటు దగ్గర విడి ప్రతి కొనుక్కునే పాఠకులందరూ చందాదారులు కావచ్చు.
- మీకు తెలిసిన గ్రంథాలయాలకు, సంస్థలకు, విద్యాలయాలకు వీక్షణంను పరిచయం చేయవచ్చు.
- మీకు పరిచయస్తులైన శ్రేయోభిలాషుల దగ్గర, సంస్థల దగ్గర వ్యాపార ప్రకటనలు, విరాళాలు సేకరించవచ్చు.

## చందా వివరాలు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| మూడు సంవత్సరాల చందా | రు. | 350 |
| ఐదు సంవత్సరాల చందా | రు. | 550 |
| పది సంవత్సరాల చందా | రు. | 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**


**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

105

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

ఏప్రిల్ 2010
సంపుటి : 8
సంచిక : 4



**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు,**
**డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com
www.veekshanam.wordpress.com
వీక్షణం అకౌంట్ నెంబర్ –
**013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్,
హైదరాబాద్

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**, హైదరాబాద్.
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

సంపాదకీయం

## ఈ బడ్జెట్లు ఎవరికోసం?

ఫిబ్రవరి చివరి వారంలో రాష్ట్ర, కేంద్ర బడ్జెట్ల కోసం ఎదురుచూడడం, ఆ బడ్జెట్లను జాగ్రత్తగా అధ్యయనం చేసి వ్యాఖ్యానించడం పత్రికలకు, ప్రచార మాధ్యమాలకు, అర్థశాస్త్రవేత్తలకు మాత్రమే పరిమితమయిన వ్యవహారంగా మారిపోయి చాలరోజులయింది. ప్రజల దృష్టిలో బడ్జెట్‌కూ, మిగిలిన ప్రభుత్వ రాజకీయార్థిక నిర్ణయాలకూ తేడా ఏమీలేదు. అటువంటి వినాశకర, ప్రజావ్యతిరేక రాజకీయార్థిక విధానాలు ప్రతిరోజూ వెలువడుతూనే ఉన్నాయి. బడ్జెట్ అనేది పాలకవర్గాలు రోజూ చేస్తున్న పనులకే ప్రజలకు అర్థం కాని భాషలో ఇచ్చే సమర్థన అయిపోయింది. రాజకీయ నాయకులు, ఏ రంగు జెండాలు పట్టుకుని ఉన్నా, అధికారంలో ఉన్నప్పుడు ప్రజోపయోగకరమైన బడ్జెట్ అని అభివర్ణించడం, ప్రతిపక్షంలో ఉన్నప్పుడు అంకెల గారడీ అని కొట్టిపడేయడం మామూలయిపోయింది. ఆర్థికమంత్రుల ఉపన్యాసాలలో చెప్పిన విషయాల మీద, అంకెల మీద వ్యాఖ్యానాలే ప్రధానమవుతున్నాయి. చెప్పని విషయాల జోలికి, అంకెల వెనుక దాగిన మోసాల జోలికి విమర్శకులు కూడ పెద్దగా వెళ్లడంలేదు. బడ్జెట్ల సమర్థకులు, విమర్శకులూ కూడ అవే అంకెలను అటూ ఇటూ తిప్పి అవతలివాళ్లు అవునన్నదాన్ని కాదనాలనే సూత్రాన్ని మాత్రమే అమలు చేస్తున్నారు. ఈ రణగొణధ్వనిలో అసలు బడ్జెట్లు ఎందుకు ప్రవేశపెడతారో, బడ్జెట్లవల్ల ప్రజలకు ఏం జరుగుతుందో చెప్పేవాళ్ల సంఖ్య నానాటికీ తగ్గిపోతోంది. మన సమాజంలో గతంలో సంస్కృతం నిర్వహించిన పాత్రనే ప్రస్తుతం అంకెలు నిర్వహిస్తున్నాయి గనుక ఒక కొత్త బ్రాహ్మణ్యం ఆ అంకెలమీద గుత్తాధిపత్యం వహిస్తూ, వాటి సారాంశం ప్రజలకు తెలియకుండా జాగ్రత్తపడుతోంది. సమాజంలో భిన్నవర్గాలు ఉన్నాయనీ, వారి వృత్తులు, జీవనోపాధులు, ఆదాయాలు వేరువేరుగా ఉన్నాయని, వారి మధ్య సమతుల్యతను, సమన్వయాన్ని సాధించడానికి ప్రభుత్వం అనే యంత్రాంగం రూపొందిందని రాజనీతి శాస్త్రం చెపుతుంది. ఆ సమాజ ఆర్థిక జీవనాన్ని నియంత్రించే పని కూడ ప్రభుత్వానికే దఖలు పడింది. సమాజంలోని వర్గాల మధ్య ఘర్షణ తీవ్రతరం కాకుండా, సమాజమే కుప్పకూలిపోకుండా చూసే బాధ్యత కూడ ప్రభుత్వానిదే. అందుకోసమే ప్రభుత్వం సంక్షేమ బాధ్యతలు నిర్వహించాలని, రాజ్యం సంక్షేమరాజ్యంగా ఉండాలని భావనలు తలెత్తాయి. ఆ రకంగా బడ్జెట్ల రూపకల్పన ప్రాధాన్యత సంతరించుకుంది. సమాజంలో సంపద ఏయే మార్గాలలో ఉత్పత్తి అవుతున్నదో పర్యవేక్షించడం, ఆ సంపదను సామాజిక భద్రతకు అనుగుణంగా పంపిణీ అయ్యేలా పథకాలు రచించడం బడ్జెట్ పనులు. అంటే బడ్జెట్ తయారీ అనేది సామాజిక భద్రతను కాపాడడానికి, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే పాలకవర్గాల దోపిడీ పీడనలు యథాతథంగా సాగేందుకు పన్నిన వ్యూహం. దోపిడీ మితిమీరకుండా ఉండాలనీ, కింది వర్గాలకు కాస్త ఊపిరి పీల్చుకునే అవకాశమైనా కల్పించాలనీ చేసే ప్రయత్నమే బడ్జెట్. కాని 1990ల తర్వాత ప్రపంచవ్యాప్తంగా మారిపోయిన భావజాల వాతావరణంలో పాలక, సంపన్నవర్గాల దుర్మార్గం ఎంతదూరం వచ్చిందంటే, ఆ సంక్షేమం, వెసులుబాటు కూడ ఇవ్వకుండా ఉండాలని పాలకులు భావిస్తున్నారు. ఇంకా ఎక్కువ దోపిడీ చేస్తే ఏం, బానిస సమాజంలోలాగ మనుషుల రక్తమాంసాలు పీల్చుకుతింటే ఏం అని ఆలోచిస్తున్నారు. ఈ దుర్మార్గాన్ని వ్యతిరేకించే ప్రశ్నలు తలెత్తితే సైనిక బలగాలను, ఆయుధ సంపత్తిని ఉపయోగించి, దమననీతికి పాల్పడి ప్రశ్నలను అడ్డుకుందామనుకుంటున్నారు. అందుకే బడ్జెట్లకు ఉన్న ప్రత్యేక, 'పవిత్ర' ప్రతిపత్తి అంతాపోయింది. బడ్జెట్ల నుంచి సంక్షేమ భావన పోయింది. బడ్జెట్లలో రక్షణ వ్యయానికి, సాయుధబలగాలమీద వ్యయానికి పెద్దపీట మొదలయింది. బహుళజాతి సంస్థలకు, సంపన్నులకు అనుకూలమైన, అంటే దోపిడీ పీడనలకు అనుకూలమైన రాజకీయార్థిక విధానాల ప్రకటననే బడ్జెట్ గా ప్రకటించడం మొదలయింది. బడ్జెట్లలో మాత్రమే ప్రకటించవలసిన రాజకీయార్థిక విధానాలను ఏడాది పొడుగునా, ఎప్పుడు తమ ఆశ్రితులు కోరుకుంటే అప్పుడు ప్రకటించడం మొదలయింది. సంక్షేమ విధానాల మీద కోతలు మొదలయ్యాయి. కనుక ప్రస్తుతం బడ్జెట్లను పరిశీలించడం అంటే ఒక అంకె పెరిగిందా తగ్గిందా, ఆమ్ ఆద్మీ అన్నాడా అనలేదా, విద్యకూ, వైద్యారోగ్యాలకూ ఎక్కువ కేటాయింపులు ఇచ్చారా, సంపన్నుల విలాసాల మీద ఎక్కువ రాయితీలు ఇచ్చారా, మూడోదశ సంస్కరణలు చేపట్టడానికి ప్రాధాన్యత ఇచ్చారా, రక్షణ వ్యయానికీ, విదేశీ రుణాల చెల్లింపుకూ సగం బడ్జెట్ చెల్లిపోతున్నదా వంటి ప్రశ్నలకు అంత ప్రాధాన్యత లేదు. అవన్నీ రూపపరమైన ప్రశ్నలు. అవి వేయవలసిన ప్రశ్నలే గాని, అంతకన్న ముఖ్యంగా సారాంశానికి సంబంధించిన ప్రశ్నలు వేయవలసి ఉంది. వర్గసమాజంలో సామాజిక భద్రతా పరిరక్షణ సాధనంగా వచ్చిన బడ్జెట్ ను ఇంతగా పతనం చేయడం ద్వారా పాలకవర్గాలే వర్గపోరాటం తీవ్రతరం అయ్యే పరిస్థితి కల్పిస్తున్నాయని, ఇది పాలకవర్గాల దిగజారుడుకు చివరి నిదర్శనమని అర్థం చేసుకోవలసి ఉంది.

వీ

## మహిళల వాటా ఇవ్వాలని ఎవరికుంది?

చట్టసభలలో మహిళలకు మూడోవంతు స్థానాల కేటాయింపుకు హామీ ఇచ్చే ప్రతిపాదన చట్టరూపం ధరించడానికి పద్నాలుగు సంవత్సరాలుగా ఎదురుచూస్తూ ఇప్పటికీ అనిశ్చితంగానే మిగిలిపోయింది. జనాభాలో సగభాగమైన మహిళలకు నిర్ణయాధికార స్థానాలలో సగం కాదు గదా, మూడోవంతు స్థానం కూడ లేకపోవడం నిజంగా విచారించవలసిన విషయమే. తప్పనిసరిగా మహిళలకు ఆ అవకాశం దక్కవలసిందే. అయితే, ఆ అవకాశం కల్పించడం కోసమే చట్టం చేస్తున్నామని చెపుతున్న రాజకీయపక్షాలకు ఆ చిత్తశుద్ధి ఉన్నదా అనేదే అసలు ప్రశ్న. అలాగే, మహిళా బిల్లును వ్యతిరేకిస్తున్న రాజకీయపక్షాలు లేవనెత్తుతున్న సందేహాలలో మౌలికంగా కొన్ని ఆలోచించవలసిన వాదనలున్నాయి. ఆ వాదనలు వారి కుయుక్తుల వెనుక, మొరటు, మూర్ఖపు మాటల వెనుక కనబడకుండా ఉండవచ్చు. మొత్తంమీద చూస్తే, మహిళాబిల్లుకు అనుకూలంగా ఉన్నట్టు కనబడుతున్నవారు మహిళా ఉద్ధారకులూ కారు, మహిళాబిల్లుకు వ్యతిరేకంగా ఉన్నట్టు కనబడుతున్నవారు మహిళా వ్యతిరేకులూ కారు. ఆ మాటకు వస్తే, ఈ వ్యవస్థ మొత్తంగానే మహిళలకు వ్యతిరేకంగా, పితృస్వామికంగా ఉన్నది గనుక, ఈ వ్యవస్థను కాపాడుతున్న, కాపాడడంలో భాగం పంచుకుంటున్న పార్లమెంటరీ రాజకీయపక్షాలన్నీ మాటల్లో ఏమిచెప్పినా మౌలికంగా స్త్రీ పురుషుల మధ్య అసమానతను కొనసాగించేవే. ప్రస్తుత సమాజంలో మహిళలకు అందవలసిన వాటా అందడంలేదన్నది కఠోర వాస్తవం. పెంపకంలో, విద్యలో, వైద్యంలో, ఉద్యోగాలలో, సామాజిక గౌరవంలో, పాలనలో, శాసన నిర్మాణంలో, శాసనాల అమలులో, మొత్తంగా అన్ని సామాజిక సంస్థలలో జనాభా నిష్పత్తిని బట్టి సగభాగాన్ని ఆక్రమించవలసిన మహిళలకు ఎక్కడా కనీస భాగస్వామ్యం లేదు. శాసన నిర్మాణంలో అయితే ఈ స్థితి మరింత ఘోరంగా ఉన్నది. మహిళల సంఖ్య గత లోక్ సభలో 8 శాతం కాగా, ప్రస్తుతం 11 శాతం. ఈ సంఖ్య పెరిగినంతమాత్రాన్నే మహిళలకు అనుకూలమైన నిర్ణయాలు జరుగుతాయా అనే ప్రశ్న ఉంది గాని, కనీసం ఆ న్యాయమైన నిష్పత్తి లేకపోవడాన్ని తక్షణం సవరించవలసి ఉంది. షెడ్యూల్డ్ కులాలవారికి, షెడ్యూల్డ్ తెగలవారికి వారి జనాభా నిష్పత్తిని బట్టి రిజర్వేషన్ ఉన్నట్టుగానే, బహుజనకులాలన్నిటికీ ఉండాలని, ఆ రిజర్వేషన్ లేకుండా మహిళలకు రిజర్వేషన్ కల్పిస్తే, ఆమేరకు తాము పోటీచేసే స్థానాలు తగ్గిపోతాయని, ఆ మహిళల స్థానాలను అగ్రవర్ణ మహిళలే ఆక్రమిస్తారనీ, అంటే అంతిమంగా అది అగ్రవర్ణాల రిజర్వేషన్ గా మిగిలిపోతుందనీ బహుజన రాజకీయనాయకులు వాదిస్తున్నారు. ఈ వాదనను పరిగణనలోకి తీసుకుని, కనీసం 2011 జనగణనలోనయినా బహుజన కులాల సంఖ్య అంచనా కట్టి, ఆయాకులాల దామాషా ప్రకారం అందరికీ రిజర్వేషన్లు కల్పించవచ్చు. లేదా, మహిళల రిజర్వేషన్ లో బహుజన కులాల రిజర్వేషన్ అమలుచేయవచ్చు. చాల చిన్న, సాంకేతికమైన, రాజ్యాంగ సవరణ ద్వారా పరిష్కారం కాగలిగిన ఈ సమస్యను జటిలం చేస్తున్నవి పాలకవర్గాలే. దేశ వనరులను కొల్లగొట్టే అనేక శాసనాలను అతి సులభంగా ఆమోదించిన అన్ని రాజకీయపక్షాలూ కలిసి ఆడుతున్న మహిళా వ్యతిరేక నాటకం ఇది. మొదటి అంకం మార్చ్ 9న రాజ్యసభలో బిల్లు ఆమోదంతో ముగిసింది. ఆ తర్వాత రెండురోజులు లోక్‌సభలో గందరగోళం జరిగినప్పుడు, బిల్లు ప్రవేశాన్ని వాయిదావేస్తూ, తదుపరి సమావేశం లోపల అన్ని రాజకీయపక్షాలతో సమావేశమై, పరిష్కారం కనిపెడతామని ప్రభుత్వం ప్రకటించింది. కాని, రెండు వారాలు గడిచిపోయినా ఆ సమావేశం జాడలేదంటే పాలకపక్షపు చిత్తశుద్ధి అర్థమవుతోంది. ఈ దేశంలో పాలకవర్గముఠాలు ప్రజలకు ఉపయోగపడే చర్యల విషయంలో ఎటువంటి నిర్లక్ష్యం, సాచివేత ప్రదర్శిస్తాయో పెద్ద నిదర్శనం ఇది.

## అమెరికా సంపన్నుల కోసమే భారత ప్రభుత్వం

మార్చ్ 15న భారత ప్రభుత్వం పార్లమెంటులో ప్రవేశపెట్టదలచుకుని, కారణాంతరాలవల్ల ప్రస్తుతానికి వెనక్కి తగ్గిన సివిల్ న్యూక్లియర్ లయబిలిటీ బిల్ (పౌర అణువిద్యుత్ తయారీలో తయారీదారుల బాధ్యతను నిర్దేశించే చట్ట ప్రతిపాదన) ఒక చేదువాస్తవాన్ని ప్రజలముందు బహిరంగంగా ప్రకటిస్తున్నది. భారత ప్రభుత్వం భారత ప్రజానీకానిది కాదని, భారత ప్రజల ప్రాణాలను దేశదేశాల సంపన్నులకు కారుచౌకగా అమ్మివేయదలచుకున్నదని మరొకసారి, బహుశా 1947 ఆగస్ట్ 15 తర్వాత గడిచిన అరవైమూడు సంవత్సరాలలో వెయ్యిన్నొకటోసారి ఈ బిల్లుతో రుజువవుతున్నది. ఈ బిల్లును నవంబర్ 20న కేంద్ర మంత్రివర్గం ఏకగ్రీవంగా ఆమోదించింది. ఇప్పుడు పార్లమెంటు ఆమోదిస్తే ఇది చట్టం అయిపోతుంది. ప్రస్తుతానికి ప్రతిపక్షాలు ప్రణయకలహంలాగ దీన్ని వ్యతిరేకిస్తామని అన్నాయిగాని, ఇవాళ కాకపోతే రేపు ఇది చట్టమైపోతుంది. రెండు సంవత్సరాల కింద అమెరికా ప్రభుత్వంతో భారత ప్రభుత్వం కుదుర్చుకున్న అణు ఒప్పందం ప్రకారం అమెరికాకు చెందిన బహుళజాతి సంస్థలు ఇక్కడ అణువిద్యుత్ కర్మాగారాలు ఏర్పాటు చేయాలంటే ఇటువంటి చట్టం కావలసిందేనని కోరుతున్నాయి. ఒక అణువిద్యుత్ కేంద్రంలో ప్రమాదం జరిగితే, చనిపోయిన, అనారోగ్య పీడితులైన ప్రజల పట్ల ఆ కంపెనీకి ఎటువంటి బాధ్యత ఉంటుందో ఈ బిల్లు నిర్దేశిస్తున్నది. ప్రమాద తీవ్రతతో, బాధితుల సంఖ్యతో సంబంధం లేకుండా కంపెనీ నిర్వాహకుల గరిష్ట బాధ్యత 500 కోట్ల రూపాయలుగా ఈ చట్టం చెపుతున్నది. ఎన్నివేలమంది చనిపోయినా, ఎన్ని లక్షలమంది అనారోగ్యం బారినపడినా, వాతవరణం ఎంత కలుషితమైనా, బహుళజాతిసంస్థ ఎక్కువలో ఎక్కువ 500 కోట్ల రూపాయలు పారేసి చేతులు దులుపుకుపోవచ్చు. మొత్తం నష్టపరిహారం రు. 2,100 కోట్లు దాటగూడదనీ, ఈ రెండు అంకెల మధ్యా తేడాను ప్రభుత్వమే భరించాలని, అంటే ప్రజలు చెల్లించిన పన్నుల ధనాన్నే ప్రజలకు నష్టపరిహారంగా ఇవ్వాలని కూడ ఈ బిల్లు ప్రతిపాదిస్తున్నది. అలాగే, ఆ అణువిద్యుత్ కేంద్రానికి అణుధార్మిక పదార్థాలను, పరికరాలను సరఫరా చేసే సంస్థలకు (ప్రధానంగా అమెరికన్ సంస్థలకు) ఎటువంటి బాధ్యతా ఉండదని, స్థానిక కంపెనీ నిర్వాహకులే పూచీ పడాలనీ ఈ బిల్లు చెపుతున్నది. భోపాల్ విషవాయు దురంతంలో యూనియన్ కార్బైడ్ సంస్థ 470 మిలియన్ డాలర్లు (దాదాపు రు. 2100 కోట్లు) నష్టపరిహారం ఇస్తేనే, అది బాధితులకు ఏ మూలకూ సరిపోలేదు. అంతకన్న భయంకరమైన ప్రమాదాలు జరిగే అవకాశం ఉన్న అణువిద్యుత్ కేంద్ర నిర్వాహకులు 109 మిలియన్ డాలర్ల కన్న ఎక్కువ నష్టపరిహారానికి బాధ్యత పడనక్కరలేదని మహాఘనత వహించిన యుపిఎ ప్రభుత్వం రాసి ఇస్తున్నది. ఇంతకీ ఎవరిదీ ప్రభుత్వం? మన మేలుకోసం, మన ప్రయోజనాలకోసం, మనను కాపాడుతుందనే ఆశతోనే దీన్ని మనం ఎన్నుకుంటున్నామా? ఎవడో పరాయిదేశపువాడు వచ్చి మన ప్రాణాలు తీస్తే, మన ఆరోగ్యాలు హరిస్తే, ఆ తర్వాత వాడికి ఏ నష్టమూ జరగకుండా ఎలాకాపాడాలో చాల జాగ్రత్తగా ఆలోచించి చట్టాలు చేస్తున్నదంటే ఈ ప్రభుత్వం ఎవరిదయి ఉండాలి? వీ

# లోపలి పేజీల్లో...

## ఫోకస్ : కేంద్ర, రాష్ట్ర బడ్జెట్లు

బడ్జెట్ అంటే స్థూలజాతీయాదాయం, ద్రవ్య లోటు, రెవెన్యూ లోటు, ద్రవ్యోల్బణం లాంటి సామాన్యుడికి అర్థం కాని పదజాలం ఉంటుంది. ఇవన్నీ దేశ ఆర్థిక వ్యవస్థ ధోరణులను విశ్లేషించే, అంచనా వేసే ఆర్థిక శాస్త్రవేత్తల స్థాయికి సంబంధించిన విషయాలు. ప్రధాని మొదలుకొని రిజర్వ్ బ్యాంక్ వరకూ తలోరకం అంచనాలు. అసలు బడ్జెట్ అంటేనే అంచనాలు. ఇంత ఆదాయం రావచ్చు, ఇంత ఖర్చు కావచ్చు - ఇలా అన్నీ అంచనాలే. 'ఆమ్ ఆద్మీ, ఆమ్ ఆద్మీ' అంటూ ప్రతి ఉపన్యాసంలో దండకం చదవకుండా నేరుగా ఆ సమస్యల గురించి ప్రభుత్వం ఏమి చెప్పింది, ఏమి చేసింది, చేయబోతుంది అని చెపితే సామాన్యునికి అర్థమవుతుంది.


| | | |
|---|---|---|
| ✦ ఇది అసామాన్యుల బడ్జెట్ | - వి. హనుమంతరావు | 9 |
| ✦ 2010-11 బడ్జెట్ నిగూఢ అర్థమేమిటి? | - జె. మనోహర రావు | 12 |
| ✦ రాష్ట్ర ఆర్థిక స్థితిగతుల సమీక్ష | - ఎన్. శ్రీదేవి | 14 |
| ✦ తిరిగి వచ్చిన నూతన ఆర్థిక విధానం | - ఆర్.వి. రమణమూర్తి | 17 |
| ✦ రాష్ట్ర బడ్జెట్ - సాంఘిక సంక్షేమం | - నేదునూరి కనకయ్య, సిఎచ్. శ్రీనివాస్ | 19 |

| | | | |
|---|---|---|---|
| ❖ కొత్త పుస్తకాలు / సి.డి.లు | | | 6 |
| ❖ పాఠకుల వీక్షణం | | | 7 |
| ❖ ప్రాంతీయం | | | 8 |
| ❖ *విధానవిమర్శ* | పేదరికం క్షేమం - పేదలూ క్షేమం | - వి. హనుమంతరావు | 21 |
| ❖ *వర్తమానం* | మహిళా బిల్లు అందరి ఆమోదం పొందాలి | - వి. సంధ్య | 23 |
| ❖ *వర్తమానం* | చీమకుర్తి గ్రానైట్ దుర్ఘటన | - పులుగుజ్జు సురేష్ | 26 |
| ❖ *ప్రాంతీయాకాంక్షలు* | రాజకీయ సంకెళ్లలో తెలంగాణ | - కె. ప్రభాకర్ | 28 |
| ❖ *ప్రాంతీయాకాంక్షలు* | తెలంగాణ ఉద్యమం - కొత్త సవాళ్లు | - ఎర్ల పోచయ్య | 29 |
| ❖ *ప్రాంతీయాకాంక్షలు* | ప్రాంతీయ అసమానతలు : ప్రత్యేక రాయలసీమ | - అంగడి రంగారెడ్డి | 33 |
| ❖ పర్యావరణం | నిరాశపర్చిన కోపెన్‌హాగెన్ సదస్సు | - ఎ. నరసింహారెడ్డి | 36 |
| ❖ *సామాజికరంగం* | నారాయణపట్నా వేస్తున్న ప్రశ్నలు | - సుధా రామచంద్రన్ | 40 |
| ❖ ఆర్థికమాంద్యం | సామాన్యుల సంక్షోభం - సంపన్నుల సంక్షేమం | - ఇ.ఎస్. బ్రహ్మచారి | 42 |
| ❖ *సామాజికాంశం* | బ్యాంకింగ్‌లో అమలు కాని రిజర్వేషన్‌లు | - ఆస శ్రీరాములు | 44 |
| ❖ *దురాక్రమణ - చరిత్ర* | పాలస్తీనా పోరాట నేపథ్యం | - కె. నరేంద్రమోహన్ | 46 |
| ❖ ప్రాంతీయాకాంక్షలు | రాయలసీమ అస్తిత్వాన్ని గుర్తించాలి | - పాణి | 48 |
| ❖ నేర్చుకుందాం | సోషలిజం మార్గదర్శి ఇస్త్వాన్ మెస్జరోస్ | - జాన్ బెలామీ ఫాస్టర్ | 52 |
| ❖ *శాస్త్రవిజ్ఞానం* | మతవిశ్వాసాల పునాదులు | - డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 54 |
| ❖ దేశీయం | | | 56 |
| ❖ అంతర్దేశీయం | | | 57 |
| ❖ అసహజ మరణాల సూచి | | - రాంకి, వై. రామచంద్రం | 58 |


'వీక్షణం'లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **స్త్రీవాద సాహిత్యం – ఒక పరిశీలన** – డాక్టర్ నళిని – వందన ప్రచురణలు – హైదరాబాద్. 180 పేజీలు, 1/8 డెమీ, రు.70, రచయిత్రి చిరునామా : 1-1-780/1 & 2, ఫ్లాట్ నెం: 205, సుమాంజలి అపార్ట్‌మెంట్స్, గాంధీనగర్, హైదరాబాద్ – 500 080
- **విద్యార్థుల కోసం – శ్రీశ్రీ** – శ్రీశ్రీ శతజయంతి వేదిక – 36 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు : శ్రీశ్రీ శతజయంతి వేదిక, 9-66-15ఎ, న్యూ మారుతినగర్, తిరుపతి-2
- **నారాయణపట్నం ఆదివాసీ రైతాంగ పోరాట జ్వాలల్ని ఎవరూ ఆపలేరు** – ఆదివాసీ ఛసీ ములియా సంఘం, నారాయణపట్నం ప్రచురణ – 26 పేజీలు, 1/8 డెమీ, రు. 5, ప్రతులకు : నాచికలింగ, నారాయణపట్నం ఛసీ ములియా సంఘం అధ్యక్షుడు, బలియపుట్ గ్రామం, పొడపొదర పంచాయితీ, నారాయణపట్నం బ్లాక్, కోరాపుట్ జిల్లా
- **ప్రేమ** – మరికొన్ని సంగతులు – పెన్నా శివరామకృష్ణ – పాలపిట్ట బుక్స్ 131 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500036; సెల్ : 9848787284, ఇమెయిల్ : palapittabooks@gmail.com
- **కాంగిరేచుల మోసాల్ని తెలంగాణ మోసేదెన్నాళ్లు** – ఎం. రాఘవాచారి, పాలమూరు ప్రచురణలు, పాలమూరు అధ్యయన వేదిక, 16 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : ఎం. రఘవాచారి, కన్వీనర్, పాలమూరు అధ్యయన వేదిక, ఇ.నెం. 3-148, ప్లాట్ నెం. 41, శాంతి చంద్రిక, బాలాజీనగర్, మహబూబ్‌నగర్ – 509001, సెల్ : 9490909792
- **నటరాజ రామకృష్ణ** – వకుళాభరణం లలిత, కాశి సువర్చలాదేవి, వకుళాభరణం రామకృష్ణ, ఎమెస్కో – 228 పేజీలు, 1/8 డెమీ, రు.100, ప్రతులకు : ఎమెస్కో బుక్స్, సూర్యారావు పేట, విజయవాడ – 520002, ఫోన్ : 0866-2436643, 98499 92890; దోమలగూడ, హైదరాబాద్ – 500 029, ఫోన్ :040-23264092, ఇమెయిల్:emescobooks@yahoo.com; www.emescobooks.com
- **వాటాలు (షేర్లు)** – రంగనాయకమ్మ – సిపిఐ (ఎంఎల్) న్యూడెమొక్రసీ ప్రచురణ – 52 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : రామనర్సయ్య విజ్ఞాన కేంద్రం, లెనిన్‌నగర్, ఖమ్మం; ప్రజాపంథా, మార్ఫ్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 44; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **నదీ వరదా మనిషి** – (దీర్ఘ కవిత) – జి. వెంకటకృష్ణ – స్ఫూర్తి ప్రచురణలు – 31 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : జి. వెంకటకృష్ణ, 87-1287-1, సోమిశెట్టినగర్, కర్నూలు -2, సెల్ : 9866559584
- **అమ్మంటే...** – ఎన్. వి. రఘువీర్ ప్రతాప్ – ధర్మకేతనం సాహిత్య కళాపీఠం – 62 పేజీలు, 1/8 డెమీ, రు. 45, ప్రతులకు : ఎన్. వి. రఘువీర్ ప్రతాప్, మన్మణభావ మందిర్, ఇ.నెం. 6-81/1, టీచర్స్ కాలనీ, మర్లు, మహబూబ్‌నగర్ – 509002, సెల్ : 9440551552; శ్రీమతి జ్యోత్స్న, ఇ.నెం. 9-6-162/1, ఫ్లాట్ నెం. 103, జయశేఖర రెసిడెన్సీ, స్ట్రీట్ నెం. 14, మారుతినగర్, చంపాపేట్, హైదరాబాద్ – 500059; సెల్ : 9052121586
- **మా మట్టికోసం – మా హైదరాబాద్ కోసం** – వడ్డెబోయిన శ్రీనివాస్, అబ్దుల్ బాసిత్, వంగాల సంపత్‌రెడ్డి – బందగీ ప్రచురణలు – 13 పేజీలు, 1/6 డెమీ, రు. 5, ప్రతులకు : వడ్డెబోయిన శ్రీనివాస్, 25-4-115/2, రహమత్‌నగర్, కాజీపేట, వరంగల్ – 506003, తెలంగాణ; అబ్దుల్ బాసిత్, 2-4-1204/8/10/136, సెయింట్ పీటర్స్ హైస్కూల్ పక్కన, టివి టవర్ వెనుక, హనుమకొండ, వరంగల్ – 506001, తెలంగాణ; సెల్ : 9441348111; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో







మీ నిబద్ధతనూ, తపననూ ప్రతి అక్షరంలోనూ గమనిస్తున్నాను. మేధావులు (సూడో మేధావులు కాదు సుమా) మాత్రమే అవగాహన చేసుకోగల వ్యాస పరంపర పత్రిక వీక్షణం – సమకాలీన సమస్యలపై సామాజిక రుగ్మతలపై వీక్షణం – జాతిని జాగృతపరిచే పరికరంగా నిలవడం – ముదావహం. మరింత సర్క్యులేషన్ కొరకు పుస్తక సమీక్షలు చేస్తే మంచిదనిపిస్తుంది. సమీక్షంటే – ప్రస్తుతం మన పత్రికల్లో కనిపించే 'రచయితల వీపు గోకే' విధం కాదని మనవి! వీపు స్థానే గుండెల్ని గోకేవి. అవునూ! ఎం. ఆదిత్యగారూ, ఎన్ వేణుగోపాల్ రాయలేదు, చెప్పలేదు అని నిందించే బదులు మీకు లేదా ఆ బాధ్యత. కాదన్నదెవరు!

*– జాతశ్రీ*
కొత్తగూడెం, ఖమ్మం

మార్చ్ 2010 వీక్షణం సంచికలోని అమెరికన్ చరిత్రకారుడు హొవార్డ్ జిన్ స్మృతిలో ఆయన 1969లో రాసిన వ్యాసం 'మేధావిత్వం ఎందుకోసం?' నేటి పరిస్థితులకు కూడా చక్కగా అద్దం పడుతుంది. సరిగ్గా రాజకీయ నాయకుల లాగానే మేధావులు కూడా ప్రజల అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని ప్రజలకు కావల్సిన అవసరాలు కాకుండా, ప్రభుత్వానికేది అవసరమో దాన్ని బలప్రయోగం లేకుండా ప్రజలచేత మేధావుల వాగాడంబరపు ఉపన్యాసాల ద్వారా ఆమోదింప చేస్తున్నారు. ఇది ఒక మోసపూరిత చర్య అని హొవార్డ్ జిన్ చక్కగా వివరించిన వ్యాసం మేధావులను ఆత్మశోధన దిశగా, సామాన్యులను ఆలోచన దిశగా మార్చే విధంగా ఉంది. ఈ వ్యాసం పునర్ముద్రించినందుకు అభినందనలు.

*– పి. నారాయణరెడ్డి*
నాగార్జునసాగర్, గుంటూరు

మార్చ్ సంచికలో వచ్చిన నా వ్యాసంలో చివర 'గురయే' అని రాస్తే 'గురయ్యే' అని మార్చారు. దయచేసి ఇకపై అలా మార్చకండి. 'అయ్యింది, అయ్యే, అవ్వాలని' వగైరా ప్రయోగాలు ఇటీవలి కాలంలో కొందరు జర్నలిస్టులు ప్రవేశపెట్టిన యాస. మా నాన్న కాని, ఇతర పాతతరం రచయితలు కాని అలా రాయలేదు. 'అయే, అయాయి, అవాలని' అనే రాసేవారు.

*– కొడవటిగంటి రోహిణీప్రసాద్*
అట్లాంటా, యు.ఎస్.ఎ.

నేను మీ వీక్షణం పత్రికను 2006 చివరి నెల నుంచి రాయ్‌పూర్ సెంట్రల్ జైల్‌లో ఉన్న సమయంలో చదవడం ప్రారంభించాను. మధ్య మధ్య వచ్చిన అడ్డంకుల మూలంగా కొన్ని పత్రికలు చదవలేకపోయినా, ముఖ్యంగా 2009 నుండి అప్పుడప్పుడు కొన్ని పత్రికలు ఇప్పటి వరకు చదివాను. ఈ నాలుగు సంవత్సరాల కాలంలో మీ పత్రిక ద్వారా ఎన్నో కొత్త విషయాలు తెలుసుకోవడానికి అవకాశం కల్పించినందుకు మీకు నా కృతజ్ఞతలు. ఇక మీ పత్రిక గురించి చెప్పాలనుకుంటే నాకు పరిచయం అయిన ఈ నాలుగు సంవత్సరాల నుంచి చూసినప్పుడు పత్రికకు ఉన్న కొన్ని పరిమితుల మధ్య తన బాధ్యతను సరిగానే నిర్వర్తిస్తున్నదనే నా అభిప్రాయం. ఇటీవల పత్రికలు చాలా బాగున్నాయి. ముఖ్యంగా ప్రపంచాన్ని వణికిస్తున్న మహా మాంద్యంపై వచ్చిన వ్యాసాలు గానీ, భోపాల్ గ్యాస్ పీడితులు, చైనాపై వచ్చిన వ్యాసాలు కూడా చాలా బాగున్నాయి. మహా మాంద్యం తీవ్రతను గానీ దాని వ్యాపకతను గానీ అర్థం చేసుకోవడానికి ఎంతో దోహదపడిందని చెప్పవచ్చు. అంతే కాకుండా మాంద్యంపై ఉన్న అనేక రకాల సందేహాలను దూరం చేయడానికి ఆ వ్యాసాలు మాకు ఎంతో ఉపయోగపడ్డాయి. బూర్జువా ఆర్థికవేత్తలు గానీ, రాజకీయ నాయకులు గానీ రోజూ చేస్తున్న ప్రకటనల వెనక ఎన్ని అబద్ధాలున్నాయో ఈ నాలుగు గోడల మధ్య ఉన్న మాకు తెలుసుకోవడానికి దోహదపడేలా వ్యాసకర్తలు చేసిన కృషికి మా అభినందనలు.

*– పుగ్గే చంద్రమౌళి*
నాగ్‌పూర్ సెంట్రల్ జైల్

మార్చ్ సంచిక 5వ పేజీలో 'వీక్షణంలో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు' అని ప్రచురించారు. అంటే సంపాదకత్వం వెలుబుచ్చే అభిప్రాయాలు మాత్రమే పాఠకులు అంగీకరించాలా?

*– వి.ఎస్. రావు*
సనత్‌నగర్, హైదరాబాద్

'వీక్షణం' ఫిబ్రవరి సంచికలో రిజర్వేషన్‌లపై చిత్తశుద్ధి లేని ప్రభుత్వాలు అనే వ్యాసం చదివాను. ఈ వ్యాసంలో రచయిత దళిత క్రిస్టియన్‌లకు ఎస్.సి. హోదా కల్పించడం, ఎస్.సి. రిజర్వేషన్‌ల వర్గీకరణ అనే రెండు విషయాలను వివరించారు. అయితే ఈ రెండు అంశాలలో దేనిని కూడా స్పష్టంగా, సమగ్రంగా వివరించలేదు. దళితుల్లో వర్గీకరణ చేయాలనే రాజకీయ పార్టీలు వారికోసం ఏం చేశాయని ప్రశ్నించారు. అగ్రవర్ణ రాజకీయ పార్టీలు దళితుల కోసం ఏదో చేస్తాయని ఊహించడమే పొరపాటు. ఎస్.సి. వర్గీకరణలో న్యాయం ఉన్నది కాబట్టే అన్ని పార్టీలు సమర్థించాయి. కుల వివక్ష నివారణ కోసం దళితులంతా ఏకమై కృషి చేయాలి. దీనికోసం ఒక మహా ఉద్యమాన్ని చేపట్టి ప్రభుత్వంపై ఒత్తిడి పెంచి సమస్యను నివారించుకోవాలి. దళిత విద్యార్థుల విద్య, ఉద్యోగాలకు సంబంధించి లెక్కలు తీయాలని రాశారు. వీటిపై ఇప్పటి వరకు లెక్కలు ప్రభుత్వం వద్ద ఉన్నాయి. ఇంకా సూక్ష్మ స్థాయిలో లెక్కలు తీసినా వాటిలో మాలల కంటే మాదిగలు వెనుకబడి ఉన్నారనే సత్యం తెలుస్తుంది. ఈ అసమానతల నివారణకే ఎస్.సి.లలో వర్గీకరణ కచ్చితంగా జరగాలి. దీనిపై మరో మాటలేదు.

దళిత క్రిస్టియన్‌లకు ఎస్.సి. హోదా విషయంలో ఈ క్రైస్తవులలో పేద దళితులకు దక్కాల్సిన ఎస్.సి. రిజర్వేషన్ ఫలాలు అందకపోవడం అన్యాయమైనది. ఎందుకంటే వీరు చర్చికి వెళ్లినంత మాత్రాన బిషప్, ఫాదర్స్ జాబితాలోకి చేరిపోరు. వారు పొందే సౌకర్యాలు పొందరు. కావున క్రైస్తవులలో క్రిమిలేయర్ పాటించి బిషప్స్, ఫాదర్లు మత సంస్థల డైరెక్టర్ (ఎయిడ్ పొందేవారు) లు మొదలైన వీరి జాబితాను మినహాయించి మిగిలిన సాధారణ, పేద క్రైస్తవులకు ఎస్.సి. హోదా కల్పించడం న్యాయమైనది.

మార్చ్ సంచికలో భల్లుగూడ గిరిజన మహిళలపై జరిగిన అత్యాచారానికి సంబంధించిన నిగ్గుతేలిన నిజాలను బిఎస్‌పి మాజీ ఎం.ఎల్.ఎ. లకే రాజారావు అందించిన వివరాలు మనసును కలచివేశాయి. అమాయక గిరిజన మహిళలపై గ్రేహౌండ్స్ పోలీసులు అఘాయిత్యానికి పాల్పడితే, ఆ నిజాలు బయటకు వస్తే ప్రభుత్వానికి కళంకం ఏర్పడుతుందని, తమ చేతుల్లోనున్న రాజ్యాధికారంతో నిజాలను అబద్ధాలుగా, అబద్ధాలను నిజాలుగా మార్చివేశారు. సరిగ్గా నాడు వాకపల్లి సంఘటనలో కూడా నిజం ఇలాగే సమాధి అయింది. ఈ రెండు ఘటనల్లో కూడా మాపై అత్యాచారం జరిగిందని ఆత్మాభిమానాన్ని చంపుకొని అమాయక మహిళలు గొంతెత్తి చెప్పినా వారిది అరణ్యరోదన అయింది. మనువాద భావజాలం గల వారి చేతిలో రాజ్యాధికారం ఉన్నంతకాలం ఇటువంటి సంఘటనలు అడ్డు, అదుపు లేకుండా జరుగుతూనే ఉంటాయి.

ఇటువంటి సంఘటనలపై పోరాటం చేయాలని దళిత బహుజన మేధావులకు, విద్యావంతులకు సూచించి వారి కర్తవ్యాన్ని గుర్తు చేయడం మరింత చైతన్యవంతమైనది. ఇప్పటి నుంచైనా రాష్ట్రంలోనున్న దళిత, బహుజన సంఘాలు, సంస్థలు, మేధావులు ఇటువంటి సంఘటనలు జరిగినపుడు రాష్ట్రవ్యాప్త ఐక్య ఉద్యమాలు చేయడం ఎంతైనా ప్రయోజనకరం. దీంతోపాటుగా ఈ వర్గాల ప్రజలను రాజ్యాధికారం వైపు ప్రయాణింపజేయడం మేధావి, విద్యావంతుల కనీస కర్తవ్యం. రాజ్యాధికారంపై డా. బాబాసాహెబ్ అంబేద్కర్ చెప్పిన మాటలు మనకు స్ఫూర్తిబాటలు కావాలి.

*– డా. తడకమళ్ల శేఖర్*
ఖమ్మం

**వీక్షణానికి చేయూత...**

మా విన్నపాన్ని మన్నించి, వెంటనే స్పందించి తూర్పు గోదావరి జిల్లాలోని 40 గ్రంథాలయాలకు వీక్షణంను పరిచయం చేయడానికి అనుమతించి, వీక్షణం సామాన్య పాఠకులకు చేరడంలో సహకారం అందించిన తూర్పు గోదావరి జిల్లా గ్రంథాలయ చైర్మన్ **బైర్రాజు ప్రసాదరాజు** గారికి, కార్యదర్శి **సి. వసుంధర** గారికి మా హార్దిక కృతజ్ఞతలు.

పత్రిక నాలుగు కాలాలు నడవాలనే లక్ష్యంతో మాకు వెయ్యి రూపాయల ఆర్థిక సహకారాన్ని అందించిన మిత్రులు **డా. ఎం.ఎఫ్. గోపీనాథ్** (ఖమ్మం) గారికి కృతజ్ఞతలు. – సం.

## వస్తు బహిష్కరణ

తెలంగాణను వ్యతిరేకిస్తున్న సంపన్నవర్గాల వస్తువులు, సేవలు, ఉత్పత్తులను బహిష్కరించాల్సిందేనని తెలంగాణ జెఎసి కన్వీనర్ కోదండరాం ఫిబ్రవరి 23న పునరుద్ఘాటించారు. అదేపనిగా తెలంగాణకు అడ్డుపడుతూ, విద్యార్థులపై దాడులకు కారణమవుతూ, రెచ్చగొట్టే వ్యాఖ్యలతో తెలంగాణలో ఆత్మహత్యలు పెరగడానికి కారణమవుతుంటే, నైతికంగా వారి కార్యకలాపాలను, వ్యవహారాలను సమర్థించలేమని ఆయన పేర్కొన్నారు.

## కార్మికుల సజీవ సమాధి

ప్రకాశం జిల్లా చీమకుర్తిలో ఫిబ్రవరి 25 రాత్రి ఏడు గంటల సమయంలో హంసా మినరల్ గ్రానైట్ కంపెనీ క్వారీలో పెద్ద బండరాళ్లు విరిగి పడ్డాయి. వంద మీటర్ల ఎత్తులో ఉన్న పెద్ద పెద్ద రాళ్లు ఒకేసారి విరిగిపడడంతో అందులో పనిచేస్తున్న 17 మంది కార్మికులు బండరాళ్ల మధ్య చిక్కుకొని మరణించారు.

## పంట భూములు సెజ్‌ల పరం!

రాష్ట్రానికి వచ్చిన, అనుమతించిన వంద సెజ్‌ల కోసం రాష్ట్ర ప్రభుత్వం అరవై వేల ఎకరాల భూమిని సేకరించింది. ఈ భూములలో ప్రభుత్వ, ప్రైవేట్, అసైన్డ్, వ్యవసాయ, వ్యవసాయేతర భూములు ఉన్నాయి. సేకరించిన భూమిలో ముప్పై వేల ఎకరాలు అచ్చంగా వ్యవసాయ భూములే. ప్రభుత్వం చెప్పిన పరిశ్రమలు ఇంతవరకు రాలేదు. కొంతమంది భూములకు పరిహారం ఇప్పటికీ అందలేదు. ప్రచారం చేసిన 8.9 లక్షల ఉద్యోగాలకు గాను అరవై రెండు వేల ఉద్యోగాలు మాత్రమే వచ్చాయి.

## ఏదీ భాషాభివృద్ధి?

ప్రామాణిక భాషాభ్యాసంపై మార్చ్ 3న శ్రీకాకుళంలో సదస్సు జరిగింది. ముఖ్య అతిథిగా కె.కె. రంగనాథాచార్యులు సదస్సులో మాట్లాడుతూ సాహిత్యం ద్వారా భాషాబోధన అంతగా ఉపయోగపడడం లేదన్నారు. విద్యాభ్యాసం దశలోనే తెలుగు మాధ్యమాన్ని అమలు చేయాలన్న ఆశయం ఇప్పటికీ కార్యరూపం దాల్చలేదన్నారు. తెలుగు భాషను ఎందుకు బాగా చదవలేకపోతున్నామో ప్రతి ఒక్కరూ ప్రశ్నించుకొని మూలాలను కనుక్కోవాలని సూచించారు. అక్షరాలు నేర్పినంత మాత్రాన భాషాభివృద్ధి కాదన్నారు.

## శ్రీకృష్ణ కమిటీ తొలిసారి రాక!

శ్రీ కృష్ణ కమిటీ మొదటిసారి మార్చ్ 4న హైదరాబాద్‌కు వచ్చింది. ఆ సందర్భంగా శ్రీకృష్ణ మాట్లాడుతూ 'రాజకీయ పార్టీల అభిప్రాయాలే కాకుండా, సామాన్యుల అభిప్రాయాలు కూడా తీసుకుంటామని, సామాన్యులే తమకు దిక్సూచీ' అని పేర్కొన్నారు. రాజకీయ పార్టీలు ఎన్ని అభిప్రాయాలు చెప్పినా, వాటిని విశ్లేషించేది తామేననీ, ఆత్మహత్యలు సమస్యకు పరిష్కారం కాదనీ ఆయన అన్నారు. శ్రీకృష్ణ కమిటీకి అభిప్రాయాలు తెలియజేయడానికి తొలుత ప్రకటించిన మార్చ్ 22 నుంచి గడువును ఏప్రిల్ 10కి పొడిగించారు.

## బిజెపి రాష్ట్ర అధ్యక్షుడిగా జి. కిషన్‌రెడ్డి

రాష్ట్ర బి.జె.పి. నూతన అధ్యక్షుడిగా జి. కిషన్‌రెడ్డి ఏకగ్రీవంగా ఎంపికయ్యారు. మార్చ్ 6న సికింద్రాబాద్‌లోని ఇంపీరియల్ గార్డెన్స్‌లో జరిగిన సమావేశంలో రాష్ట్ర కౌన్సిల్ ఎం.ఎల్.ఎ. జి. కిషన్‌రెడ్డిని అధ్యక్షునిగా ఎన్నుకుంది.

## ప్రపంచ కుబేరుల్లో తెలుగువాళ్లు

ప్రపంచ కుబేరుల జాబితాలో ముగ్గురు తెలుగువాళ్లు చేరారు. గ్రంధి మల్లికార్జునరావు (297వ స్థానం) ఆదాయం 3.2 బిలియన్ డాలర్లు (రు. 14,720 కోట్లు); జి.వి. కృష్ణారెడ్డి (937వ స్థానం) ఆదాయం ఒక బిలియన్ డాలర్లు (రు. 4,600 కోట్లు); కె. అంజిరెడ్డి (937వ స్థానం) ఆదాయం ఒక బిలియన్ డాలర్లు (రు. 4,600 కోట్లు).

## శాఖమూరి, కొండల్‌రెడ్డిల కాల్చివేత

మావోయిస్ట్ పార్టీ అగ్రనేత, కేంద్ర కమిటీ సభ్యుడు శాఖమూరి అప్పారావు (రవి), సోలిపేట కొండల్‌రెడ్డి (టెక్ మధు / రమణ) లు మార్చ్ 12న పోలీసు కాల్పుల్లో మరణించారు. ప్రకాశం జిల్లా పుల్లలచెరువు మండల పరిధిలోని నల్లమల అటవీ ప్రాంతంలో శాఖమూరి అప్పారావు, వరంగల్ జిల్లా తాడ్వాయ్ మండలం ఒడ్డుగూడెం అడవుల్లో కొండల్ రెడ్డి విగతజీవులయ్యారు. శాఖమూరిది వరంగల్ జిల్లా ఖానాపూర్ గ్రామం కాగా, కొండల్‌రెడ్డిది మెదక్ జిల్లా దుబ్బాక మండలం చిట్టాపూర్ గ్రామం. ఈ కాల్పులపై కుటుంబ సభ్యులు, ప్రజాసంఘాలు అనుమానాలు వ్యక్తం చేశాయి. ప్రజల కన్నీటి వీడ్కోలు మధ్య మార్చ్ 14న వారి అంత్యక్రియలు జరిగాయి.

## కోనేరు రంగారావు కన్నుమూత

కాంగ్రెస్ సీనియర్ నాయకుడు, ప్రముఖ దళిత నేత, మాజీ ఉప ముఖ్యమంత్రి కోనేరు రంగారావు (75) న్యూమోనియా వ్యాధితో చికిత్స పొందుతూ హైదరాబాద్‌లోని అపోలో ఆస్పత్రిలో మార్చ్ 16న మరణించారు. ఆయనది కృష్ణా జిల్లాలోని గూడవల్లి గ్రామం. భూ పంపిణీ కోసం ఏర్పాటు చేసిన కమిటీకి ఆయన నేతృత్వం వహించారు.

## పదోతరగతి పరీక్షలు

పదో తరగతి విద్యార్థులకు పరీక్షలు మార్చ్ 22 నుంచి ఏప్రిల్ 8 వరకు జరుగనున్నాయి. పరీక్షలకు రాష్ట్రవ్యాప్తంగా 13,63,851 మంది విద్యార్థులు హాజరుకానున్నారు. వీరిలో 10,76,376 మంది రెగ్యులర్ విద్యార్థులు కాగా, 2,87,475 మంది ప్రైవేట్ విద్యార్థులు.

## ఒకపక్క ధరలు – మరోపక్క తెలంగాణ

నిత్యావసరాలు, పెట్రో ధరలను తగ్గించాలని డిమాండ్ చేస్తూ టి.డి.పి., వామపక్షాలు వేలాది మందితో మార్చ్ 6న ఇందిరా పార్క్ వద్ద మహాధర్నా నిర్వహించాయి. ఈ సందర్భంలో టి.డి.పి. నేత చంద్రబాబునాయుడు తెలంగాణపై తన వైఖరిని తెలియజేయాలని తెలంగాణ లాయర్లు నినాదాలు చేయడంతో ఉద్రిక్తతకు దారితీసింది. లాయర్లు, తెలుగుదేశం కార్యకర్తల మధ్య జరిగిన ఘర్షణలో ఎక్కువ మంది లాయర్లు గాయపడ్డారు. వీ

*ప్రభుత్వ పెట్టుబడులను తగ్గించి, ప్రైవేట్ పెట్టుబడులను మరింత పెంచే దిశగా, సామాన్యులకు బతుకు భారమయ్యే విధంగా బడ్జెట్ రూపకల్పన జరిగిందని అంటున్నారు* **వి. హనుమంతరావు**

# ఇది అసామాన్యుల బడ్జెట్

కేంద్ర బడ్జెట్ ఉపన్యాసం అంటే స్థూలజాతీయాదాయం, ద్రవ్య లోటు, రెవెన్యూ లోటు, ద్రవ్యోల్బణం లాంటి సామాన్యుడికి అర్థం కాని పదజాలం దొర్లుతుంది. ఇవన్నీ దేశ ఆర్థిక వ్యవస్థ ధోరణులను విశ్లేషించే, అంచనా వేసే ఆర్థిక శాస్త్రవేత్తల స్థాయికి సంబంధించిన విషయాలు. ప్రధాని మొదలుకొని రిజర్వ్ బ్యాంక్ వరకూ తలో రకం అంచనాలు. అసలు బడ్జెట్ అంటేనే అంచనాలు. ఇంత ఆదాయం రావచ్చు, ఇంత ఖర్చు కావచ్చు - ఇలా అన్నీ అంచనాలే. పోనీ, అంతకు ముందు సంవత్సరంలో వేసిన అంచనాలు ఎంతవరకూ నిజమయ్యాయనే నికరమైన లెక్కలుంటాయా అంటే అవి ఇప్పుడే లభ్యం కావు. ఉదాహరణకు 2009-10 నికర లెక్కలు 2011-12 బడ్జెట్ పుస్తకాల్లోనే లభిస్తాయి. అప్పుడు 2009-10 బడ్జెట్‌లో ఎంత కేటాయించారో ఎవరికి గుర్తుంటుంది? అందరి దృష్టి 2011-12 కేటాయింపుల మీదే ఉంటుంది.

'వీక్షణం' పాఠకుల్లో కూడా చాలా చాలా కొద్దిమందికే అలాంటి లెక్కల అవసరముంటాయి. అందుచేత వాటన్నిటిలోకి పోకుండా సామాన్యులు అంటే కార్మికులు, రైతులు, అసంఘటిత కార్మికులు, ధరలు, నిరుద్యోగం లాంటి సమస్యల మీదే కేంద్రీకరించి, వాటినే వివరంగా ప్రస్తావిస్తే బావుంటుందనిపించింది. 'ఆమ్ ఆద్మీ, ఆమ్ ఆద్మీ' అంటూ ప్రతి ఉపన్యాసంలో దండకం చదవకుండా నేరుగా ఆ సమస్యల గురించి ప్రభుత్వం ఏమి చెప్పింది, ఏమి చేసింది, చేయబోతుంది అని చెపితే సామాన్యునికి అర్థమవుతుంది. కాని ప్రభుత్వానికి అది పచ్చి వెలక్కాయ గొంతులో అడ్డం పడ్డట్లవుతుంది. ఎందుచేతనంటే ఏమైనా సాధిస్తేగా చెప్పడానికి. గ్రామాల్లో సగం మంది నేరుగా, మిగతా సగం మంది పరోక్షంగా ఆధారపడే వ్యవసాయంతో విశ్లేషణ ప్రారంభిద్దాం.

బడ్జెట్ ఉపన్యాసంలో ప్రభుత్వం అంగీకరించినట్లు వ్యవసాయ రంగం వృద్ధి రేటు మైనస్ 0.2 కు దిగజారింది. దేశంలోని 81 భారీ నీటిపారుదల ప్రాజెక్టుల్లో నీటి ఎద్దడి ఏర్పడింది. జిడిపిలో వ్యవసాయ రంగం 15.7 శాతానికి పడిపోయింది. వ్యవసాయంలో ఉపాధి క్షీణత కనిపిస్తోంది. ద్రవ్యోల్బణం సరేసరి. పప్పు ధాన్యాలు, నూనెగింజల ఉత్పత్తి స్థంభించిపోయాయి. భూగర్భజలాలు ఇంకా ఇంకా అడుగంటుతున్నాయి. ఎరువుల వినియోగానికి, బడ్జెట్ ఉపన్యాసంలో పేర్కొన్న నూతన విధానం, డీజిల్ ధర పెరుగుదలతో వ్యవసాయ ఖర్చు పెరిగింది. మొత్తం మీద సుమారు 12 కోట్ల ప్రజానీకానికి ఆహారం అందించడానికి రైతు గాడిద బరువు మోస్తున్నాడు.

ఆర్థిక మంత్రికి పారిశ్రామికవేత్తల 'కష్టాలే' కనపడుతున్నాయి గాని, రైతులు మోస్తున్న బరువు, ఆ రైతుకు కాస్త ఊపిరి తీసుకొనే వెసులుబాటు కల్పించాలనే ఆలోచన రాలేదు. పైగా, నాలుగు సూత్రాల కార్యక్రమాన్ని ఆర్థికమంత్రి ప్రతిపాదించారు. 1) ఉత్పత్తి పెంచాలి, 2) దుబారానరికట్టాలి, 3) మరిన్ని రుణాలు, 4) ఆగ్రో-ప్రాసెసింగ్ పరిశ్రమ అభివృద్ధి. సబ్సిడీల కోత, ఎరువుల ధరల పెరుగుదల, నీటి ఎద్దడి సమస్యలు పరిష్కరించకుండా ఉత్పత్తి ఎలా పెరుగుతుంది?

రైతు పని పంట పండించడమే. దుబారా జరిగితే అది ఆ తర్వాతనే. ఆ పనులు రైతు పరిమితుల్లో లేవు. దుబారా జరిగేది రవాణాలో, ఫుడ్ కార్పొరేషన్ గోదాముల్లో. వాటిని పరిష్కరించడం ప్రభుత్వ బాధ్యత. మరిన్ని రుణాలివ్వాల్సింది బ్యాంకులు. రైతుల రుణావసరాల్లో 27 శాతమే బ్యాంకులు తీరుస్తున్నాయి. బ్యాంకులివ్వాల్సిన 18 శాతాన్ని పూర్తిగా ఇవ్వడం లేదు. ఇదీ ప్రభుత్వ బాధ్యత.

ఆగ్రో-ప్రాసెసింగ్ పరిశ్రమలు కార్పొరేట్ సంస్థలను ఆకర్షిస్తున్నాయి. అవి ఏర్పడే సూచనలు బాగానే ఉన్నాయి. ప్రాసెసింగ్‌లో ఏర్పడే అదనపు విలువలో కొంత భాగమైనా రైతుకు అందకపోతే అది రైతుకేమి లాభం? పైగా ప్రాసెసింగ్ చేసే ఉత్పత్తులు ప్రధానంగా విదేశాలకు ఎగుమతి అవుతాయి. అక్కడ వచ్చే లాభాలు రైతుకేమైనా అందుతాయా? ఈ నాలుగు పనులు జరగాలంటే ఆ పని ప్రభుత్వ శాఖల పరిధిలోనే ఉంది. కాగా ప్రభుత్వం ఏం చేస్తుందో ఆర్థిక మంత్రి వివరిస్తే బావుండేది కదా. పైగా ఆ నాలుగు పనులూ కొత్తవేమీ కావు. నిత్యం జరుగుతూ వస్తున్న కార్యక్రమాలే. అలాంటపుడు, ఏదో కొత్త కార్యక్రమం చేపట్టబోతున్నట్లు మాట్లాడతారేమిటి?

ఇంత ప్రాముఖ్యమైన రంగానికి ప్రణాళికలో ఎత్తెత్తు పీట వేశారా అంటే నడుస్తున్న సంవత్సరం సవరించిన అంచనా ప్రకారం కేటాయింపు రు. 10,123 కోట్లయితే, ధరలు పెరిగినా, ఇంకా పెరగనున్నా వచ్చే ఆర్థిక సంవత్సరంలో రు. 12,308 కోట్లు. అంటే మరో రెండు వేల కోట్లు మాత్రమే పెంచారు. మొత్తం ప్రణాళిక కేటాయింపులో 1.93 శాతం నుంచి 2.35 శాతానికి మాత్రమే పెరగనుంది. కాని పరిశ్రమలు, గనుల రంగం వచ్చేసరికి ఈ పెరుగుదల తొమ్మిది వేల కోట్లు. ఇదెవరి ప్రభుత్వం? ఆమ్ ఆద్మీ ప్రభుత్వమా?

మొత్తం ప్రణాళికా కేటాయింపు ప్రస్తుత సంవత్సరంతో పోలిస్తే వచ్చే ఏడాదిలో 8.6 శాతం పెరగనుంది. కాని ద్రవ్యోల్బణం రేటు 10 నుంచి 12 శాతం ఆహార వస్తువుల ద్రవ్యోల్బణం సుమారు 18 శాతం

అంటే వచ్చే సంవత్సరంలో ద్రవ్యోల్బణాన్ని గమనంలో తీసుకొన్నప్పుడు వచ్చే సంవత్సరంలో ప్రస్తుత సంవత్సరం కన్నా వాస్తవంలో తక్కువ ఖర్చు కాబోతుంది.

గ్రామీణ గృహ నిర్మాణాన్ని మినహాయించి మిగతా సామాజిక సేవలకు ఈ సంవత్సరంలో ప్రణాళికలో సవరించిన అంచనా ప్రకారం రు. 1,01,370 కోట్లు కాగా, వచ్చే ఏడాదిలో రు. 1,27,571 కోట్లు ఖర్చు చేస్తారు. ఈ పెరుగుదలలో ధరల పెరుగుదలను దృష్టిలో ఉంచుకొంటే, పెరిగినది ఏపాటి? ఈ కేటాయింపు కూడా ఎన్ని రంగాలకు? విద్య, వైద్యం, ఆటలు, సంస్కృతి, నీటి సరఫరా, పారిశుధ్యం, గృహనిర్మాణం, పట్టణాభివృద్ధి, ఎస్.సి., ఎస్.టి., వెనకబడిన తరగతులు, మైనారిటీలు, కార్మికులు, ఉపాధి, మహిళలు, సామాజిక భద్రత, పోషకాహారం, నా తలకాయ, నా శ్రాద్ధం – ఇన్ని కార్యక్రమాలకు ఖర్చు ఇంతేనా? పై శాఖలను గమనిస్తే ఇవన్నీ ఆమ్ ఆద్మీకి నేరుగా సేవలందించే రంగాలు. సమాజంలో 30 శాతం ప్రజలు ఉన్నత మధ్యతరగతి వర్గాలు, అత్యంత సంపన్నులను తీసి వేస్తే మిగతా 70 శాతం ప్రజలకు చేసిన కేటాయింపు.

ఇంకా లోతుకు పోయి చూస్తే ఉదాహరణకు వైద్యమే తీసుకుంటే, ఆ కేటాయింపులో సింహ భాగం పట్టణ, నగర ఆసుపత్రులకు పోగా, గ్రామీణ ప్రజల వైద్యానికి మిగిలేది ఎంగిలి మెతుకులే. మొత్తం ప్రణాళికలో ఈ రంగాలన్నింటికీ, అంటే 70 శాతం ప్రజలకు ఖర్చు చేయబోయేది 25 శాతమే. చప్పట్లు కొడదామా? ఇది ఆమ్ ఆద్మీ మురదాబాద్ అంటే వాస్తవానికి దగ్గరగా ఉంటుందేమో అని అనిపిస్తుంది. కాని మర్యాదగా ఉండదేమోనని 70 శాతం మంది బతుకు సంవత్సరం తర్వాత ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉండబోతుంది. అసలు ఆమ్ ఆద్మీ అంటే పాలకులకు ఒళ్లు మంట; వారి గురించి మాట్లాడే మాటలన్నీ తేనెపూసిన కత్తి. వారికి సంబంధించిన మరో శాఖ గ్రామీణాభివృద్ధి. వారికోసం అంటే ఆరు లక్షల గ్రామాల్లో నివసించే 70 శాతం ప్రజల అభివృద్ధి కోసం గృహ నిర్మాణంతో సహా ఖర్చు చేయబోయేది వచ్చే సంవత్సరంలో అదనంగా రు. 3600 కోట్లు మాత్రమే. ఖర్చు చేసారనే అనుకొందాం. ఫలితాలు అందాల్సిన వారికి అందుతాయా. ఇదివరకు అందాయా అని చూస్తే ఏం కనపడుతుందో మీ అందరికీ తెలిసిన విషయమే.

ఎక్సైజ్ సుంకం పెంచడం వల్ల ప్రభుత్వానికి అదనపు ఆదాయం రు. 32 వేల కోట్లని అంచనా. ఈ భారాన్ని పారిశ్రామికవేత్తలు ప్రజల మీదకు నెట్టివేయరా? సిమెంట్, ఉక్కు ధరలు పెరిగితే, ఆ బరువు గృహ నిర్మాణం మీదపడి మధ్యతరగతిని ప్రభావితం చెయ్యదా? ఆదాయపు పన్నులో వెసులుబాటు కల్పించినట్లే కల్పించి, కుడి చేత్తో ఇచ్చిన దానిని పెట్రోల్ ధరలు పెంచి, గృహ నిర్మాణ ఖర్చు పెంచి, ధరలు పెంచి ఎడమ చేత్తో తీసుకోవడం లేదా? పెట్రోల్, డీజిల్ ధరల పెరుగుదల కారణంగా ద్రవ్యోల్బణం పెరగదని ఆర్థికమంత్రి అనవచ్చు. కాని మధ్యతరగతి, రైతాంగం ద్రవ్యోల్బణం పెరగదా? బడ్జెట్‌లో చూపించిన మొత్తం ఖర్చు 8.5 శాతం పెరిగిందనీ, అంటే ప్రజల కోసం ఎక్కువ ఖర్చు చేస్తున్నామని ప్రజలు అనుకోవాలని ఆర్థికమంత్రి కోర్కె కాని ద్రవ్యోల్బణాన్ని గమనంలోకి తీసుకొంటే ఖర్చు వాస్తవంలో తగ్గుతుందనడం వాస్తవం కాదా?

పై విశ్లేషణ ప్రకారం ఆమ్ ఆద్మీ బతుకులు మరింత బండబారి పోతాయనేది ఖాయం. అయినా ప్రధాని దృష్టిలో ఆర్థికమంత్రి బ్రహ్మాండమైన బడ్జెట్ ప్రవేశపెట్టారని కితాబు. సోనియాగాంధీ కూడా.

బడ్జెట్ పూర్తి చిత్రం ఆవిష్కరణ కోసం రూపాయి బిళ్ల రెండో వైపున కూడా చూడాలి. నాలుగైదు సంవత్సరాల క్రితం చిదంబరం ప్రవేశపెట్టిన డ్రీమ్ బడ్జెట్ లాంటిది కాకపోవచ్చు గాని, ప్రణబ్ రెండవ బడ్జెట్ కూడా అదే దిశగా పయనిస్తోంది. వామపక్షం 'అడ్డం' తొలగిపోవడంతో, ప్రభుత్వానికి ఆ అడ్డంకి తొలగిపోయింది. కార్పొరేట్ రంగం కోరుకుంటున్నట్లుగా, బజాజ్ మాటల్లో 'ఆర్థిక పరిస్థితి సంస్కరణల బాట పట్టింది'. పారిశ్రామిక వర్గాలు మొత్తం మీద హర్షం వ్యక్తం చేశాయి. అక్కడక్కడ సన్నాయి నొక్కులు నొక్కినా, ధోరణి మాత్రం అదే. బడ్జెట్ ఉపన్యాసం పొడవునా ప్రైవేటీకరణ, ప్రైవేట్ – పబ్లిక్ ఉమ్మడి రంగం, పారిశ్రామిక రంగానికి రాయితీలు, తయారీ రంగానికి జేజేలు, ఎగుమతులకు ప్రోత్సాహకాలు భారీగా చోటుచేసుకొన్నాయి. ప్రైవేట్ రంగం చేయూతనిస్తే గాని, ఆర్థిక పరిస్థితి తన కాళ్లమీద తాను నిలబడలేని స్థితి. ఆ ఇంద్రుడే మనకు అండగా నిలవాలని ప్రణబ్ చేతులెత్తి మొక్కుకున్నారంటే, పరిస్థితి ఎంత కనాకష్టంగా ఉందో అర్థమవుతుంది. ఒకపక్క ఆర్థిక జీవనం సరైన దిశలోనే ప్రయాణిస్తుందని అంటూనే రెండో పక్క ఇంద్రుణ్ని సాయం కమ్మని కోరడం – ఎందుకు.

ప్రైవేట్ రంగానికి పెద్దపీట వేయడానికి బ్యాంకింగ్ రంగాన్ని ఎంచుకొన్నారు ఆర్థికమంత్రి. ప్రపంచ సంక్షోభాన్ని మన బ్యాంకింగ్ రంగం తట్టుకొని నిలబడిందని మనం గర్వంగా చెప్పుకొన్నాం. అది ప్రభుత్వరంగంలో ఉంది కనుకనే, బ్యాంకు ఉద్యోగులు రక్షణ కవచంగా నిల్చారు కనుకనే, అది సాధ్యమైంది. ప్రైవేట్ రంగానికి పట్టం కట్టిన అమెరికాలోనే బ్యాంకులు టపటపా నేలరాలాయి. కొమ్ములు తిరిగిన ఆర్థిక శాస్త్రవేత్తలు మార్క్స్ పుస్తకాలు తిరగేయడం ప్రారంభించారు. అలాంటి ప్రభుత్వ రంగం కంచుకోటలోకి రమ్మనమని ప్రైవేట్, విదేశీ బ్యాంకులకు తలుపులు బార్లా తెరిచారు. ఇందిరాగాంధీ బ్యాంకులను జాతీయం చేయక ముందు ప్రైవేట్ బ్యాంకులు తమ బ్యాంకుల్లో నిధులను తమ స్వప్రయోజనాలకు వాడుకొంటున్నాయని, ఆ నిధులు దేశాభివృద్ధికి తోడ్పడాలని ఇందిరాగాంధీ జాతీయం చేస్తే, ఆమె కోడలు సోనియాగాంధీ ఆ ప్రైవేట్ రంగానికి పచ్చజండా ఊపింది. ఉద్దీపన పథకాన్ని పాక్షికంగా ఉపసంహరించుకొంటేనేమి, పూర్తిగా ఉపసంహరించుకొంటేనేమి, బ్యాంకులు జాతీయత నుండి విముక్తి పొందితే కార్పొరేట్ రంగానికి పండగే.

ప్రైవేటీకరణకు రెండో ఉదాహరణ ప్రభుత్వరంగ సంస్థల్లో ప్రభుత్వ వాటాను పది శాతం మేరకు తగ్గించుకొని ప్రైవేట్ రంగానికి స్థానం కల్పించడం. పాతికవేల కోట్ల రూపాయలను ఈ విధానం ద్వారా సంపాదించాలని ప్రభుత్వ సంకల్పం. కాని జరిగిందేమిటి? విద్యుత్ కొరతను నివారించడానికి గణనీయమైన కృషి చేస్తున్న నేషనల్ థర్మల్ పవర్ కార్పొరేషన్‌లో పది శాతం షేర్లను షేర్ మార్కెట్‌లో అమ్మకానికి పెడితే, ఇన్వెస్టర్లు ఎటువంటి ఆసక్తిని చూపకపోతే, మళ్లీ ప్రభుత్వ రంగ సంస్థలే ఆ షేర్లను కొని ప్రభుత్వం పరువు కాపాడాల్సిన పరిస్థితి ఏర్పడింది. మరో ప్రభుత్వరంగ సంస్థకు కూడా ఇలాగే చుక్కఎదురైంది. అంటే ఈ విధానాన్ని ప్రజల మాట అలా ఉంచి ఇన్వెస్టర్లు కూడా

**1616 కంపెనీల బ్యాలెన్స్ షీట్ల విశ్లేషణ**

(రు. కోట్లు)

| | 2002-03 | 2003-04 | 2004-05 | 2005-06 | 2006-07 | 2007-08 | 08-09 |
|---|---|---|---|---|---|---|---|
| **నికర లాభం** | | | | | | | |
| పబ్లిక్ | 28363 | 36870 | 47382 | 45020 | 59124 | 65784 | 56686 |
| ప్రైవేట్ | 23550 | 36672 | 60176 | 76163 | 117989 | 157275 | 116822 |
| **మొత్తం ఆస్తులు** | | | | | | | |
| పబ్లిక్ | 340468 | 383150 | 435901 | 491998 | 565295 | 676906 | 788608 |
| ప్రైవేట్ | 629891 | 699894 | 828947 | 1018511 | 1366683 | 1889071 | 2309119 |

ఆమోదించలేదు. అయినా కూడా వచ్చే ఏడాదిలో 25 వేల కోట్లు ఈ రూట్ ద్వారా సంపాదించాలని ప్రయత్నించడాన్ని ఏమనాలి? దీనినే ఆంగ్లంలో 'సెల్లింగ్ ఫ్యామిలీ సిల్వర్' అంటారు. ఇది ప్రైవేటీకరణపై ప్రజలిచ్చిన తీర్పు.

ప్రభుత్వం తన బాధ్యతలను నిర్వర్తించలేని పరిస్థితి (ఉదాహరణకు విద్య, వైద్యం) ఏర్పడి, రానురాను తన బాధ్యతలను ముఖ్యంగా పేదలను ఉద్ధరించాల్సిన బాధ్యతలతో సహా ప్రైవేట్ రంగానికి దఖలు పరుస్తుందని, ఈ సంవత్సరం, రాబోయే సంవత్సరంలో మరింత వేగంగా ఆ దారిన ప్రయత్నిస్తుందని పైన చెప్పడం జరిగింది. అలాగని ఇదేదో కొత్త పరిణామం అని అనబోవడం లేదు. 1991లో ప్రవేశపెట్టిన సంస్కరణల ప్రధాన లక్ష్యం ఇదే. 'గవర్నమెంట్ హాస్ నో బిజినెస్ టు బి ఇన్ బిజినెస్' అనే ప్రపంచబ్యాంక్ ఆదేశిక సూచన అమలు అపుడే ప్రారంభమైంది. రాను రాను ఈ ధోరణి ఊపందుకుంటోంది. ప్రభుత్వ విధానాన్ని ప్రైవేట్ రంగం ఎలా సొమ్ము చేసుకుంటుందో పట్టికలో చూడండి.

పట్టిక ప్రకారంపైనుదహరించిన కాలంలో పబ్లిక్ రంగం లాభాలు రెట్టింపు అయితే, ప్రైవేట్ రంగం సుమారు అయిదు రెట్లు లాభాలార్జించింది. వాటి ఆస్తులు పబ్లిక్ రంగంలో సుమారు రెట్టింపు దాటితే, ప్రైవేట్ రంగం నాలుగు రెట్లు పెరిగాయి. ఉద్దీపన పథకం అమలు జరిగిన కాలంలో ఇవి ఇంకా లాభాలార్జించి ఉంటాయి. ఎలాగంటే, ఉద్దీపన పథకాలు వారి లాభాలను, ఆస్తులను రక్షించడానికే. ఇటీవలి కాలంలో భారతీయ కార్పొరేట్లు కూడా బహుళజాతి సంస్థల తమ్ముళ్లుగా తయారయ్యాయి. ఇతర దేశాల్లో పరిశ్రమలను స్థాపిస్తున్నారు; కొనేస్తున్నారు. దేశంలో, ఆఫ్రికాలో వేల ఎకరాల భూములు కొనేస్తున్నారు. వారి వద్ద నిధులు ఎలా మూలుగుతున్నాయంటే వాళ్లు బ్యాంకుల నుంచి రుణాలు తీసుకోవాల్సిన అవసరం లేకపోవడంతో బ్యాంకులు ఇబ్బంది పడుతున్నాయి.

ఇదీ రెండు ఇండియాల కథ. జిడిపి, తయారీ రంగం - ఆర్థికమంత్రి ధరించే కళ్లజోడుకు అమర్చిన రెండద్దాలు. ఆయన నోట ఆమ్ ఆద్మీ మాట వినపడుతుంది కాని ఆమ్ ఆద్మీ కనబడదు. వీ

**వ్యవసాయ దేశంలో రైతులు రోజూ ఆత్మహత్యల పాలవుతుంటే బడ్జెట్‌లో వ్యవసాయానికి ప్రాధాన్యత లేదని, ఉన్న పరిశ్రమలను కూడా ప్రైవేట్ పరం చేసే దిశగానే బడ్జెట్ ఉందని అంటున్నారు జె. మనోహర రావు**

# 2010-11 బడ్జెట్ నిగూఢ అర్థమేమిటి?

ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ ఫిబ్రవరి 26న లోక్‌సభలో ప్రవేశపెట్టిన 'సాధారణ బడ్జెట్' అసాధారణ లక్షణాలు కలిగి ఉన్నదని ఆర్థిక విశేషజ్ఞులు మెచ్చుకోలు ప్రశంసలు కురిపించడం అందరూ గమనించే ఉంటారు. బడ్జెట్‌లో నిర్దేశించిన లక్ష్యాలు ముఖ్యంగా 6.85 శాతం ద్రవ్యలోటును తక్షణమే 5.85 లేదా 5 శాతం వరకు కుదించడం, తర్వాత వచ్చే సంవత్సరాంతానికల్లా 9 శాతం వరకు నిర్దేశిత వృద్ధిరేటును సాధించుకోవడంపై నిష్ణాతులైన ఆర్థిక విశ్లేషకులు కూడా పెదవి విరిచి అసంతృప్తిని వ్యక్తం చేయడం చూసాం. అయితే బడ్జెట్ విశ్లేషణ అంటే కేవలం ఆదాయ వ్యయాలు, గణాంకాల పట్టికలు, రూపాయి రాక – రూపాయి పోక లాంటి వాటికే పరిమితమయి తాము గిరిగీసుకున్న చట్రంలో తామే చక్ర భ్రమణం చేస్తూ కాలం వెళ్లదీసే ఆర్థిక నిపుణుల విశ్లేషణలు సామాన్య మానవుడికి బడ్జెట్ ప్రహేళికా వినోదం పంచడంలో కృతకృత్యుమవుతూనే ఉంటాయి. ప్రతి ఏడాదీ ఉగాదికి పంచాంగ శ్రవణం వినిపించే ఉత్సాహాన్ని (కొంత నిరుత్సాహాన్ని కూడా) కలిగించే పురోహితుల్లాగా.

పంచాంగం, బడ్జెట్ రెండూ సామాన్య మానవుణ్ని పట్టించుకున్న దాఖలాలు తక్కువే. అయితే ప్రస్తుతం కేంద్రంలో అధికారంలో ఉన్న యుపిఏ – 2 ప్రభుత్వం సమ్మిళిత అభివృద్ధి, ప్రజాసంక్షేమానికి కంకణం కట్టుకున్నామని పదే పదే చెపుతూ వస్తోంది కాబట్టి ఈ ప్రహేళిక నిగూఢార్థం లోతుగా పరిశీలించవలసిన అవసరం ఉంది.

భారతదేశంలో అతి ముఖ్యమైన వ్యవసాయరంగానికి ప్రాధాన్యత నివ్వకపోవడం, వ్యవసాయోత్పత్తిని –0.25 నుండి రెండేళ్లలో 4.5 శాతం వృద్ధి సాధిస్తామని చెప్పుకోవడం నేలవిడిచి సాముచేయడం తప్ప మరొకటి కాదు. ప్రణబ్ నిర్దేశించుకున్న మూడు సవాళ్లలో మొదటి సవాలు, 9 శాతం వృద్ధి రేటును, వీలయితే రెండంకెల వృద్ధిని కూడా సాధించడం నిర్దిష్ట వ్యవసాయ ప్రణాళిక లేకుండా జరిగే పనికాదు. మూడేళ్ల క్రితం రైతుల ఆత్మహత్యలు నివారించడం కోసం రు. 60 వేల కోట్లు వ్యవసాయ రుణ మాఫీలు ప్రకటించడం, వ్యవసాయ పరపతి పరిధిని, సౌకర్యాలను పెంచడం చేసిన ఈ ప్రభుత్వం ఇప్పటికీ దేశవ్యాప్తంగా సగటున రోజుకు మూడు ఆత్మహత్యలు వ్యవసాయ రంగంలో జరుగుతుంటే ఏం చేయాలో పాలుపోని పరిస్థితిలో ఉంది. గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయేతర ఉపాధి కల్పించడంలో పూర్తిగా విఫలమయి, జాతీయ గ్రామీణ ఉపాధి హక్కు లాంటి తాత్కాలిక ఉపశమన చర్యలతో స్రవిస్తున్న గాయానికి లేపనం పూసే ప్రయత్నం చేస్తోంది. వ్యవసాయాధారిత దేశంగా పేరుగాంచిన 'అన్నపూర్ణ భారతి' ఆహార ద్రవ్యోల్బణంలో 17.85 శాతం నుండి 19 శాతం దిశగా కొట్టుమిట్టాడుతుండడం ఎవరి అసమర్థత?

గ్రామీణ మౌలిక సౌకర్యాలను పెంపొందించడం కోసం రు. 66,100 కోట్లను కేటాయించడంతో గ్రామీణాభివృద్ధి దానంతట అదే జరుగుతుందన్న చందాన వదిలి వేయడం సబబు కాదు. గ్రామీణాభివృద్ధికి శాశ్వత ఉపాధి కల్పన ప్రణాళిక లేనంత వరకు, వ్యవసాయాధారిత పరిశ్రమల పెరుగుదల అవకాశాలు కల్పించనంత వరకు గ్రామీణ పేదరికం అంతకంతకూ పెరుగుతూనే ఉంటుంది తప్ప, తగ్గదు. అంతేకాదు, ఉపాధి కోసం వలసలు పట్టణ ప్రాంతాల వైపు గణనీయంగా పెరుగుతాయి తప్ప తగ్గవు. అందుకే ప్రస్తుతం పట్టణ పేదరికం అంచెలంచెలుగా పెరుగుతూ గ్రామీణ పేదరికం కంటే అధికంగా 38 శాతం దాకా చేరుతోంది. వ్యవసాయోత్పత్తుల, ఆహార ధాన్యాల, దినుసుల నిత్యావసర వస్తువుల వినియోగంలో గణనీయమైన కుదింపు కనిపిస్తోంది. వేతనాలు, కూలీలు సంపాదించుకునే వర్గాలు తమ ఆదాయంలో పెద్ద మొత్తం ఆహారంపై వెచ్చిస్తారని అర్థ శాస్త్రజ్ఞుల నమ్మకం. ఆ నమ్మకాన్ని వమ్ము చేస్తూ మన దేశంలో 2005లో 38 శాతంగా నమోదు కాబడిన ఆహార వినిమయం దశల వారీగా తగ్గుతూ 2009–10కి దాదాపు 25 శాతంగా రికార్డ్ అయినట్టు గణాంకాలు చెబుతున్నాయి. అయితే గ్రామీణ ప్రజలు వాళ్లకొచ్చిన ఆదాయం దేనిపైన ఖర్చు పెడుతున్నారు? అంటే, గ్రామాల నుండి పట్టణాలకు ఉద్యోగావకాశాలు వెతుక్కుంటూ వెళ్లి పట్టణాల్లో ఏదో ఒక రకమైన రోజువారీ కూలీ పనుల కోసం దేబిరిస్తున్నారు. ఆ క్రమంలో వాళ్ల శ్రమ ఫలితమైన డబ్బు రవాణా సౌకర్యాలపైన, మొబైల్ ఫోన్లలో మాట్లాడుకోవాడనికి, పట్టణ జీవనశైలికి సరిపడే కట్టు, బొట్టుల కోసం వెచ్చించుకుంటున్నారు. ప్రపంచీకరణ ఇలా ప్రభావం చూపిస్తోందా అని ముక్కు మీద వేలువేసుకున్నా ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

హరిత విప్లవాన్ని నలభై సంవత్సరాల తర్వాత ఈశాన్య భారతానికో, మరెక్కడికో విస్తరించే ప్రయత్నం ఏం సూచిస్తోంది? 1969–70లలో వచ్చిన హరిత విప్లవం వ్యవసాయ రంగంలో కొన్ని ప్రత్యేక పెట్టుబడిదారీ వర్గాలకు, వ్యాపారీకరణకు, ఆర్థిక అసమానతలకు పెద్ద పీట వేసిన మాట మరిచారా? ఆహారోత్పత్తి రేటు మాట అటుంచి, భూస్వామ్య వర్గాలలోనే, నయా పెట్టుబడిదారీ వర్గాన్ని, గుండర్ ఫ్రాంక్ మాటల్లో 'లంపెన్ బూర్జువా' వర్గాన్నీ సృజించిన హరిత విప్లవం అసలు

నిజాన్ని మరిచిపోయారా? ఈ లంపెన్ బూర్జువా వర్గమే విదేశీ దళారీ వర్గంగా (కాంప్రడార్ కాపిటలిస్ట్) ఎదిగి రాజ్యాంగ యంత్రాన్ని విదేశీ పెట్టుబడికి అనుగుణంగా రూపాంతరీకరణ చేసే ప్రక్రియను మరిచిపోయారా? లేక ప్రస్తుతం విస్తృతంగా చొచ్చుకుపోయిన నయా ఉదారవాద ప్రపంచీకరణలో వినూత్న హరిత విప్లవం ద్వారా కొత్త కొత్త వర్గాల, నూతన ఆవిష్కరణల ఆవశ్యకతను ప్రణబ్ ఆర్థికమంత్రిగా, ప్రధాని మన్మోహన్ నేతృత్వంలో యుపిఎ-2 కొత్త చరిత్రను సృష్టించ దలచుకున్నదా?

భారత రాష్ట్రపతి ప్రతిభా పాటిల్ పదే పదే ప్రవచించిన సమ్మిళిత అభివృద్ధి కోసం ప్రత్యేకంగా నిర్దేశించిన సంక్షేమ కార్యక్రమాలు ఏమైనా ఉన్నాయా? అది పరిశీలించే ముందు తయారీ రంగాన్ని, పారిశ్రామిక వృద్ధిని కొంత తరచి చూద్దాం.

గణాంకాల గారడీ అనేది ఎన్నికల రాజకీయాలతో కూడుకున్న రాజకీయార్థిక వ్యవస్థలో స్తబ్ధుగా ప్రజల ప్రమేయంతో, ఆమోదంతో సంబంధం లేకుండా వ్యవస్థీకృతమైన కఠోర వాస్తవం.

2009 డిసెంబర్ చివరలో తయారీ రంగంలో నమోదుకాబడిన వృద్ధిరేటు 18.5 శాతం అని ఆర్థికమంత్రి ప్రణబ్ ఉవాచ. అయితే ఇది 2008, 2009 లకు చెందిన సంయుక్త వృద్ధిరేటు. అంటే సాలీనా కనుక తీసుకుంటే అది 9.25 శాతం మాత్రమేనని గమనించాలి. ఈ విషయాన్ని ఆర్థికమంత్రే స్వయాన ఒక ఇంటర్వ్యూలో ఒప్పుకున్నారు. అయితే ఈ విషయాన్ని ముందే ఎందుకు పేర్కొనలేదు? ఆశలు కల్పించడానికా?

ఏది ఏమయినా ప్రపంచ ఆర్థిక మాంద్య అస్తవ్యస్తాన్నుండి బయట పడడానికి మూడు విడతల ఉద్దీపన ప్యాకేజీలు భారతీయ కార్పొరేట్ రంగానికి దాదాపు ఐదు లక్షల కోట్ల రూపాయల వనరులని సమకూర్చి పెట్టాయి. దాని ఫలితమే అంతకుముందు 2006, 2007 లో 4.5-5 శాతంగా నమోదు కాబడిన పారిశ్రామిక వృద్ధిరేటు 9.25 శాతంగా పెరిగింది. ఇందులో ప్రభుత్వ రాయితీలు, కోల్పోయిన పన్నుల ఆదాయం (కార్పొరేట్ పన్ను) అంతా తీసివేస్తే 6 - 6.5 శాతం మాత్రమే పారిశ్రామిక వృద్ధి అని గమనించాలి. అయితే మన తయారీ రంగం గత పదిహేను సంవత్సరాలుగా ఉద్యోగావశాలు లేని తయారీ రంగంగా గుర్తింపు తెచ్చుకుంది.

2010-11లో కూడా తయారీ రంగంలో ఉద్యోగాలు 90 శాతం దాకా అసంఘటిత రంగం నుండే సమకూరడం మన ఆర్థిక వ్యవస్థ ద్వంద్వ లక్షణాల, అసంగతాల విపరీత లక్షణం.

ఆధునికీకరణ ప్రక్రియలో ముందుకు సాగుతూ, సాంకేతిక పరిజ్ఞానంలో, ముఖ్యంగా సమాచార సాంకేతిక, సమాచార సాంకేతిక ఆధార రంగాలలో ప్రామాణికంగా గుర్తింపు పొందుతూ 'బ్రిక్' (బ్రెజిల్, రష్యా, ఇండియా, చైనా) దేశాలలో సముచిత స్థానం పొందిన మనదేశం తయారీ రంగంలో, ముఖ్యంగా సంఘటిత రంగంలో ఉద్యోగాలు సృష్టించుకోలేకపోవడం ఒక స్పష్టమైన పారిశ్రామిక ప్రణాళికా రాహిత్యానికి అద్దం పడుతుంది.

పారిశ్రామిక పునాది పటిష్ఠం కాకుండానే సేవల రంగం చేవతో అభివృద్ధిని 'వాపు - బలుపు' తేడా లేకుండా అదే తోవలో వెళితే జారిపడే అవకాశం ఎక్కువ. అంతేకాదు, ద్రవ్యలోటును నియంత్రించే ప్రక్రియకు ఎంచుకున్న మార్గాలు కూడా ఎన్నో ప్రశ్నలు లేవనెత్తుతున్నాయి.

లాభాలు గడిస్తూ నవరత్నాలుగా పేర్కొన్న ప్రభుత్వరంగ సంస్థలను మార్కెట్లో తెగనమ్ముకుని నలభై వేల కోట్ల రూపాయల లక్ష్యంతో 1.5 శాతం ద్రవ్య లోటుని పూడ్చుకునే ప్రయత్నం ప్రణబ్ బడ్జెట్లో కనిపిస్తోంది. నోబెల్ అర్థశాస్త్రవేత్త జోస్టిగ్లిట్జ్ ప్రస్తుతం ఉన్న పరిస్థితుల్లో సబ్సిడీల కోత, సంక్షేమ కార్యక్రమాలను పక్కకు పెట్టడం, ప్రభుత్వ ఖర్చును అస్తవ్యస్తంగా తగ్గించుకునే ప్రయత్నాలు చేయడం ద్రవ్యలోటును తగ్గించకపోగా, పేదరికాన్నీ, ఆర్థిక అసమానతలనీ, వర్గ వైరుధ్యాలనీ పెంచి పోషించి రాజకీయ సంక్షోభాలను సృష్టించే ప్రమాదం ఉందని చెప్పడం విశేషం.

యుపిఎ - 2 ప్రభుత్వ విధానం సమ్మిళిత అభివృద్ధి పేద, దళిత బడుగువర్గాల అభివృద్ధి కోసం ఉద్దేశించిందా లేదా అటుంచి, ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్య నమూనా (పిపిపి) మాత్రం దిన దిన ప్రవర్ధమాన మవుతూ సంపూర్ణ ప్రైవేట్ స్వామ్య దిశగా అతి వేగంగా పరుగులు తీస్తున్నదనడంలో సందేహం లేదు. అయితే పిపిపిని మాత్రం పిపిఎఫ్ అంటే ప్రభుత్వ ప్రైవేట్ విదేశీ భాగస్వామ్య నమూనాగా పిలుచుకుంటే మంచిది. ప్రస్తుతం అతిపెద్ద టెలికాం కంపెనీ అయిన ప్రభుత్వ బిఎస్ఎన్ఎల్‌ను పూర్తిగా ప్రైవేటీకరించే మార్గంలో సామ్ పిట్రోడా నాలెడ్జికి ప్రభుత్వం కమిషన్ ఇస్తోంది.

ప్రణబ్ బడ్జెట్లో ఉన్న ఎన్నో అంశాలు వివాదాస్పదంగా ఉంటే విపక్షాలు కేవలం పెట్రో వడ్డనలపైనే తీవ్రనిరసన ఎందుకు చేసినట్టు? అంటే ప్రభుత్వ, ప్రైవేట్, విదేశీ స్వామ్యంలో భాగస్వాములు కావడానికి, ప్రపంచీకరణ ప్రక్రియకు సమర్థన తెలియజేయడానికి అధికార పక్షాలకూ, విపక్షాలకూ పెద్ద తేడా లేదని అనుకోవచ్చా? ✪

**వచ్చే సంచికలలో...**

- ❖ ఫోకస్ - మే 2010 : కార్మిక జీవితాలు - స్థితిగతులు
- ❖ ఫోకస్ - జూన్ 2010 : అరవై సంవత్సరాల రాజ్యాంగం
- ❖ రాయలసీమకు తెలంగాణ తేజం ఎప్పుడు? - అంగడి రంగారెడ్డి
- ❖ తెలంగాణ ఉద్యమం - ఆలోచించాల్సిన అంశాలు - పులుగుజ్జు సురేష్

*2010-11రాష్ట్ర బడ్జెట్‌ను గత ఆరు సంవత్సరాల బడ్జెట్‌లతో పోలుస్తూ రాష్ట్ర రాబడి, వ్యయాల్లో ఒడిదుడుకులను వివరిస్తున్నారు* **ఎన్. శ్రీదేవి**

# రాష్ట్ర ఆర్థిక స్థితిగతుల సమీక్ష

రాష్ట్ర ముఖ్యమంత్రి / ఆర్థిక మంత్రి 2010-11కి బడ్జెట్‌ను శాసనసభలో ప్రవేశపెట్టారు. ఈ బడ్జెట్ స్వరూపం గత మూడేళ్ల ఆర్థిక స్థితిగతుల ప్రతిబింబమని చెప్పవచ్చు. 2008-09లో ప్రపంచవ్యాప్తంగా ఉన్న ఆర్థిక సంక్షోభం మనదేశంపై / మన రాష్ట్రంపై పడడం వల్ల మన రాష్ట్రం ఆర్థిక ఒడిదుడుకులను ఎదుర్కొంటోంది అన్న మాట సర్వత్రా వినిపిస్తోంది. ఈ నేపథ్యంలో, ఈ ఒడిదుడుకులు అంతకు ముందు నుండే అంటే 2007-08 నాటి నుండే మన రాష్ట్ర రాబడి-వ్యయాల్లో మొదలయ్యిందని, ఆ పరిణామ క్రమంలో సూచించడానికే ఏడాదికేడాది వృద్ధిరేటు లెక్కించి వ్యత్యాసాలను, వాటి దిశను అందరి దృష్టికి తీసుకొచ్చే ప్రయత్నం ఈ వ్యాసంలో చేశాను.

ఈ వ్యాసం మొదటి భాగంలో 2006-07 ఆర్థిక పరిస్థితికి దోహదపడిన ముఖ్యాంశాలను ఆ తర్వాతి కాలంలో అంటే 2007-08, 2008-09, 2009-10లో ఆర్థిక స్థితిగతులను ప్రస్తావించాను. రెండవ భాగంలో ప్రస్తుత బడ్జెట్ 2010-11 గురించి క్లుప్తంగా చెప్పాను.

ఆర్థిక సంక్షోభ విషవలయం నుండి బయటపడడానికి చేపట్టిన సంస్కరణల ఫలితంగా (ఇతరత్రా పర్యవసానాల మాట అటుంచి) 2006-07లో అంతకు ముందున్న రెవెన్యూ లోటు తొలగి రెవెన్యూ మిగులు పరిస్థితి నెలకొంది. ద్రవ్యలోటు కూడా క్రమక్రమంగా తగ్గింది. క్యాష్ బ్యాలెన్స్ పెరిగి, వాటిని మళ్లీ జిఓఐ ట్రెజరరీ బిల్స్ రూపంలో పెట్టి వడ్డీ రాబడి పెంచుకోవడం మొదలైంది (గతంలో కన్నా).

ఆర్థిక పరిస్థితి మెరుగుపడడానికి దోహదపడిన అంశాల్లో ముఖ్యమైనది రాష్ట్ర స్థూల ఆదాయం వృద్ధిరేటు 11 శాతం పెరగడం కాగా, ఆర్థిక సంఘం ద్వారా కేంద్ర ప్రభుత్వం ఆర్థిక సంస్కరణల్లో భాగంగా సూచించిన ఎఫ్.ఆర్.బి.ఎం. బిల్ / చట్టం. దీన్ని మన రాష్ట్రంలో 2005లో ప్రవేశపెట్టి, అమలుపరిచి తద్వారా ఆర్థిక క్రమశిక్షణను పాటించి, ఆర్థిక పరిస్థితిని మెరుగుపెట్టుకున్నందుకు గాను లభించే ప్రోత్సహకాలను అందుకుంది. అంటే చట్టం అమలు ప్రక్రియలో కొంత వ్యయం తగ్గించుకుంటే, ప్రోత్సహకాల వల్ల (వడ్డీ / డెబ్ట్ రిలీఫ్) ఇంకొంత ఖర్చు తగ్గిందన్నమాట.

పన్ను రాబడుల విభాగంలో, సంస్కరణలలో భాగంగానే రాష్ట్రంలో వ్యాట్ పద్ధతిని అమలు చేయడం, మిగతా పన్నుల్లోను సవరణలు చేయడం వల్ల మన రాష్ట్రానికి పన్ను ఆదాయం పెరిగింది. అలాగే కేంద్రం నుండి వచ్చే పన్ను వాటా / గ్రాంట్లు కూడా బాగా పెరిగాయి. అదే విధంగా రాష్ట్ర పన్నేతర ఆదాయం కూడా పెరిగింది.

పై కారణాల వల్ల 2006-07లో (కిందటేడాదితో పోలిస్తే) రాష్ట్ర పన్ను ఆదాయం 22 శాతం పెరిగితే, రాష్ట్ర పన్నేతర ఆదాయం 80 శాతం పెరిగింది. పన్ను ఆదాయం పెరగడానికి వ్యాట్ పద్ధతి ముఖ్యకారణం కాగా, పన్నేతర విభాగంలో నాన్-ఫెర్రోస్ మైనింగ్ అండ్ మెటాల్లర్జికల్ ఇండస్ట్రీస్ నుండి వచ్చే ఫీజు, ఆర్థిక క్రమశిక్షణకు లభించిన వడ్డీ / రుణ విముక్తి రిలీఫ్ చెప్పుకోదగ్గవి. కేంద్రం నుండి లభించే పన్ను వాటా (27 శాతం), గ్రాంట్లు (24 శాతం) కూడా రెవెన్యూ ఆదాయం పెరగడానికి దోహదపడ్డాయి.

స్థూలంగా చెప్పాలంటే, 2006-07లో (అంతకు ముందు ఏడాది 2005-06తో పోలిస్తే) ప్రణాళికా వ్యయం 35 శాతం పెరిగితే, ప్రణాళికేతర వ్యయం 8 శాతం పెరిగింది. పెట్టుబడి వ్యయం 29 శాతం పెరిగింది. వ్యక్తులకు, సంస్థలకు ఇచ్చే అప్పులు, అడ్వాన్సులు 20 శాతం పెరిగాయి.

రెవెన్యూ ఆదాయం ఇదే సంవత్సరంలో 30 శాతం పెరిగితే, రెవెన్యూ వ్యయం 19 శాతం మాత్రమే పెరిగింది. ఈ కారణంగానే ఆర్థిక సంక్షోభం నుండి బయటపడి మొదటిసారిగా, చాలా కాలం తర్వాత రెవెన్యూ మిగులు చూశాం. ఇక మొత్తం వ్యయం (రెవెన్యూ + మూలధన వ్యయం) 16 శాతం పెరిగితే మొత్తం రాబడి (రెవెన్యూ + పెట్టుబడి రాబడులు) 18 శాతం పెరిగింది. దీనివల్ల ద్రవ్యలోటు కూడ రు. 8300 కోట్ల నుండి రు. 5643 కోట్లకు తగ్గింది. ప్రాథమిక (ప్రైమరీ) లోటు (ఫిస్కల్ లోటు – వడ్డీ చెల్లింపులు) ప్రాథమిక మిగులుగా మారింది.

కాని 2007-08లో (2006-07తో పోలిస్తే) రెవెన్యూ ఆదాయం పెరుగుదల రేటు ఎనిమిది పాయింట్లు తగ్గి 22 శాతం నమోదయింది. వివరాల్లోకి వెళితే ఒక్క గ్రాంట్లు మినహాయించి మిగతా వనరులన్నీ తక్కువ వృద్ధిరేటు చూపించాయి. పెట్టుబడి రాబడుల వృద్ధిరేటు (71 శాతం) చాల ఎక్కువ (అందునా మార్కెట్ రుణాల ద్వారా, భూముల స్థిరాస్తుల అమ్మకాల ద్వారా జరిగిన వసూళ్లే). దీంతో మొత్తం రాబడుల వృద్ధిరేటు దాదాపు 33 శాతంగా ఉంది.

2007-08 వ్యయం తాలుకు వివరాల్లోకి వెళితే, ప్రణాళికా వ్యయం దాదాపు 48 శాతం పెరిగితే, ప్రణాళికేతర వ్యయం 24 శాతం పెరిగింది. పెట్టుబడి వ్యయం 29 శాతం పెరిగితే, రెవెన్యూ వ్యయం 30 శాతం పెరిగింది.

2007-08 ఆర్థిక పరిస్థితి అంతకు ముందు ఏడాది కన్నా వ్యతిరేకంగా ఉంది. అంటే దిశ, దశ రెండూ ఈ కాలంలోనే మారినట్టు

**ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ 2010-11**

(రు. కోట్లలో)

| | 2005-06 అకౌంట్స్ | 2006-07 అకౌంట్స్ | 2007-08 అకౌంట్స్ | 2008-09 అకౌంట్స్ | 2009-10 బడ్జెట్ వ్యయం | 2009-10 రెవెన్యూ వ్యయం | 2010-11 బడ్జెట్ వ్యయం |
|---|---|---|---|---|---|---|---|
| **ఎ) రెవెన్యూ వసూళ్లు** | **34161.4** | **44245.5** | **54142.6** | **62858.5** | **78963.7** | **78406.0** | **90648.4** |
| 1. కేంద్రం నుంచి పంచుకునే పన్నులు | 6950.9 | 8866.0 | 11183.6 | 11801.5 | 12109.3 | 12109.3 | 14505.2 |
| 2. పన్ను ద్వారా రెవెన్యూ | 19611.5 | 23926.2 | 28794.1 | 33358.3 | 40664.0 | 40664.0 | 46999.0 |
| 3. పన్నేతర రెవెన్యూ | 3597.5 | 6487.8 | 7064.1 | 9683.4 | 12946.0 | 14106.4 | 15702.8 |
| 4. గ్రాంట్స్ ఇన్ ఎయిడ్ | 4001.6 | 4965.4 | 7100.7 | 8015.3 | 13244.4 | 11526.3 | 13441.4 |
| **బి) పెట్టుబడి వసూళ్లు** | **13402.0** | **12064.4** | **20604.1** | **17528.7** | **24557.4** | **21186.1** | **23026.9** |
| 5. ఒపెన్ మార్కెట్ రుణాలు | 1956.4 | 2725.9 | 6650.0 | 10933.6 | 16570.0 | 16351.4 | 14700.0 |
| 6. ఫ్లోటింగ్ బకాయిలు (గ్రాస్) | 0.0 | 0.0 | 0.0 | 0.0 | 3000.0 | 1000.0 | 3000.0 |
| 7. కేంద్ర రుణాలు | 522.3 | 314.6 | 909.0 | 396.9 | 2481.0 | 850.0 | 2081.0 |
| 8. ఇతర రుణాలు | 1492.0 | 1509.8 | 3573.4 | 4022.2 | 882.6 | 2293.5 | 1972.3 |
| 9. డిపాజిట్ల లావాదేవీలు (నెట్) | 9249.6 | 5153.0 | 2723.6 | 1812.5 | 1348.8 | 416.1 | 977.2 |
| 10. రుణాలు, అడ్వాన్సులు | 182.4 | 471.3 | 191.0 | 369.8 | 275.0 | 275.0 | 296.4 |
| 11. ఇతర వసూళ్లు | 0.0 | 1889.3 | 6557.7 | 0.0 | 0.0 | 0.0 | 0.0 |
| 12. కంటిన్జెన్సీ ఫండ్ (నెట్) | -0.8 | 0.5 | -0.6 | -6.2 | 0.0 | 0.0 | 0.0 |
| **సి) మొత్తం వసూళ్లు** | **47563.4** | **56309.9** | **74746.7** | **80387.1** | **103521.2** | **99592.1** | **113675.3** |
| **డి) ప్రణాళికేతర వ్యయం** | **34125.1** | **36890.7** | **45684.3** | **47766.5** | **63301.2** | **63067.1** | **73347.1** |
| 13. రెవెన్యూ ఖాతా పై | 28432.3 | 31919.7 | 40083.0 | 42862.0 | 55093.5 | 56343.7 | 63490.8 |
| 14. దానిలో వడ్డీ చెల్లింపులు | 7008.1 | 7280.3 | 7588.7 | 8057.1 | 9103.6 | 9103.6 | 10196.2 |
| **ఇ) పెట్టుబడి వితరణ** | **5692.8** | **4971.0** | **5601.3** | **4904.5** | **8207.8** | **6723.4** | **9856.2** |
| 15. పెట్టుబడి వ్యయం | -37.7 | -4.9 | -91.7 | -244.0 | 0.2 | 0.2 | 0.2 |
| 16. ఫ్లోటింగ్ బకాయిలు | 0.0 | 0.0 | 0.0 | 0.0 | 3000.0 | 1000.0 | 3000.0 |
| 17. పబ్లిక్ బకాయిల చెల్లింపులు | 573.9 | 529.7 | 1007.9 | 1782.7 | 2098.0 | 2098.0 | 1766.3 |
| 18. కేంద్ర రుణాలు | 606.7 | 1190.2 | 952.4 | 788.4 | 819.2 | 819.2 | 857.8 |
| 19. ఇతర రుణాలు | 4114.2 | 2532.9 | 3033.2 | 2262.1 | 2167.3 | 2682.9 | 4108.8 |
| 20. రుణాలు, అడ్వాన్సులు | 435.8 | 723.1 | 699.5 | 315.4 | 123.1 | 123.1 | 123.1 |
| **ఎఫ్) ప్రణాళికా వ్యయం** | **14503.1** | **19611.1** | **28987.4** | **32700.6** | **40184.1** | **36496.2** | **40313.3** |
| 21. రెవెన్యూ ఖాతాలపై | 6483.0 | 9518.7 | 13900.6 | 18992.2 | 21463.7 | 19119.9 | 23609.3 |
| 22. పెట్టుబడి ఖాతాలపై | 7699.4 | 9908.9 | 12865.7 | 10610.5 | 17977.1 | 16004.0 | 14337.1 |
| 23. రుణాలు, అడ్వాన్సులు | 320.7 | 183.5 | 2221.2 | 3097.9 | 743.3 | 1372.2 | 2367.0 |
| **జి) మొత్తం వ్యయం** | **48628.2** | **56501.8** | **74671.7** | **80467.2** | **103485.3** | **99563.2** | **113660.4** |
| **24. రెవెన్యూ వ్యయం** | **34915.3** | **41438.4** | **53983.6** | **61854.2** | **76557.2** | **75463.6** | **87100.1** |
| **25. పెట్టుబడి వ్యయం** | **7661.7** | **9904.0** | **12773.9** | **10366.5** | **17977.3** | **16004.3** | **14337.3** |
| **26. రుణాలు, అడ్వాన్సులు** | **756.5** | **906.7** | **2920.7** | **3413.4** | **866.4** | **1495.3** | **2490.0** |
| **27. పెట్టుబడి వితరణలు** | **5294.7** | **4252.7** | **4993.5** | **4833.1** | **8084.5** | **6600.1** | **9733.0** |
| **ఎచ్) రెవెన్యూ మిగులు** | **-753.9** | **2807.1** | **159.0** | **1004.2** | **2406.5** | **2942.4** | **3548.3** |
| **ఐ) ఫిస్కల్ లోటు** | **-8299.9** | **-5643.0** | **-8787.0** | **-12405.8** | **-16162.2** | **-14282.1** | **-12982.6** |
| **జె) ప్రాథమిక లోటు** | **-1291.7** | **1637.3** | **-1198.3** | **-4348.7** | **-7058.6** | **-5178.6** | **-2786.5** |

మూలం : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వార్షిక బడ్జెట్ ఇన్ బ్రీఫ్ ల నుంచి

తెలుస్తోంది. 2007-08లో రెవెన్యూ ఆదాయం వృద్ధిరేటు కన్నా రెవెన్యూ వ్యయం వృద్ధిరేటు ఎక్కువ. మొత్తం రాబడుల (రెవెన్యూ + పెట్టుబడి) వృద్ధిరేటు (32.74 శాతం) కన్నా మొత్తం వ్యయం వృద్ధిరేటు (32.16 శాతం) నామమాత్రంగానే తక్కువ (0.58 శాతం). దీంతో నామమాత్రపు రెవెన్యూ మిగులు కనిపిస్తోంది. ద్రవ్యలోటు రు. 8787 కోట్లకు పెరిగింది. ప్రాథమిక మిగులు కాస్తా ప్రాథమిక లోటు అయింది.

ఇదే పరిస్థితి 2008-09లో పునరావృతం అయింది. రెవెన్యూ రాబడుల పరిధిలో ఉన్న అన్ని వనరులు (ఒక్క పన్నేతర ఆదాయం తప్ప) క్రితం ఏడాదితో పోలిస్తే వృద్ధిరేటు తక్కువగా చూపించాయి. ఈ పన్నేతర ఆదాయం కూడా ఎక్కువ రేటు పెరగడానికి కారణం ఇదివరకూ పెట్టుబడి రాబడుల పద్దు కింద చూపించిన భూములు - స్థిరాస్తులు అమ్మగా వచ్చిన మొత్తంను పన్నేతర ఆదాయం పద్దులో వివిధ సాధారణ సర్వీసుల విభాగంలో చేర్చడమే. దీనికి తోడు పెట్టుబడి రాబడి వృద్ధిరేటు తిరోగమించింది.

వీటి ప్రభావం ఇదివరకూ పేర్కొన్న వివిధ రకాలైన వ్యయాలపై పడకుండా ఉంటుందా? 2008-09లో రెవెన్యూ మిగులు రు. 1004 కోట్లుగా చూపించినా, ద్రవ్యలోటు రు. 12,406 కోట్లకు పెరిగింది. ఇది క్రితం కన్నా రు. 3619 కోట్లు ఎక్కువ. అలాగే ప్రాథమిక లోటు కూడా పెరిగింది.

2008-09లో రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఇలా దిగజారడానికి ముఖ్యంగా ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఆర్థిక సంక్షోభమే అన్న వాదన ప్రబలంగా ఉన్న తరుణంలో, ఈ ఒక్క విషయాన్నే కారణభూతంగా చూపించడం ఎంతమాత్రం సబబు కాదనే విషయం తేట తెల్లమైంది కదా.

ఇక 2009-10 ఆర్థిక సంవత్సరానికి అందుబాటులో ఉన్నవి సవరించిన అంచనాలే కానీ వాస్తవాలు కాదు. వీటి ఆధారంగానే చూస్తే, రెవెన్యూ ఆదాయం పెరుగుదల రేటు 25 శాతం (2008-09 లెక్కలతో పోలిస్తే). అయితే రెవెన్యూ వ్యయం 22 శాతం. మొత్తం రాబడి రేటు 23.9 శాతం అయితే మొత్తం వ్యయం 23.7 శాతం. ఈ పెరుగుదల రేట్లను చూస్తే ఆర్థిక వ్యవస్థ మళ్లీ పుంజుకుందన్న ఆశాభావం కలుగుతుంది. అయితే సిఎజి (కాగ్) లెక్కల ప్రకారం 2009-10 సంవత్సరానికిగాను ఆగస్ట్ వరకూ వసూలైన రెవెన్యూ రాబడి అదే సంవత్సరపు బడ్జెట్ అంచనాల్లో 25.6 శాతం ఉంది. గత సంవత్సరంతో పోలిస్తే అదే ఆగస్ట్ వరకూ 6.46 శాతం రెవెన్యూ రాబడి కనిపిస్తుంది. అంటే ఈ ఆగస్ట్ వరకు రావల్సిన ఆదాయం వసూలు కాలేదనే చెప్పాలి. దాన్ని రాబోయే కాలంలో వసూలు చేసుకుంటారనేది వేరే సంగతి.

ఇక వ్యయం విషయానికొస్తే, రెవెన్యూ / పెట్టుబడి మొత్తం వ్యయం గత సంవత్సరం ఆగస్ట్ వరకు కంటే 2009 ఆగస్ట్ వరకూ చాల ఎక్కువగా ఉంటూ ద్రవ్యలోటును ఎక్కువగా చూపించడమే కాకుండా, రెవెన్యూ లోటును కూడా చూపిస్తోంది. అంటే రాబడి కన్నా వ్యయం ఎక్కువవన్నమాట. ఇది 3 ఆగస్ట్ 2009 వరకూ ఉన్న పరిస్థితి.

సెప్టెంబర్ 2009 నుంచి రాష్ట్ర పరిస్థితులు అలజడికి గురికావడం వల్ల వీటి ప్రభావం రాష్ట్ర ఆర్థికంపై ఏ మేరకు దారితీస్తాయో మనం ఊహించగలిగినా వేచి చూడాల్సిందే.

బడ్జెట్ రూపకల్పన ముందువరకూ అందిన రాబడులను / వ్యయాలను, అందిన రాబడులను / వ్యయాలను దృష్టిలో ఉంచుకొని, రాబోయే కాలంలో ప్రభుత్వం చేపట్టబోయే కార్యక్రమాల్ని చేర్చి తదనుగుణంగా 2010-11 సంవత్సరానికి బడ్జెట్ రూపొందించినట్లు భావించవచ్చు.

2009-10లో దాదాపు 25 శాతం హెచ్చుగా రెవెన్యూ రాబడులను సవరించిన అంచనాల్లో చూపితే, ప్రస్తుతం బడ్జెట్‌లో 15.6 శాతం (2009-10 సవరించిన అంచనాలతో పోలిస్తే) పెంచి అంచనా వేశారు. అంటే దాదాపు 10 పాయింట్లు తక్కువగా అంచనా వేశారన్నమాట. వివరాల్లోకి వెళితే ఒక్క కేంద్ర పన్నుల రాబడిలో రాష్ట్ర వాటాను మాత్రమే ఎక్కువగా ప్రభుత్వం ఆశిస్తోంది. సొంత రాబడులలో వృద్ధిరేటు (పన్ను, పన్నేతర) గతంలో కన్నా తక్కువగా అంచనా వేశారు.

ఎప్పుడైతే రాబడుల వృద్ధిరేటు తక్కువగా అంచనా వేశారో, దానికి తగ్గట్టుగానే ఖర్చుల విషయంలో కూడా బాగా తగ్గించారు. ప్రణాళికేతర వ్యయం 16 శాతం తగ్గింది. ప్రణాళికా వ్యయం ఒక శాతం తగ్గింది. రెవెన్యూ వ్యయం 7 శాతం తగ్గింది. పెట్టుబడి వ్యయం వృద్ధి రేటు (-10.42 శాతం) తిరోగమనమే. ఇంతలో పరిస్థితి ఉన్నా రెవెన్యూ మిగులు రు. 3548 కోట్లు అంచనా వేశారు. గతంలో కన్నా ఇది చాలా ఎక్కువ. ద్రవ్యలోటు తగ్గించే ప్రయత్నం చేశారు. అలాగే ప్రాథమిక లోటు కూడా. ఇన్ని వ్యత్యాసాలు ఉన్నప్పుడు ఏయే రంగాలకు ఎంతెంత కేటాయించారో, ఎందుకు కేటాయించారో ప్రత్యేకంగా చర్చించాల్సిన అవసరం ఉన్నదా? ☐

*బయట నుంచి వచ్చే పెట్టుబడుల వైపు, భవిష్యత్తులో పడబోయే వర్షం వైపు చూడడమే తప్ప బడ్జెట్‌లో సామాన్యుల కోసం నిర్దిష్టమైన ప్రణాళిక లేదంటున్నారు* **ఆర్.వి. రమణమూర్తి**

# తిరిగి వచ్చిన నూతన ఆర్థిక విధానం

వచ్చే ఆర్థిక సంవత్సరంలో 9 శాతం అభివృద్ధి రేటు సాధించడమే తమ ముఖ్య లక్ష్యంగా చెప్తూ ప్రణబ్ ముఖర్జీ తన బడ్జెట్ ప్రవేశపెట్టాడు. ఓ రోజు ముందు పార్లమెంట్‌లో సమర్పించిన ఆర్థిక సర్వే ద్వారా గత సంవత్సరంలో దేశం 7.2 శాతం అభివృద్ధిని నమోదు చేసుకుని ప్రపంచ ఆర్థిక మాంద్యంలో కుదేలైన దేశాలకు విరుద్ధంగా భారతదేశం చైనాతో దీటుగా ప్రయాణిస్తోందని చెప్పించారు. ఇలా చెప్పడంలో వారి ముఖ్య ఉద్దేశ్యం భారత దేశాన్ని ప్రపంచంలోకల్లా విదేశీ పెట్టుబడులు పెట్టడానికి అనువైన చోటుగా ప్రపంచ బజారులో నిలబెట్టడం. ఓ 4 శాతం అదనంగా విదేశీ పెట్టుబడులొస్తే చాలు మన ఆర్థిక ఆదాయం రేటు 9-10 శాతంగా పెరుగుదల ఉంటుందని వారి అంచనా. చివరికి ఆర్థిక అభివృద్ధి అంటే 10 శాతం 'అభివృద్ధి రేటు' సాధించడమేనని ఏలిన వారి ఉవాచ. అసలు ఓ పక్క విపరీతమైన ధరలు పెరిగి సామాన్యుల జీవితాలు అతలాకుతలం అవుతున్న సందర్భంలో వాటి ప్రస్తావనే లేకుండా సాగింది ప్రణబ్ ముఖర్జీ బడ్జెట్. గణాంకాల కీకారణ్యంలోకి పూర్తిగా పడిపోకుండా కొన్ని ముఖ్యమైన వివరాలు చూసి క్లుప్తంగా వాటి సారాంశం చెప్పడం ఈ వ్యాసం లక్ష్యం.

గత సంవత్సరంలో అంచనాలు తారుమారు చేస్తూ 7.2 శాతం చొప్పున భారత ఆర్థిక ఆదాయ రేటు పెరిగినా, వాటికి సేవా, పారిశ్రామిక రంగాలు 8.7, 8.2 చొప్పున పెరుగుతూ చోదక శక్తులయ్యాయని చెప్పినా, దాచేస్తే దాగని సత్యం మన వ్యవసాయం -0.2 రేటున కుదేలయ్యింది. గత సంవత్సరంతో పోలిస్తే ఆహార ధాన్యాలు 44 మిలియన్ టన్నులు (22 శాతం) తక్కువ పండాయి.

గతసారి ఖరీఫ్‌లో 15 మిలియన్ టన్నుల బియ్యం తక్కువ పండాయి. ఇవి రబీలో కవర్ కావడం అసాధ్యం. బియ్యం ఎందుకు ముప్ఫై రూపాయలు అయ్యాయో ఇప్పుడర్థం అవుతుంది. అంతకంటే ముందు సంవత్సరం గోధుమల ఉత్పత్తి పడిపోయి ధర కిలో ముప్ఫై రూపాయలకు చేరుకుంది. అలాగే ఈసారి కందిపప్పు కిలో వంద రూపాయలు అవడం మనం చూశాం. ఎందుకంటే పప్పు దినుసుల ఉత్పత్తి 8.2 శాతం దిగజారింది. అలా వానలు పడకో, వరదలొచ్చో పంట దిగుబడులు పడి పోగానే వ్యాపారస్తులు స్టాకులు పెట్టేసుకొని ధరలను పైకి లేపేయడం సర్వ సాధారణమైన విషయం. అలాంటి పరిస్థితులలో ప్రభుత్వాలు చేయాల్సింది తన గోదాములలో సరుకును వెంటనే బజారులో అమ్మడం. చౌక దుకాణాలకు పంపిణీ చెయ్యడం. బ్లాక్‌లో సరుకులు చేస్తున్న మిల్లర్లు, వ్యాపారస్తులపై కఠిన చర్యలు తీసుకోవడం. గత సంవత్సరం మన రాష్ట్రంలో విపరీతంగా స్టాకులు పెట్టుకున్న మిల్లర్లపై దాడులు జరిపిన పాపానికి రాజశేఖరరెడ్డి అప్పటి సివిల్ సప్లై కార్యదర్శి పూనం మాలకొండయ్యను అర్జంట్‌గా బదిలీ చేశారని అప్పటి వార్త. ఎందుకంటే ఎలక్షన్‌ల కోసం మిల్లర్లు సమర్పించుకున్న పార్టీ ఫండ్ వారు రాబట్టుకోవాలి కదా!

దరిమిలా ఆహార ధరల సూచిక 18.3 శాతం చొప్పున, టోకు ధరల సూచిక 8.9 శాతం చొప్పున పెరిగాయి. నిత్యావసర వస్తువుల ధరలు 20 శాతానికి చేరినట్టు గణాంకాలు వివరిస్తున్నాయి. కానీ ఈ ప్రభుత్వం వీటి గురించి ప్రస్తావించకుండా, అవి పెరుగుట తరుగుట కొరకే అన్న మానాన వాటి సహజ క్రమంలో (ఈసారి వానలు బాగా పడినప్పుడు) కింది కొస్తాయని మన్మోహన్ సింగ్ ఆశాభావం వ్యక్తం చేశారు. వారికిప్పుడు ఇవన్నీ పట్టవు. ఎందుకంటే ఓ నాలుగు శాతం విదేశీ పెట్టుబడులొస్తే చాలు ఆదాయం రేటు 10 శాతానికి చేరుకుంటుందని, వారి ఉవాచ. ఆపై వారి అనుయాయులైన కార్పొరేట్ వర్గాలు వారి వారి లక్ష్యాలను చేరుకుంటాయి. సామాన్యులకు సంబంధించిన వ్యవసాయ రంగం ఇప్పుడు కుంటుపడినా ఎలక్షన్‌లు ఇప్పుడే లేవు కాబట్టి వారికేం ప్రమాదం లేదు. మన్మోహన్ సింగ్ - సోనియాగాంధీల ప్రభుత్వం తమ సంక్షేమ విధానాల ముసుగును మెల్లమెల్లగా తీసివేస్తూ, తమ నయా ఆర్థిక విధానాలకు తిరిగి తెర తీస్తున్నారని అనిపిస్తోంది.

సామాన్య ప్రజలకు సంబంధించిన రెండవ అంశం పెట్రోల్, డీజిల్ ధరలకు ఈ బడ్జెట్‌లో పెంపుదల. పెట్రోల్ ధరలు లీటరుకు మూడు రూపాయలు చెయ్యడమే కాక దేశంలో ధరలను అంతర్జాతీయ ధరలతో ఇక అనుసంధానం చెయ్యడమే తమ విధానమని, కిరీట్ పారిఖ్ కమిటీతో మరీ చెప్పించి చేశారు. పెట్రోలియం కంపెనీలను నష్టాల బారిన పడకుండా కాపాడడానికే అని వారు చెప్పినా, ప్రభుత్వరంగ సంస్థలకు పోటీగా ప్రవేశపెట్టిన రిలయన్స్, షెల్ లాంటి సంస్థలకు లాభాలు ఆర్జించడమే ఈ ప్రభుత్వ భవిష్యత్ ప్రణాళిక అని అర్థం అవుతోంది. ఆహార ధరలతో పాటు, పెట్రోల్‌పై ధరలు అన్ని రంగాలలో ధరల పెరుగుదలకు దారితీస్తుందని, వాటి నియంత్రణ దేశానికి అత్యవసరమని, దానికోసం కొంత సబ్సిడీ భరించినా తప్పేం లేదని చెప్తే, ఇప్పుడు ఈ ప్రభుత్వం వినేలా లేదు. ఎందుకంటే దానిని ముకేష్ అంబానీ ఒప్పుకోదు గావాల్ను. ఓసారి ప్రపంచ ఆర్థికరంగం మళ్లీ పుంజుకుంటే, ప్రపంచ పెట్రోల్ ధరల భారానికి మనం అందరం ఇక రెడీగా ఉండాల్సిందే.

ఆర్థిక రంగం పెరుగుదలకు ప్రభుత్వం చేయగలిగింది ఏమీలేదని, అది చేయగలిగింది కాస్తా వీలైనంత తక్కువ ద్రవ్యలోటును సాధించి ధరల పెరుగుదలను నియంత్రించాలని నయా ఉదారవాదం వాదిస్తోంది. కేంద్ర బ్యాంక్ ద్రవ్య విధానం ద్వారా, వడ్డీరేట్లను మారుస్తూ మాత్రమే ధరల పెరుగుదలను నియంత్రించగలదని అది చెప్తుంది. ప్రభుత్వం తన పెట్టుబడులతో కానీ, తన ఖర్చుతో కానీ మార్కెట్లను ముందుకు నెట్టాలని చూస్తే, అది కేవలం ధరల పెరుగుదలకు మాత్రమే దారి తీస్తుందని, అందువల్ల పెద్దగా లాభం ఉండదనీ అది వాదిస్తుంది. పైగా ప్రభుత్వరంగ సంస్థలపై డబ్బు పెట్టడం పెద్ద శుష్కమని, దానివల్ల పన్నులు పెరిగి ప్రజల డబ్బుకు చిల్లుపడుతుందని నయా ఉదారవాద సిద్ధాంతాలు చెప్తాయి.

ఐ.ఎం.ఎఫ్., ప్రపంచబ్యాంక్‌లు ఈ సిద్ధాంతాలను నమ్మి, అప్పుకోసం వచ్చిన దేశాలను సరళీకృత విధానాల ద్వారా ఈ విధానాలను రుద్దుతూ ఉంటాయి. ఇవి బాగా ఒంటబట్టించుకున్న మన్మోహన్‌సింగ్ లాంటి ఆర్థికవేత్తలు తను ఆర్థికమంత్రిగా చేసిన 1991-96లో పాడిన పాటనే మళ్లీ ప్రణబ్‌ముఖర్జీ ఎత్తుకున్నాడని ఈ బడ్జెట్‌లో అర్థమవుతుంది. పైగా ద్రవ్యలోటు 4 శాతానికి చేర్చాలని ఓ చట్టం కూడా బిజెపి ప్రభుత్వకాలంలో చేశారు. ప్రపంచ ఆర్థిక మాంద్యం సందర్భంగా గత సంవత్సరం కార్పొరేట్ రంగాలను రక్షించడానికి ప్రభుత్వం వెచ్చించే ఖర్చు నుండి వచ్చే డిమాండ్ ద్వారా రక్షించడానికి మాత్రం వెసులుబాటు చేసుకున్నారు. ఆదాయ రేటు 7.2 శాతం అనంగానే, ఇక మళ్లీ తన ఖర్చుకు కళ్లెం వేసి, ద్రవ్యలోటును కిందికి తేవాలని ఆర్థిక సర్వే ద్వారా చెప్పింది.

ఈసారి ద్రవ్యలోటుని గతసారి 6.5 శాతం నుంచి 5.5 శాతానికి తెస్తామని ప్రణబ్ వాగ్దానం చేశారు. అయితే, వ్యవసాయం కుంటుబడి, పెట్రోల్ ధరల పెరుగుదల ద్వారా ప్రత్యక్షంగా ధరలు పెరుగుతున్నా ఉష్ట్రపక్షిలాగా కళ్లుమూసుకుని, ద్రవ్యలోటు నియంత్రణ ద్వారా ధరల పెరుగుదలను తగ్గిస్తామని చెప్పడం గొంగళీలో కూర్చుని వెంట్రుకలేరుకోవడమే. పెట్రోలియం రంగానికి సబ్సిడీ ఇస్తే, ప్రభుత్వ వ్యయం పెరుగుతుందని పెట్రోల్ ధరలను పెంచేస్తే, ఆ భారం ప్రభుత్వం తప్పించుకోవచ్చని వారి ఆలోచన. కానీ సబ్సిడీ ఇచ్చి, పన్నుల నుండి రాబట్టుకుంటే మంచిదా, ధరలను పెంచేసి ద్రవ్యలోటు తగ్గించుకుంటే మంచిదా? చూస్తే, దీనికి ద్రవ్యోల్బణ సమస్య తప్పేట్టు లేదు. సామాన్యుల ఉసురు ఈ ప్రభుత్వానికి తప్పేట్టు లేదు.

అమెరికా నుండి మొదలుకుంటే, అన్నీ దేశాల్లో అమలవుతున్న నయా ఉదారవాద నమూనా ఎక్కడయినా ఒకటే. అదేమిటంటే, ప్రత్యక్ష పన్నులు తగ్గించి, ప్రజా రవాణా సౌకర్యాలు లేకుండా చేసి, అందరిచేతా కార్లు కొనిపించి ఆటోమొబైల్ రంగాన్ని, గృహ రుణాలను కారుచౌక వడ్డీలకు అందజేసి అందరిని ఇళ్లు కొనుక్కోమని ప్రేరేపించి రియల్ ఎస్టేట్ రంగం అభివృద్ధి ద్వారా ఆర్థిక రంగాన్ని ముందుకు నడిపించడం. అంతేకాక టివిలు, ఫ్రిజ్‌లు, మొబైల్‌ఫోన్‌లు, కాస్మోటిక్స్, బట్టలుతికే మెషిన్‌లు వగైరా వినియోగ వస్తువులను జీతం రాకుండానే అప్పు మీద కొనేసి ఇన్‌స్టాల్‌మెంట్‌లు కట్టుకుంటూ, దాని కోసం ఓ ఫైనాన్స్ రంగం సిద్ధం చేసుకోవడం ఈ నయా ఉదార వ్యూహంలో భాగం. అయితే, ఉత్పత్తికన్నా, ఫైనాన్స్ రంగం విపరీతంగా లావుపెంచుకుని, స్కీంల మీద స్కీంలు అందించి మొదటికే మోసం వచ్చే విధంగా అసహజంగా పెరిగి, చివరికి పేలిపోయి ఆర్థికరంగాన్ని మొత్తంగా చతికిలపడేయడం మనం ఈ మధ్యే చూశాం. కానీ మన ప్రభుత్వానికి కాని, ఇక్కడి పెట్టుబడిదారీ వర్గానికి గానీ వారికి ఇంకా ఆ ఆశ చావలేదు.

ప్రపంచ ఆర్థిక మాంద్యం మనను పూర్తిగా కొట్టలేదు కదా, మళ్లీ ఓ ఛాన్స్ దొరికితే మళ్లీ ఓ వెలుగు వెలగకపోదూ అని వారి ధీమా. దీనికి దీటుగానే ప్రణబ్ ముఖర్జీ పావులు కదుపుతున్నట్టనిపిస్తోంది. భవిష్యత్తులో జరిగే పరుగు పందెంలో భారత్ లాంటి దేశాలను కేంద్రంగా ఎంచుకుని ఓ వైభవాన్ని అనుభవించాలని ప్రపంచ పెట్టుబడులు ఉవ్విళూరుతున్నాయి. మన పాలకులు రంగం సిద్ధం చేస్తున్నారు.

నెహ్రూగారి ప్రభుత్వకాలంలో, రెండు లక్షలకు మించి ఆదాయం ఉన్న సంపన్న వర్గాల మీద 82 శాతం ఆదాయపన్ను ఉండేది. అలాంటి పన్నులు ఆ వర్గాలు కట్టాయో లేదో కానీ, కులీన-పేదల మధ్య ఉన్న వ్యత్యాసాన్ని తగ్గించడం ప్రభుత్వ విధానంగా ఉండేది. సరళీకృత విధానాల తర్వాత దీన్ని క్రమేపి 20-30-40 శాతం స్లాబ్ విధానాలకు కుదించారు. దీన్ని ఈ మధ్య 10-20-30 శాతం స్లాబ్‌లకు కుదించడమే కాక, మొదట లక్షా అరవయ్యవ రూపాయల వరకు ఆదాయపన్ను మినహాయింపు చేశారు ప్రణబ్ ముఖర్జీ. ఎనిమిది లక్షలు సంపాదించే ఉద్యోగికి రు. 50,000 దాకా పన్ను మినహాయింపు దీంతో వచ్చింది. గృహ రుణాలపై కట్టే అసలుపై ఆదాయపన్ను మినహాయింపు లిమిట్‌ను పెంచారు. కానీ ఇవి పెద్ద రుణాలకు వర్తించదు.

6వ వేతన సవరణల మూలాన పెరిగిన జీతగాళ్లకు ఊరటనివ్వడం కాకుండా, వీరందరూ ఆ మినహాయించిన మొత్తాన్ని వినియోగదారీ వస్తువులైన కార్లు, ఎలక్ట్రానిక్ వస్తువులు కొని పారిశ్రామిక రంగానికి డిమాండ్ కల్పిస్తారని ప్రభుత్వ ఎత్తుగడ. అయితే అసలేపన్నూ కట్టని అసంఘటిత రంగాలలో వ్యాపారస్తులను ఒదిలేయడం అనేది సూది లోంచి ఏనుగులెల్లిపోతుంటే, ఈగల దోమల వెంట పరిగెత్తిన చందాన ఉంది ప్రభుత్వ వైఖం. వీరి వ్యాపార లావాదేవీలను కచ్చితంగా కంప్యూటరీకరించి పన్నుల ఎగవేతకు కళ్లెం వేయడం అసాధ్యమేమీ కాదు.

అలాగే కార్పొరేట్ లాభాలపై ఉన్న సర్‌చార్జ్‌ని 10 నుంచి 7.5 శాతానికి తగ్గించారు. అయితే మినిమం ఆల్టర్నేట్ టాక్స్ (ఎం.ఎ.టి.) ని 15 నుంచి 18 శాతానికి పెంచడం ద్వారా బలహీనం చేశారంటున్నారు కాని, ఎం.ఎ.టి.ని కట్టే పరిశ్రమలు కార్పొరేట్ టాక్స్ కట్టవు. ఈ అన్ని పన్నుల మినహాయింపు ఫలితంగా రు. 26,000 కోట్ల ఆదాయం ప్రభుత్వం కోల్పోయింది. దీంతో దేశంలోని 30 కోట్ల బీద వాళ్లకు కనీసం వంద రోజుల ఉపాధి సృష్టించవచ్చు.

ద్రవ్యలోటుని 5.5 శాతానికి కుదించే మార్గంలో ప్రభుత్వం తన వంతు ఖర్చును తగ్గించే ప్రయత్నం మొదలుపెట్టింది. వ్యవసాయంలో మందులపై సబ్సిడీ విధానాన్ని పోషక విలువలననుసరించి ధరలను నిర్ణయించే విధానానికి మారుస్తున్నట్టు ప్రకటించింది. దీనివల్ల రైతులు దేన్ని ఎక్కువ వాడకం చేస్తారో, దాని ధర ఎక్కువ నిర్ణయించే ఆస్కారం ఉంది. తద్వారా రు. 3000 కోట్ల ప్రజాధనాన్ని వాడకుండా ఉండాలని ప్లాన్. విద్యా, వైద్య రంగానికి కొంత పెంపుదల చేశారు. కానీ మౌలికంగా విద్య, వైద్యం, వ్యవసాయం (సాగునీరు, విద్యుచ్ఛక్తి) ఇవన్నీ రాష్ట్ర ప్రభుత్వాల కిందకు వస్తాయి. అన్ని రాష్ట్రాలకిచ్చే నిధులను 32 శాతానికి కుదించి 68 శాతం కేంద్రం చేతుల్లో ఉంచుకొని రాష్ట్రాలకు పాత్ర లేకుండా చేస్తోంది కేంద్రం. ఫెడరల్ స్వభావానికి ఏమాత్రం విలువనివ్వడం లేదు ప్రస్తుత ప్రభుత్వం.

*ఈసారి బడ్జెట్‌లో వివిధ సాంఘిక సంక్షేమ రంగాలకూ, పథకాలకూ చేసిన కేటాయింపులను తెలియజేస్తున్నారు*

**నేదునూరి కనకయ్య, సిఎచ్. శ్రీనివాస్**

# రాష్ట్ర బడ్జెట్ - సాంఘిక సంక్షేమం

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కొణిజేటి రోశయ్య 2010-11 సంవత్సరానికి 1,13,660 కోట్ల రూపాయలతో మెగా బడ్జెట్‌ను 20 ఫిబ్రవరి 2009న రాష్ట్ర శాసనసభలో ప్రవేశపెట్టారు. ప్రస్తుత బడ్జెట్‌తో మొత్తం పదహారు సార్లు రాష్ట్ర బడ్జెట్‌ను ప్రవేశపెట్టి రికార్డ్‌ను నెలకొల్పారు. మహిళా-శిశు సంక్షేమం, బిసి, ఎస్‌సి, ఎస్‌టి, మైనారిటీ సంక్షేమానికి, గ్రామీణాభివృద్ధికి గత బడ్జెట్‌లో కన్నా కేటాయింపులు పెంచి 'సంక్షేమ బడ్జెట్'గా రూపొందించారు.

2010-11లో మొత్తం 1,13,676 కోట్ల రూపాయల ఆదాయం ఉంటుందని, 1,13,660 కోట్ల రూపాయల ఖర్చు ఉంటుందని అంచనా వేశారు. ప్రణాళికా వ్యయానికి రు. 40,313 కోట్లు, ప్రణాళికేతర వ్యయానికి 73,347 కోట్లు కేటాయించారు. ఆర్థిక సంవత్సరం మొత్తం ఆదాయ, వ్యయాలను పరిశీలిస్తే మొత్తం మీద 15 కోట్ల రూపాయల మిగులు ఏర్పడుతుంది. ఈ బడ్జెట్‌లో రెవెన్యూ మిగులు 3,548 కోట్లు. ఇది జిఎస్‌డిపిలో 0.81 శాతంగా ఉంటుందని, ద్రవ్యలోటు 12,983 కోట్ల రూపాయలు. ఇది రాష్ట్ర స్థూల ఉత్పత్తిలో 2.97 శాతంగా పేర్కొన్నారు.

పెరుగుతున్న రాష్ట్ర సంపద సమాజంలోని అన్ని వర్గాలు, తరగతులు, ప్రాంతాల ప్రజలకు సమానంగా అందజేయాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉన్నదని, ఈ దిశగా గ్రామీణ ఉపాధి హామీ పథకం, సామాజిక పింఛన్లు, ఆరోగ్య శ్రీ, స్కాలర్‌షిప్‌లు, ఫీజు రీ-ఎంబర్స్‌మెంట్, సబ్సిడీ బియ్యం, నూనె, పప్పుదినుసుల సరఫరా పథకం ప్రస్తుత సంక్షోభ సమయంలో అవసరార్థులను సమర్థవంతంగా ఆదుకునే విధంగా రాష్ట్ర బడ్జెట్‌ను రూపకల్పన చేసినట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు.

రాష్ట్ర ప్రభుత్వం 1.13 లక్షల కోట్లతో ప్రవేశపెట్టిన మెగా బడ్జెట్‌లో మహిళా శిశు సంక్షేమం, బిసి, ఆదివాసీ, మైనారిటీ, సాంఘిక సంక్షేమ రంగాలకు పెద్దపీట వేసింది. మహిళా శిశు సంక్షేమానికి గత బడ్జెట్‌లో

---

కేంద్రం రాష్ట్రాల నిధుల పంపిణీ విధానంలో విపరీతమైన కేంద్రీకరణ జరిపి, రాష్ట్రాలపై ద్రవ్యలోటు నియంత్రణ చట్టం కింద ద్రవ్యలోటుని 3 శాతానికి కుదించి, రాష్ట్రాలు ఏ రకమైన స్వతంత్రమైన విధానాలు రూపొందించుకోకుండా ఉక్కిరిబిక్కిరి చేస్తోంది కేంద్ర ప్రభుత్వం. దీని ఫలితంగా రాష్ట్రాల మొత్తం ఖర్చు మొత్తం జాతీయ స్థూల ఆదాయంలో 17 శాతం నుంచి 15.9 శాతానికి పడిపోయింది. రెవెన్యూ, కాపిటల్ ఖర్చులు రెండూ కుదించుకోవాల్సి వచ్చింది. దీన్ని బట్టి చూస్తే మన రాష్ట్రంలో నీటి ప్రాజెక్ట్‌లకు ఎందుకు డబ్బులు రావో అర్థం అవుతుంది. సరళీకృత విధానాలు ప్రవేశపెట్టిన తర్వాత ఈ కేంద్రీకరణ ఎక్కువైందని నిపుణుల అభిప్రాయం. అందుకే బడా వ్యాపారవేత్తలు కేంద్రం చుట్టూ తిరుగుతూ ఉంటారు. జాతీయ పార్టీలు రాజ్యాన్నేలుతూ ఉంటాయి. కేంద్ర మంత్రులకు కూడా ఆ ఉన్నతమైన హోదా అక్కడ్నించే వస్తుంది. ఇది ప్రజాస్వామ్యాన్ని వెనక్కు నడిపిస్తున్న ప్రక్రియ. రాష్ట్రాలు ఉద్యమించాల్సిన సమయం.

స్టాక్ మార్కెట్‌లను ఉత్తేజపరచడానికి పబ్లిక్‌రంగ సంస్థలలో షేర్లను మార్కెట్‌లో అమ్మడానికి రంగం సిద్ధం చేశారు ప్రణబ్‌ముఖర్జీ. సెజ్‌ల విధానాన్ని పొడిగించారు. విద్యుచ్ఛక్తి రంగంలో విదేశీ సంస్థలకు అణు విద్యుత్ ఉత్పత్తి చేసే వ్యాపారాన్ని అప్పజెప్పడం, పబ్లిక్ - ప్రైవేట్ భాగస్వామ్యం పేరున కార్పొరేట్ రంగానికి రోడ్లు, వంతెనలు, పోర్ట్‌లు, విద్యుదుత్పత్తిని కేటాయించడం, ఈ దేశంలో బడా వ్యాపార రంగానికి ప్రభుత్వం సిద్ధం చేస్తున్న వ్యూహం. ఇలాంటి అభివృద్ధిలో సామాన్యులకు పెద్దగా ఉద్యోగావకాశాలు రావని ప్రభుత్వం అర్థం చేసుకుంది. అందుకే వాళ్ల కోసం గ్రామీణ ఉపాధి హామీ పథకం సిద్ధం చేసింది. అంటే బీదవాళ్లకు ఇన్ని గంజినీళ్లు పోసి ధనవంతులకు పంచభక్ష పరమాన్నాలు తినిపించడం స్థూలంగా వారు చేయగలిగిన న్యాయం.

చివరగా భారతదేశంలో సామాన్య ప్రజలు కనీస అవసరాలకు నోచుకొని కాస్త గౌరవంగా బతకాలంటే, ఓ దశాబ్దకాలం పైగా వ్యవసాయరంగానికి ఏడాదికి ఓ లక్ష కోట్లయినా ప్రభుత్వం వెచ్చించాలి. నదీజలాలను, చిన్న తరహా నీటిపారుదల, సాంకేతిక అభివృద్ధి, శ్రామికులను బలహీనులను చేయకుండా తక్కువ సమయంలో ఉత్పత్తి సాధించే మార్గంలో టెక్నాలజీలను ప్రవేశపెట్టి, విద్యా, వైద్యం, గృహాలు, తిండి విషయాలలో సమగ్రమైన అభివృద్ధి సాధించడం ద్వారా మాత్రమే భారతదేశం అసలైన అభివృద్ధి సాధించగలదు. అప్పుడు ఆహారధాన్యాలు ఇప్పటికంటే రెట్టింపు చేసిన సమయంలో ధరలు అదుపులోకొస్తాయి. సామాన్య ప్రజలు వారి మిగతా ఖర్చు ఇతర వస్తువులపై ఖర్చుచేసి పారిశ్రామికరంగానికి డిమాండ్ పొందుపర్చడం ద్వారా సుస్థిరమైన అభివృద్ధి సాధ్యం అవుతుంది. విచ్చలవిడి వినియోగం అలవాటు చేయకుండా, డబ్బును పొదుపు చేయించి, వాటిని తిరిగి పెట్టుబడుల వైపు మళ్లించి 40 శాతానికి మన పెట్టుబడుల నిష్పత్తిని పెంచవచ్చు. అప్పుడు పదిశాతం అభివృద్ధి రేటుకు ఏ విదేశీ పెట్టుబడి అవసరం ఉండదు. కానీ అట్లాంటి ఆర్థిక వ్యూహానికి ఈ పాలకవర్గాలు ఒప్పుకునే మార్గం లేదనుకుంటా. వీ

683 కోట్లు కేటాయించగా ఈసారి 1762 కోట్లు కేటాయించారు. రాష్ట్రంలోని 40.5 లక్షల చిన్నారులకు, 10.05 లక్షల మహిళలకు రాష్ట్రంలోని 80 వేల అంగన్‌వాడి కేంద్రాలలో పనిచేస్తున్న హెల్త్ వర్కర్ల ద్వారా పౌష్టికాహారాన్ని అందించాలని ప్రభుత్వం నిర్ణయించింది. గృహ హింస నిరోధక చట్టం-2005 పటిష్ఠ అమలుకు 77 'షెల్టర్ హోమ్'లను నిర్మించి, 104 మంది ప్రత్యేక అధికారులను నియమించాలని నిర్ణయించింది.

రాష్ట్రంలోని అన్ని ప్రభుత్వ పాఠశాలలో మధ్యాహ్న భోజన పథకాన్ని విజయవంతంగా అమలు చేయడానికి కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన 'సాక్షర భారత్ మిషన్-2012' పథకాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఈ సంవత్సరం నుంచి అమలు చేయాలని నిర్ణయించింది. పేద కుటుంబాలకు ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా 2.04 కోట్ల కుటుంబాలకు సబ్సిడీపై నిత్యావసర సరుకులను ప్రభుత్వం అందిస్తున్నదని తెలిపింది.

సాంఘిక సంక్షేమ హాస్టళ్లలో చదువుతున్న 2.50 లక్షల విద్యార్థుల ప్రయోజనార్థం మౌలిక సదుపాయాల కల్పన, రక్షిత మంచినీరు, హాస్టల్ భవనాల నిర్మాణం కోసం 2010 బడ్జెట్‌లో 150 కోట్లు కేటాయించారు. గత ఏడాది కంటే ఇది 22 శాతం అధికం. బిసి విద్యార్థులకు వివిధ పోటీ పరీక్షల కోసం తర్ఫీదు నివ్వడానికి రాష్ట్ర వ్యాప్తంగా అదనంగా ఏడు బిసి స్టడీ సర్కిళ్లను ప్రభుత్వం మంజూరు చేసింది. వీటిని విజయనగరం, తిరుపతి, కడప, కరీంనగర్, ఖమ్మం, నిజామాబాద్, ఆదిలాబాద్‌లలో నెలకొల్పాలని నిర్ణయించింది. బిసి విద్యార్థులకు స్కాలర్‌షిప్, ఫీజు రీ-ఎంబర్స్‌మెంట్ నిమిత్తం గత బడ్జెట్‌లో రు. 700 కోట్లు కేటాయించగా ప్రస్తుత బడ్జెట్‌లో రు. 789 కోట్లు మాత్రమే కేటాయించడం నిరాశ కలిగించింది. స్థూలంగా బిసి సంక్షేమానికి రు. 1850 కోట్లు కేటాయించడం హర్షించదగింది.

ఆదివాసీ బాలల ఆరోగ్య పరిరక్షణకు 'రాజీవ్ గిరి బాల రక్ష ఆరోగ్య బీమా' అనే నూతన ఆరోగ్య బీమా పథకాన్ని 2010 బడ్జెట్‌లో రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ఈ పథకం అమలు ద్వారా ప్రమాదానికి గురైన గిరిజన బాల బాలికలకు ఐదు వేల నుండి ఇరవై ఐదు వేల వరకు ఉచిత వైద్య బీమా సౌకర్యం లభిస్తుంది. గిరిజన సంక్షేమానికి గత బడ్జెట్‌లో రు. 309 కోట్లు కేటాయించగా ఈసారి రు. 456 కోట్లు కేటాయించారు.

మైనారిటీ వర్గాల అభ్యున్నతికి 2009-10 బడ్జెట్‌లో రు. 177 కోట్లు కేటాయించగా ఈసారి రు. 232 కోట్లు కేటాయించారు. మైనారిటీల సంక్షేమం కోసం 'సెంటర్ ఫర్ ఎడ్యుకేషన్ డెవలప్‌మెంట్ ఆఫ్ మైనారిటీస్' అనే సంస్థను 2010 బడ్జెట్‌లో ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

ప్రస్తుతం అమలులో ఉన్న గ్రామీణ ఉపాధి హామీ పథకం ద్వారా గ్రామీణ ప్రాంతాలలో ఉపాధి, ఉత్పాదకతను పెంచేందుకు దోహద పడే మౌలిక సదుపాయాల అభివృద్ధికి ఈ బడ్జెట్‌లో రు. 300 కోట్లు కేటాయించారు. పంచాయితీ రాజ్, గ్రామీణాభివృద్ధికి 4221 కోట్ల రూపాయలు కేటాయించడం ద్వారా రాష్ట్రంలోని అన్ని గ్రామాలలో అంతర్గత రోడ్ల నిర్మాణం, వాటిని ప్రధాన రోడ్లతో కలపడం ద్వారా ప్రధాన నగరాలు, పారిశ్రామిక ప్రాంతాలు, ముఖ్య పట్టణాలను అనుసంధానం చేయడం, మురుగు కాలువల నిర్మాణం ద్వారా పారిశుద్ధ్య

**2010 రాష్ట్ర బడ్జెట్ స్వరూపం** (కోట్ల రూపాయలు)

| | |
|---|---|
| ప్రణాళికా వ్యయం | 40,313 |
| ప్రణాళికేతర వ్యయం | 73,347 |
| **మొత్తం బడ్జెట్** | **1,13,660** |
| **రెవెన్యూ ఆదాయం** | |
| కేంద్ర పన్నుల వాటా | 14,505 |
| గ్రాంట్ ఇన్ ఎయిడ్ | 13,441 |
| రాష్ట్ర పన్నుల ఆదాయం | 46,999 |
| పన్నేతర ఆదాయం | 15,702 |
| **మొత్తం** | **90,647** |
| **రెవెన్యూ వ్యయం** | |
| ప్రణాళికేతర వ్యయం | 63,491 |
| ప్రణాళికా వ్యయం | 23,609 |
| **మొత్తం** | **87,100** |
| **రెవెన్యూ మిగులు** (జి.ఎస్.డి.పి.లో 0.81 శాతం) | 3,548 |
| **ద్రవ్యలోటు** (జి.ఎస్.డి.పి.లో 2.97 శాతం) | 12,983 |
| **స్థూల రాష్ట్ర ఉత్పత్తి** (జి.ఎస్.డి.పి.) | 4,36,939 |

కార్యక్రమాలను అమలుపర్చడం వల్ల గ్రామీణాభివృద్ధిని సాధించాలని ప్రభుత్వం నిర్ణయించింది. సమాజంలోని బడుగు, బలహీన, అట్టడుగు వర్గాలకు గృహ వసతి కల్పన కోసం 'ఇందిరమ్మ గృహ నిర్మాణ పథకం' అమలుకు గత ఏడాదిలాగే 1800 కోట్లు కేటాయించారు.

రాష్ట్రంలోని అన్ని రకాల సామాజిక పింఛన్ల కోసం మొత్తం 1932 కోట్ల రూపాయలు రాష్ట్ర ప్రభుత్వం కేటాయించింది. రాష్ట్రంలోని 17.44 లక్షల వితంతువులు, 44.33 లక్షల వృద్ధులు, 1.50 లక్షల చేనేత కార్మికుల సంక్షేమం కోసం 1932 కోట్లు కేటాయించడం ద్వారా 71.52 లక్షల మంది లబ్ధి పొందుతారు. ఈ సంవత్సరం నుండి ఎచ్ఐవి-ఎయిడ్స్ వ్యాధి పీడితులకు కూడా నెలకు రెండు వందల రూపాయల పింఛను ఇవ్వాలని ప్రభుత్వం నిర్ణయించింది. వృద్ధ మహిళల ఆదాయ భద్రత కోసం రాష్ట్ర ప్రభుత్వం 2009లో ప్రవేశపెట్టిన అభయ హస్తం బీమా పథకం ప్రస్తుతం 'వై.ఎస్.ఆర్. అభయహస్తం'గా మారింది. ఈ పథకం అమలు ద్వారా రాష్ట్రంలోని ఒక కోటి ఇరవై ఐదు లక్షల మహిళలు ప్రయోజనం పొందుతారు. దీనికోసం ఈ బడ్జెట్‌లో రు. 220 కోట్లు కేటాయించారు. డ్వాక్రా సంఘాల పావలావడ్డీ పథకానికి రు. 200 కోట్లు, రైతులకు పావలా వడ్డీ కోసం రు.60 కోట్లు కేటాయించారు. ఈ బడ్జెట్‌లో రాజీవ్ ఆరోగ్యశ్రీ పథకానికి రు. 925 కోట్లు కేటాయించారు. ఉపాధిహామీ పథకానికి రు. 300 కోట్లు, చేనేత కార్మికుల రుణమాఫీకి రు.312 కోట్లు, రాష్ట్ర కృషి వికాస్ యోజనకు రు. 451 కోట్లు, జెఎన్ఎన్‌యుఆర్ఎం పథకానికి 1750 కోట్ల రూపాయలు రాష్ట్ర ప్రభుత్వం 2010 బడ్జెట్‌లో కేటాయించింది.

*ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానంలో పదకొండో పంచవర్ష ప్రణాళిక సాగుతున్నా పేదరికం మాత్రం దినదినాభివృద్ధి చెందుతూ పదిలంగా ఉందని అంటున్నారు* **వి. హనుమంతరావు**

# పేదరికం క్షేమం - పేదలూ క్షేమం

పేదరికానికి చాలా గర్వం. రాష్ట్రంలో ప్రతి పల్లెలో నేనుంటా, నేను లేని గ్రామం లేదు. మొదటి ప్రణాళిక నుంచి 11వ ప్రణాళికలోనూ నేను కనబడుతూంటా. నన్ను ఉదహరించకుండా ఏ పార్టీ నాయకుడు కూడా ఉపన్యాసం ఇవ్వలేడు. అధికారంలో ఏ పార్టీలో ఉన్నా నన్ను కాదని ప్రభుత్వాన్ని నడపలేరు. నన్ను పేర్కొనాలి. నన్ను అంతం చేయడానికి ఇప్పటికి బిలియన్, ట్రిలియన్ కోట్లు ఖర్చు పెట్టారు. రకరకాల ప్రణాళికలు వేశారు, అమలు పరిచారు. అయినా నేను నిష్క్రమించలేదు. నన్ను బ్రిటిష్ సామ్రాజ్యవాదులే వారి సైనిక బలంతో తొలగించలేకపోయారు. ఇప్పటి పాలకులేపాటి? నేను సజీవంగా, ఆరోగ్యంగా ఉన్నానంటే దాని వెనుక ఓ రహస్యం ఉంది.

నేను నిష్క్రమిస్తే, నాయకులకు మాట్లాడడానికి ఇంకే విషయమూ ఉండదు. ప్రజల ఓట్లు రాలవు. ప్రజలంతా వారి కాళ్ల మీద వారు నిలబడే శక్తి ఉంటే, వారు స్వతంత్రంగా ఆలోచించగలుగుతారు. నాయకుల ఆటలు చెల్లవు. కాగా నేను కొనసాగడంలో పాలకుల స్వప్రయోజనాలు ఇమిడి ఉన్నాయి. నాయకులకు నేను దగ్గర బంధువును. నన్ను అంతం చేయడానికి ఒకటా, రెండా డజన్ల పథకాలు ప్రవేశపెట్టారు. కోట్లు కేటాయించారు. నేను బతికి ఉండాలంటే, ఆ పథకాలు విజయవంతం కాకూడదు. పాలించే పార్టీ కిందిస్థాయి నాయకులు, ఆ స్థాయిలో ప్రభుత్వోద్యోగులు, ఉన్నతాధికారులు, చట్ట సభల్లో సభ్యులు, మంత్రులు అందరిలోనూ పరకాయ ప్రవేశం చేసా. చేతికందినంత నిధులు భోంచేశారు. ఫలితంగా పథకాల ఫలితాలు చేరాల్సినవారికి చేరకుండా చేశా. అసలు కేటాయించిన సొమ్ములనే పూర్తిగా ఖర్చు చేయకుండా మరో అస్త్రం ప్రయోగించా.

ఉదాహరణకు, గ్రామీణ మహిళలను డ్వాక్రా గ్రూపులుగా సమీకరించి, వారికి ఇటు ప్రభుత్వం, బ్యాంకులు రుణాలిచ్చే ఏర్పాటు చేసింది ప్రభుత్వం. 2009-2010లో గ్రూపుల సహాయం కోసం రు.25.77 కోట్లు కేటాయించగా, వాస్తవంగా విడుదల చేసింది రు. 6.44 కోట్లు మాత్రమే (నవంబర్ 2009 వరకు). ఎన్ని గ్రూపులకు సహాయం అందచేసారో చూడగా 2009-10 సామాజిక ఆర్థిక సర్వే ప్రకారం 2008-09లో 29103 గ్రూపులకు సహాయం అందజేయగా, నడుస్తున్న సంవత్సరంలో (నవంబర్ వరకు) కేవలం 6804 గ్రూపులకే సహాయం అందింది.

గత సంవత్సరం రు. 2910.30 లక్షల సబ్సిడీ అందజేయగా, ఈ సంవత్సరం రు. 680.33 లక్షలు మాత్రమే ఇవ్వడం జరిగింది. పేదలను పేదరిక రేఖపైకి తీసుకొని రావడం లక్ష్యం. ఇది పాలకుల ఘోరవైఫల్యం, పేదరిక విజయం.

రాష్ట్రంలో గ్రామీణ ప్రాంతాల్లో కేవలం 11.20 శాతం మంది మాత్రమే పేదరిక రేఖ కింద ఉన్నారని, పట్టణాల్లో 28 శాతం మంది మాత్రమే ఉన్నారని ప్రణాళికా సంఘం విడుదల చేసిన గణాంకాలను బడ్జెట్‌తో పాటు సభ్యులకు అందజేసిన సామాజికార్థిక సర్వే రిపోర్ట్ చూసి పేదరికానికి రోశయ్య మీద కోపం వచ్చింది. అప్పటి నుంచి ఇప్పటిదాకా ధరలు పెరగలేదా, మరింత మంది పేదరికపు రేఖ కిందకు పోలేదా అని నిలదీసింది.

ఏ ప్రణాళికా సంఘం అయితే ఈ గణాంకాలిచ్చిందో, ఆ ప్రణాళికా సంఘమే నియమించిన టెండుల్కర్ కమిటీ 37 శాతం మంది పేదరిక రేఖ కింద ఉన్నారని చెప్పలేదా అని ప్రశ్నించింది. ప్రణాళికా సంఘం ఆ విషయం మా ప్రభుత్వానికి పంపలేదని రోశయ్య తప్పుకో చూశారు. గ్రామాల్లో 11 శాతం మందే పేదరిక రేఖ కింద ఉంటే, పేదరికాన్ని తగ్గించడానికి ఈ మధ్యనే నువ్వు ప్రపంచబ్యాంక్ నుంచి రుణం తీసుకోవడానికి ఒప్పందం చేసుకున్నావెందుకని మళ్లీ ప్రశ్నించింది. దీనికి రోశయ్య నేరుగా జవాబివ్వకుండా రెండు రూపాయల కిలో బియ్యం పథకం, వెలుగు, ఇందిరా క్రాంతి పథకం, ఇందిరమ్మ గృహ నిర్మాణ పథకం, భూముల పంపకం, ఆరోగ్యశ్రీ లాంటి పథకాలన్నీ పేదరికాన్ని తగ్గించడానికి అమలు చేస్తున్న పథకాలేనని, ఆ పథకాలు మంచి ఫలితాలిస్తున్నాయని, ఈ వివరాలన్నీ మా సర్వే రిపోర్ట్‌లో ఉన్నాయి చూసుకో, ఇంకా అధిక ప్రసంగం చేసి నన్ను విసిగించకు అని పేదరికాన్ని బయటకు పంపేశారు.

పేదరికానికి కూడా కోపం వచ్చింది. పత్రికా విలేకరుల సమావేశాన్ని పిలిచి నేరుగా భారత ప్రభుత్వం మీదే విరుచుకుపడింది. పేదరికం పుట్టు పూర్వోత్తరాలను తడిమింది. ఇందిరాగాంధీ గరీబీ హఠావో అనే పేరుతో గరీబులనే హఠావ్ చేయలేదా? గరీబీ పోలేదని 'సామాజిక న్యాయంతో కూడిన అభివృద్ధి' అనే నినాదమిచ్చా. సామాజిక న్యాయాన్ని, అభివృద్ధిని ఎంతవరకు సాధించింది? ఎంతో అభివృద్ధిని సాధించాం అంటున్నారు. మరి పేదరికం, అసమానత్వం పోలేదే? స్థూల జాతీయాదాయ పెరుగుదలను చూపించి ఇది అభివృద్ధి కాదా అని ప్రభుత్వం ఎదురు ప్రశ్న వేస్తుంది.

సర్వ వ్యాపిత అభివృద్ధి (ఇంక్లూజివ్ గ్రోత్) సాధించాలని మన్మోహన్‌సింగ్ పిలుపిచ్చారంటే, దానర్థం పేదరికం ఇంకా ఉందనేగా?

పేదరికం అంచనా వేయడానికి కొలబద్ద ఏమిటనే విషయంలో ఆర్థిక శాస్త్రవేత్తలంతా జుట్టు పీక్కుంటున్నారు. అలాంటపుడు పేదరికం తగ్గిందని ఎలా చెబుతారు? ఎవరి లెక్కలు వారు చెబుతున్నారు. ప్రపంచ బ్యాంక్ 42 శాతం అంటుంది. ఆసియా డెవలెప్‌మెంట్ బ్యాంక్ 77 శాతం అంటోంది. అర్జున్‌సేన్ గుప్తా కమిటీ 77 శాతం మంది రోజుకు 20 రూపాయలలోపు ఆదాయంతో బతుకుతున్నారని తెలియజేస్తోంది. ఇది పేదరికం కాదా? పరిస్థితి ఇలా ఉంటే మిలీనియం పథకం ప్రకారం 2015 నాటికి పేదరికాన్ని సగానికి తగ్గించాలనే లక్ష్యాన్ని ఎలా సాధిస్తుంది అని పత్రికా ప్రతినిధుల ముందు భారత ప్రభుత్వాన్ని కడిగేసరికి, గుక్క తిప్పుకోకుండా ప్రశ్నలు సంధించేసరికి పత్రికా విలేకరులు మనపని ప్రశ్నలు వేయడం. కాని ఈ పేదరికం గాడు ప్రశ్నలు వేయడమేమిటను కొంటూ వారు నిష్క్రమించారు. పేదరికం ఇంటికి వెళ్లి రోశయ్య ఇచ్చిన సర్వే రిపోర్ట్‌ను తిరగేసింది.

స్థూల రాష్ట్రాదాయం పెరుగుదల గురించి పెద్దగా గొప్పలు చెప్పుకొంటుంటారు కాబట్టి ఆ సంగతేమిటో చూడబోతే 2007-08 బడ్జెట్ సమావేశంలో 2007-08లో ఈ ఆదాయం 10.37 శాతం పెరుగుతుందని అంచనా వేయగా, ఈ బడ్జెట్‌లో ఆ పెరుగుదల 15.04 శాతానికి (త్వరితగతిన అంచనా) తరిగిపోయింది. కేవలం వ్యవసాయాన్ని తీసుకొంటే దాని పెరుగుదల అంచనా 1.20 శాతం మాత్రమే. పేదరికానికి ఈ తరుగుదలలు కర్ణపేయంగా వినిపించాయి. లేకపోతే నాతో పెట్టుకుంటారా అని లోలోపలే సంతోషించింది. అయినా ఆదాయం పెరిగితే, సామాన్యుడి ఒళ్లో వచ్చిపడేదేమీ లేదు కదా.

ధరలు పెరిగితే, పేదరికం పెరుగుతుంది. ఎందుచేతనంటే ధరలు పెరిగిన మేరకు ఆదాయాలు పెరగవు. నడుస్తున్న సంవత్సరంలో ధరలు మండిపోయాయి అని మనం గుండెలు బాదుకొంటున్నాం. కాని ధరలు ఎపుడూ పెరుగుతున్నాయి. ఉదాహరణకు గత సంవత్సరం సర్వేలో ఇచ్చిన సమాచారం ప్రకారం కందులు, బియ్యం (రెండో రకం), వేరు శనగ నూనె, పిక్కతీయని చింతపండు, ఎర్రమిర్చి (గ్రేడ్ 2) ధరలు పెరుగుదలను సూచిస్తున్నాయని పేర్కొంది. వినిమయ ధరల సూచి 2006-07లో 125 నుంచి 2007-08లో 132కు, 2008 ఏప్రిల్-నవంబర్ కాలంలో 143కు పెరిగినట్లు సర్వే తెలియజేసింది. అంటే ధరలు పెరుగుతున్నాయని, పెరగబోతున్నాయని ప్రభుత్వానికి హెచ్చరికలు 2008 నుంచి అందుతున్నాయి. అపుడే అదుపులో పెట్టి ఉంటే ధరలు ఇంతలా పెరిగేవి కాదు. అలాంటి పరిస్థితిలో రోజుకు 20 రూపాయలకు తక్కువగా ఆదాయం వచ్చే అసంఘటిత కార్మికులు మరింత పేదరికంలోకి దిగజారుతారు. పేదరికానికి ఈ ధోరణి ఘంటసాల సంగీతమంత మధురంగా వినిపించింది.

రాష్ట్రంలో మారుమూల ప్రాంతాల అభివృద్ధి పథకం గురించి సర్వేలో ఇచ్చిన వివరాలు చదివి పేదరికం ఎంతో సంతోషించింది. ఎందుచేతనంటే, ఈ మారుమూల ప్రాంతాలేవో, ఆ ప్రాంతాల్లో ఎంతమంది నివసిస్తున్నారో అని తెలుసుకొన్నట్లు మాత్రమే ఉంది కాని, అభివృద్ధికి చేపట్టిన పనులు గాని, ఎంత ఖర్చు చేశారు, ఎంత మంది లబ్ధి పొందారు అనే సమాచారం లేదు. అంటే గుర్తింపుతోనే ఆ పథకం నిలిచిపోయింది. అక్కడ నివసించే ప్రజలకు అభివృద్ధి ఫలితాలు అందలేదు. వారి పేదరికం ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే అన్నట్లుంది. పేదరికానికి ఇంతకన్నా సంతోషకరమైన వార్త ఇంకేముంటుంది?

సమాజంలో సామాజికంగా, ఆర్థికంగా అణగారిన ఎస్.సి.ల సంక్షేమం గురించిన సమాచారం గురించి సర్వే రిపోర్ట్‌లో చదివింది. అక్షరాస్యత అఖిల భారత స్థాయి కన్నా దిగువన ఉంది. ఎస్.సి.ల ఉప ప్రణాళికకు 2009-10లో రు. 5343 కోట్లు కేటాయిస్తే, డిసెంబర్ వరకు చేసిన ఖర్చు రు. 1709 కోట్లు మాత్రమే. అలాగే ఎస్.టి.ల కోసం బడ్జెట్ కేటాయింపు రు. 771 కోట్లు అని అందులో ప్రణాళికేతర ఖర్చు రు. 371 కోట్లు అని ఉంది కానీ ఎంత ఖర్చయిందో చెప్పలేదు. ఇదీ ఎస్.సి., ఎస్.టి.ల కథ. ఈ లెక్కన వారి పేదరికం ఎలా, ఎన్ని సంవత్సరాలకు అంతరిస్తుంది? నా సైన్యం క్షేమంగా ఉందని పేదరికం ఎంతో సంతోషించింది. భూ సంస్కరణలు, విద్య, వైద్యం సమస్యలు పరిష్కరించిన నాడే పేదల అభివృద్ధి సాధ్యం అని నోబెల్ గ్రహీత అమర్త్యసేన్ అన్నారు కాబట్టి, భూ సంస్కరణల గురించి ఏముందో అని చూడబోతే, అందులో దాని గురించి ఒక్క అక్షరం ముక్క కూడా లేదు. నాలుగు లక్షల ఎకరాలు పంచిపెట్టామని వైఎస్ పాలనలో చెప్పుకున్నాయి. కాని అవి ఏ పేదలు సాగుచేసుకొంటున్నారో వారికే పట్టాలిచ్చారు గాని కొత్తగా పంచిపెట్టినదేమీ లేదని వచ్చిన విమర్శలు పేదరికానికి గుర్తొచ్చింది ఫర్వాలేదు. పేదరికం క్షేమంగానే ఉందని పేదరికం బ్రేవ్‌మని తేన్చింది.

డ్వాక్రా పథకం దేశానికే ఆదర్శంగా ఉందని ప్రభుత్వం చెప్పుకొంటూంటుంది. దీని తీరుతెన్నులు చూస్తే 2009-10లో వారి సహాయం కోసం బడ్జెట్లో రు. 26 కోట్లు కేటాయించగా, రు. 6.44 కోట్లు మాత్రమే విడుదల చేసింది. 2008-09లో రు. 2910 కోట్లు సహాయం అందించగా 2009-10లో నవంబర్ దాకా అందించిన సబ్సిడీ కేవలం రు. 680 లక్షలు మాత్రమే. స్త్రీల పేదరికం దీనితోనే తీరిపోతుందా?

పేదరికం క్షేమం, పేదలు క్షేమం అని మనస్సులో అనుకొని పేదరికం హాయిగా నిద్రపోయింది. వీ

- మార్చ్ 2010 సంచికలోని 'సామాజిక న్యాయస్థానాలు కావాలి' ఎ.ఎం. ఖాన్ యజ్దానీ (డానీ) వ్యాసంలో 15వ పేజీలో కుడిపక్క రెండవ పేరాలోని 5, 6 లైన్‌లలో 'ప్రత్యామ్నాయం' కి బదులుగా 'ప్రత్యయం' అని సరి చేసుకోగలరు.
- మార్చ్ 2010 సంచికలో బిరుదురాజు రామరాజు సంస్మరణలో ఆయన పదవీ కాలం సంబంధించి పొరపాటు దొర్లింది. ఆయన కాకతీయ యూనివర్సిటీ పి.జి. సెంటర్ ప్రిన్సిపాల్‌గా జనవరి 1972 నుంచి ఏప్రిల్ 1974 వరకు పనిచేశారు. ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు శాఖాధిపతిగా జూలై 1973 నుంచి డిసెంబర్ 1983 వరకు పనిచేశారు. పొరపాటుకు చింతిస్తున్నాం.

– సం.

***పుట్టుకతో సహా అడుగడుగునా అనేక రూపాలలో వివక్షలను, అణచివేతలను ఎదుర్కొంటున్న మహిళలకు పరిమితులతోనే అయినా మహిళా బిల్లు అవసరం ఉందని అంటున్నారు వి. సంధ్య***

# మహిళా బిల్లు అందరి ఆమోదం పొందాలి

*చట్ట సభల్లో మహిళలకు మూడో వంతు రిజర్వేషన్లు కల్పించే బిల్లు ఎందుకు ఆమోదానికి నోచుకోవడం లేదు? చిత్తశుద్ధి ఉంటే చట్టసభల చేతుల్లో అధికారం ఉంది. అమలు చేసే యంత్రాంగం ఉంది. ఇప్పటికే పధ్నాలుగు సంవత్సరాల సుదీర్ఘ సమయం గడిచింది. జరిగిన కాలయాపన చాలు. కనీసం, 'నూరేళ్ల' అంతర్జాతీయ మహిళా పోరాట దినం సందర్భంగానైనా బిల్లుకి విముక్తి కల్పించమని నిలదీయాలి. ఒబిసి, మైనారిటీ సవరణతో బిల్లుని ఆమోదించాలని, స్థానిక సంస్థలతో పాటు చట్ట సభల్లో కూడా 50 శాతం రిజర్వేషన్లు అమలు జరపాలని కోరాలి. అందుకు తగిన రాజ్యాంగ సవరణలు వెంటనే చేయాలని ఒత్తిడి తీసుకురావాలి.*

నిర్ణయాధికారంలో స్త్రీలకి సమభాగస్వామ్యం కల్పించాలని అంతర్జాతీయ సదస్సులు, సమావేశాలు ఘోషిస్తున్నాయి. తదనుగుణంగా ప్రణాళికలు రూపొందిస్తున్నాయి. అన్ని దేశాలు విధిగా అమలు చేయాలని ఆదేశిస్తున్నాయి. అందుకుగాను, ఆయా దేశాల ఆమోదం తీసుకుంటున్నాయి. ఫలితం మాత్రం శూన్యం. మన దేశం కూడా ప్రతిసారీ ఆయా కార్యాచరణ ప్రణాళికలపై ఆర్భాటంగా సంతకాలు చేస్తూనే ఉంది. చివరికి వాటిని నామమాత్రంగానే అమలు చేస్తోంది. కొన్నింటిని బుట్ట దాఖలా కూడా చేస్తోంది. అందులో మహిళా రిజర్వేషన్ బిల్లు ఒకటి. 1996లో బిల్లుని ప్రవేశపెట్టినప్పుడు మహిళలకు గొప్ప సుదినం అన్నారు. సువార్ణాక్షరాలతో లిఖించుకోవల్సిన ఘట్టం అని ఊదరగొట్టారు. స్త్రీలకు న్యాయ సమ్మతమైన స్థాయిలో ప్రాతినిధ్యం కల్పించి, లింగ వివక్షకు స్వస్తి చెప్పే లక్ష్యంతోనే మహిళా బిల్లుని ప్రవేశపెడ్తున్నామన్నారు. గత పధ్నాలుగు సంవత్సరాలుగా పాలకులు బిల్లుపై హామీలిచ్చి మహిళలను మోసగిస్తూనే ఉన్నారు.

14 ఏళ్ల పోరాటం తర్వాత బిల్లు ఎట్టకేలకు రాజ్యసభలో అమోదం పొందడం జీర్ణించుకోలేకపోతున్నారు చాలా మంది రాజకీయ నాయకులు. ఈ బిల్లుకు మద్దతునిచ్చిన బి.జె.పిలో ఇప్పటికే లుకలుకలు మొదలయ్యాయి. యాదవ త్రయం, మాయావతి, మమతా బెనర్జీతో సహా చాలా మంది బిల్లుని అడ్డుకుంటామని ప్రకటిస్తున్నారు. ఎట్టి పరిస్థితుల్లో లోక్‌సభలో బిల్లుని గట్టెక్కనివ్వమని భీషణ ప్రతిజ్ఞలూ వినిపిస్తున్నాయి. మహిళా బిల్లు విషయంలో ఎలాంటి ఒత్తిళ్లకు లొంగే ప్రసక్తే లేదని స్పష్టం చేస్తున్నారు అన్ని పార్టీల నేతలు. ఆర్.జె.డి. నేత లాలూ ప్రసాద్ యాదవ్ మాపై విజయం సాధించడం కోసం, బిల్లుని ఆమోదించడం కోసం సైన్యం లేదా ఇతర దళాలను వినియోగించినా సరే బిల్లుని లోక్‌సభలో ఆమోదం పొందకుండా అడ్డుకుని తీరుతాం అని హెచ్చరిస్తున్నారు. బిల్లు విషయంలో కాంగ్రెస్‌లో అసమ్మతి తలెత్తే అవకాశం ఉందని, అందువల్ల మధ్యంతర ఎన్నికలకు సిద్ధం కావాలని పిలుపునిస్తున్నారు. లోక్ జనశక్తి పార్టీ అధ్యక్షుడు రామ్ విలాస్ పాశ్వాన్ అయితే మరో ప్రతిపాదన చేస్తున్నారు. లోక్‌సభ సీట్లను మూడోవంతు పెంచి, ద్విసభ్య నియోజకవర్గాలను ఏర్పాటు చేయడం ద్వారా బిల్లుకి ఆటంకాలు తొలుగుతాయంటున్నారు. అందులో అన్ని రకాల రిజర్వేషన్లు అమలుకి అవకాశముందని సెలవిస్తున్నారు. ఈ బిల్లు రాజకీయాల్లో ప్రకంపనలు పుట్టిస్తోంది. పురుష ప్రపంచం పుట్టి ముంచే బిల్లుగా, పురుషులు తమ స్థానాలు కోల్పోవడం తప్పదు. అసలు మహిళాలోకం రాజకీయాల్లోకి రావడం ఇష్టపడడంలేదు అంటూ విశ్లేషణలు, వ్యాఖ్యానాలతో ముంచెత్తుతున్నారు. మహిళా ఓటు బ్యాంకుని తప్ప అస్తిత్వాన్ని, హక్కులని గుర్తించని నేతలు బిల్లుని ఎలాగైనా తొక్కిపెట్టాలని కుట్రలు చేస్తున్నారు. రాజకీయ పార్టీల ద్వంద్వ నీతికి, పితృస్వామిక, అగ్రకుల, వర్గ దురహంకారానికి నలిగిపోతున్న అర్ధ ప్రపంచపు హక్కుల బిల్లు గురించి ఒక్కసారి సమీక్షించుకోవాలి.

పార్లమెంట్ ఉభయ సభలనుద్దేశించి ప్రసంగిస్తూ రాష్ట్రపతి ప్రతిభాపాటిల్ వంద రోజుల్లోనే మహిళా బిల్లుకి చట్టరూపం ఇచ్చేందుకు యు.పి.ఎ. ప్రభుత్వం కట్టుబడి ఉందని, స్థానిక సంస్థలలో యాభై శాతం రిజర్వేషన్‌ల కోసం కృషి చేస్తుందని ఉద్ఘాటించారు. దీనితో బిల్లు తిరిగి చర్చనీయాంశమైంది. యథా ప్రకారంగానే బిల్లుని ప్రస్తుత రూపంలో ఆమోదిస్తే ఒప్పుకొనేది లేదు అడ్డుకుంటాం అంటూ వ్యతిరేకతను వ్యక్తం చేశారు జనతాదళ్ (యు), ఆర్.జె.డి., సమాజ్‌వాది పార్టీల ఎం.పి.లు. శరద్ యాదవ్ అయితే మరింత దూకుడుగా పార్లమెంట్‌లోనే విషం తాగి చస్తానని బెదిరించాడు. దీంతో మిగతావాళ్లు బిల్లుని అడ్డుకునే శక్తులను సహించం, విషం మేమే ఇస్తామంటూ ప్రకటించి నిరసన వ్యక్తం చేశారు. షరా మామూలే. రాష్ట్రపతి పదవితో పాటు లోక్‌సభ స్పీకర్‌గా, యు.పి.ఎ. నేతగా, ప్రతిపక్షనేతగా మంత్రులుగా మహిళలు అత్యున్నత స్థానాలలో అధికారం చేపట్టారు. అన్ని అవాంతరాలను అధిగమించి ఈసారైనా బిల్లుకి మోక్షం కల్గిస్తారా అంటూ

సర్వత్రా చర్చలకు తెరలేపారు. ఇచ్చిన హామీలను నిలబెట్టుకుని బిల్లుని ఆమోదించాలని మహిళలు కోరుతూనే ఉన్నారు. ఏ బిల్లుకి అవసరంలేని ఏకాభిప్రాయం మహిళా బిల్లుకే తప్పనిసరి అంటూ దొంగనాటకం ఆడుతున్న పాలకులని నిలదీస్తూనే ఉన్నారు.

మహిళా బిల్లు హామీతో అధికారంలోకి వచ్చిన ఎన్.డి.ఎ., యు.పి.ఎ. ప్రభుత్వాలకి చిత్తశుద్ధి లోపించడం వల్లే బిల్లు ఆమోదానికి నోచుకోలేదు. ఇంతకు ముందు ఎన్ని బిల్లులు భిన్నాభిప్రాయాలతో, నిరసనలతో ఆమోదించలేదు? ప్రైవేటీకరణ, బ్యాంకుల్లో వాటా, వడ్డీ తగ్గింపు, బీమా రంగం, కార్మిక రంగం చట్ట సవరణబిల్లు, సెజ్ చట్టం, అణు ఒప్పందం... ఇలా ఎన్నో బిల్లులు ఏకాభిప్రాయం లేకున్నా ఆమోదించుకున్నారు. అసలు బిల్లుపై ఏకాభిప్రాయం సాధ్యం కానప్పుడు మెజారిటీ అభిప్రాయం తీసుకోవడం ప్రజాస్వామిక సంప్రదాయం. దేశ ప్రజల ఆర్థిక ప్రయోజనాలకు సంబంధించిన బిల్లులను, వారి జీవితాలను చిన్నాభిన్నం చేసే బిల్లుల విషయంలో నామ మాత్రపు మెజారిటీతోనైనా నెగ్గించుకుంటున్నారు. మహిళా బిల్లుకి వచ్చే సరికి కుంటి సాకులు చూపుతూ తప్పించుకో చూస్తున్నారు పాలకులు. ఇది వారి ద్వంద్వ నీతికి తిరుగులేని సాక్ష్యం. బిల్లుకి ఎలాగూ ఆమోదం లభించే సూచనలు లేవు కాబట్టి, రాజకీయ పార్టీలన్నీ బిల్లుకి అనుకూలం అని ప్రకటిస్తున్నాయి కనుక తమ సీట్ల కేటాయింపుల్లోనే మహిళా రిజర్వేషన్లు అమలు పర్చాలని, తర్వాత వచ్చిన మూడు ఎన్నికల్లోనూ మహిళా సంఘాలు, సంస్థలు కోరాయి. కానీ, వామపక్షాలతో సహా ఏ పార్టీ కూడా మహిళలకు తగిన ప్రాతిపదికన సీట్లు కేటాయించలేదు. గత పార్లమెంట్ కేవలం 8.9 శాతం మహిళా ప్రాతినిధ్యం కల్పించగా, ప్రస్తుత పార్లమెంట్ 13.1 శాతం మాత్రమే కల్పించింది.

బి.జె.పి., కాంగ్రెస్ వంటి పెద్ద పార్టీలు సైతం నిర్దిష్టంగా బిల్లు ఆమోదానికి కృషి చేయకపోగా, గోడమీది పిల్లివాటంగా ప్రవర్తించాయి. అన్ని రాజకీయ పార్టీలు ములాయం, లాలూ, శరద్ యాదవ్‌లను బూచిగా చూపి తమ చేతులు దులుపుకుంటున్నాయే తప్ప నిజాయితీతో వ్యవహరించడం లేదు. ఏకాభిప్రాయం సాకును చూపిస్తారు కానీ, అటు ఒబిసి మైనారిటీ సవరణల బిల్లుని, ఇటు ప్రజాస్వామ్య ప్రాతినిధ్య చట్ట సవరణకు బిల్లుని ముందుకు తీసుకెళ్లడానికి మాత్రం సుముఖంగా లేరు. 'స్వాతంత్ర్యం' వచ్చి అరవై మూడు సంవత్సరాలైంది అని చెప్పుకుంటూనే ఏ రాజకీయ పార్టీ కూడా మూడో వంతు ప్రాతినిధ్యం మహిళలకు తమకు తాముగా కల్పించే ప్రయత్నం చేయలేదు. అన్ని పార్టీల తిరోగమన భావాలను, అప్రజాస్వామిక పోకడలను ఎండగట్టాల్సిందేనని గుర్తించారు మహిళలు. బిల్లుకి అంగీకరించక తప్పని పరిస్థితుల్లో కూడా ముందుకు రాని ప్రభుత్వాలని నిలదీశారు. సమరశీల పోరాటం చేశారు. ఎంతో పోరాట ఒత్తిడితో మాత్రమే, అది కూడా ఒక లోపంతో (ఒ.బి.సి., మైనారిటీలకు స్థానం లేకుండా) మహిళా బిల్లు ఒక మెట్టు ఎక్కింది.

భారత రాజ్యాంగం స్త్రీ, పురుష సమానత్వం కల్పించినప్పటికీ, అన్ని రకాల వివక్షను రద్దు చేసినప్పటికీ ఆచరణలో సాధ్యం కాలేదు. రాజ్యాంగం అమలు చేస్తామని ప్రమాణ పూర్వకంగా అధికారంలోకి వచ్చిన పాలకులు కొన్ని సంవత్సరాలుగా శాసనోల్లంఘనకు పాల్పడుతూనే ఉన్నారన్నది పచ్చి నిజం. అధికారాన్ని ఇప్పటికే సమాజంలో ఉన్నత వర్గాలు, అగ్రకులాలే అనుభవిస్తున్నాయి తప్ప అట్టడుగువర్గాల వారు అధికారం అంచుల దాకా కూడా రాలేకపోతున్నారన్నది మరో వాస్తవం. అందుకే, భారత రాజ్యాంగం హామీ మేరకు, కొన్ని రకాల వివక్షలను ఓమేరకైనా రద్దు చేసేందుకు రిజర్వేషన్‌లు అమలవుతున్నాయి. ఇప్పటికీ కొనసాగుతున్నాయి. అలాగే మహిళా రిజర్వేషన్‌లలో కూడా దళిత, గిరిజన, వెనుకబడిన, మైనారిటీ వర్గాలకి తగిన భాగస్వామ్యం కల్పించాలి. అదే సామాజిక న్యాయం అవుతుంది. ఇప్పుడు మహిళలకు ప్రత్యేకంగా రిజర్వేషన్‌లు కల్పించ తలపెట్టారు. కనీసం ఇందులోనైనా ఒబిసి, మైనారిటీలకు చెందిన మహిళలకు చట్టసభల్లో ప్రవేశించడానికి అవకాశం లభించాలంటారు సమాజ్‌వాది, రాష్ట్రీయ జనతాదళ్ పార్టీ ఎంపీలు. అందుకోసం లోక్ సభలో ఆటంకాలు కల్పిస్తూనే ఉన్నారు.

మహిళా బిల్లుతో అణగారిన వర్గాలను, కులాలను, రాజకీయాధికారం దిశవైపుకు (అది పాక్షికంగానైనా) నడిపించేందుకు ఒబిసి, మైనారిటీ రిజర్వేషన్‌లు విధిగా బిల్లులో ఉండాలి. సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ఇతర మహిళల కంటే దళిత, వెనుకబడిన, మైనారిటీ వర్గాలకి చెందిన మహిళలు ఇప్పటికీ అణిచివేతలకు గురవుతున్నారన్నది నగ్న సత్యం, నిర్వివాదాంశం. ప్రస్తుత చట్ట సభల్లో వీరి ప్రాతినిధ్యం చాలా తక్కువ, ఈ స్థితిలో అగ్రకులాలకు చెందిన వాళ్లతో మిగతా వాళ్లు ఎన్నికల బరిలో దిగి గెలవడం ఆచరణలో అసాధ్యం. అందుకే సబ్ కోటా పూర్తిగా న్యాయ సమ్మతం.

అయితే, దేవగౌడ్ ప్రభుత్వం పార్లమెంటులో మొదటిసారి బిల్లు ప్రతిపాదించి పదమూడు సంవత్సరాలు దాటింది. అప్పటి నుండి రాజ్యాంగ సవరణద్వారా ఒబిసిలకు, మైనారిటీలకు రిజర్వేషన్‌లు కల్పించే జనరల్ సవరణకోసం పోరాడి ఉంటే బాగుండేది. అప్పుడు ఎస్.సి., ఎస్.టిల లానే కోటా లభ్యమయ్యేది. అలా కాకుండా కేవలం మహిళా బిల్లు సందర్భంలో మాత్రమే ఒ.బి.సి., మైనార్టీ రిజర్వేషన్‌ల కోసం పట్టుబడుతున్నారు. పైగా 5 శాతం చాలు, మరీ కావాలంటే 15 శాతం కన్నా ఎక్కువ అవసరం లేదు. మహిళలకు రిజర్వేషన్‌లు దుర్వినియోగం అవుతాయి. కుటుంబాలు విచ్ఛిన్నం అవుతాయంటూ దూకుడుగా మాట్లాడారు. కోటాలో వాటా న్యాయ సమ్మతం అంటున్న పార్టీలలో బి.సి. వర్గాలకి చెందిన మహిళలకు సీట్లు కేటాయించిన దాఖలాలు మాత్రం లేవు. కనీసం ఈ 13 సంవత్సరాలుగా సవరణ కోసం తగిన విధంగా కృషి చేయకుండా కేవలం పార్లమెంటులో ఆమోదానికి వచ్చినప్పుడే యాగీ చేస్తున్నారు. గత ప్రభుత్వంలో అయితే వీరిదే కీలక భాగస్వామ్యం కూడా. అయినా ఎప్పుడూ అందుకోసం ప్రయత్నించలేదు.

ఎం.ఐ.ఎం. పార్టీ నేత అసదుద్దీన్ ఓవైసీ అయితే 13 ఏళ్లుగా ఎప్పుడూ ప్రస్తావించకుండా ఇప్పుడు మాత్రం మైనారిటీల సంగతేంటి అని ప్రశ్నిస్తున్నారు. దానివలన మిగతా వాళ్లు బిల్లుని అడ్డుకునేవారుగా, అభివృద్ధికి నిరోధకులుగా భావించి వీరిపై దాడులు చేస్తున్నారు. ఆరోపణలు సాగిస్తున్నారు. వీరి వైఖరి వల్లనే బిల్లు ఆమోదం పొందడంలేదని రాజకీయ పార్టీల నాయకులు, మహిళా నేతలు ప్రచారం లంఘించుకుంటున్నారు.

అసలు బిల్లు ఆమోదానికి పెట్టిన ప్రతి సారీ పాలకవర్గాలు అవే చర్చలు జరుపుతున్నాయి తప్ప ఒ.బి.సి., మైనారిటీ రిజర్వేషన్‌లకు అనుగుణంగా రాజ్యాంగ సవరణకోసం కృషి జరపడంలేదు. ఇప్పటి వరకు ఏ రాజకీయ పార్టీ నిర్ధిష్టంగా ఒ.బి.సి., మైనార్టీలకు వ్యతిరేకమంటూ మాట్లాడనప్పుడు ఆచరణలో ఆవైపుకు ఎందుకు కృషి చేయరు? అప్పుడు బిల్లుని వ్యతిరేకించే వారు ఎవ్వరూ ఉండరు అన్న వాదనకు సమాధానం చెప్పేవారే లేరు. ఈ పరిణామాలకు బి.జె.పి., కాంగ్రెస్ అన్ని ప్రధాన పాలక పార్టీలదే బాధ్యత. బిల్లు ఆమోదానికి ఏవో సాకులు చూపుతున్నారంటే కారణం వాటి పితృస్వామ్య, అగ్రకుల వర్గ స్వభావం తప్ప మరొకటి కాదు.

స్త్రీ విద్యను అభివృద్ధి చేయడంలో సాధికారత లక్ష్యమని పేర్కొన్నారు. మహిళా అక్షరాస్యతలో మన రాష్ట్రం దేశంలో 26వ స్థానంలో ఉంది. ఒక శతాబ్ద కాలంలో మూడో వంతు అక్షరాస్యతను కూడా సాధించే చిత్తశుద్ధిలేని పాలకులు 5 సంవత్సరాలలో 25శాతం అదనంగా సాధించగలగడం ఆచరణ సాధ్యమేనా? ఆర్భాటంగా ప్రవేశపెట్టిన 'కిషోర బాలికా' పథకం మరుగున పడిపోయింది. 'మళ్లీ బడికి' పథకం అమలు చేసి బాల కార్మికతను, బాల్య వివాహాలను నిరోధిస్తామనీ, బాలికలలో 100 శాతం అక్షరాస్యత సాధిస్తామనీ పేర్కొనడం నమ్మదగినదేనా? ఫిమేల్ లిటరసీ మిషన్ 2009లో ప్రారంభించడం గమనార్హం.

స్త్రీల సాధికారత గురించి, పౌష్టికాహారం, ఆరోగ్యం, మహిళా-శిశు సంక్షేమం గురించి తెగమాట్లాడుతున్న ప్రభుత్వం పేదకుటుంబాలను మరింత ఛిద్రం చేసేందుకు కిరోసిన్, గ్యాస్ తదితర ధరలను పెంచింది. సబ్సిడీ రద్దుచేసి కూపన్‌లు ప్రవేశపెట్టింది. బోగస్ కార్డుల పేరుతో పెద్దఎత్తున ప్రజా పంపిణీ వ్యవస్థను కుంటుపరుస్తోంది. ఆహార భద్రతను తీవ్రంగా దెబ్బ తీస్తోంది. ఫలితంగా పేద కుటుంబాలలో కనీసం ఒక్కపూట తిండి కూడా కరువవుతోంది. నానాటికీ స్త్రీలలో రక్తహీనత, ప్రసూతి మరణాలు పెరుగుతున్నాయి. తగిన వైద్య సదుపాయాలు లేక పలురకాల అనారోగ్య సమస్యలతో మహిళలు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. మహిళల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతానన్న ప్రభుత్వం ఆసుపత్రులలో కనీస వైద్య సదుపాయాలు కల్పించడంలో విఫలమవుతోంది. హిస్ట్రెక్టమీలు కూడా ఆరోగ్యశ్రీ పథకం కింద చేస్తోంది.

కుటుంబంలోనూ, బయటా హింసకు బలవుతున్న వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతోంది. స్త్రీలపై సాగుతున్న అన్నిరకాల హింసలను అరికట్టాలని ఐక్యరాజ్య సమితి తీర్మానాలు ఉన్నప్పటికీ, నిర్దిష్టంగా చర్యలు చేపట్టాలని ప్రణాళికలు రూపొందించినప్పటికీ అవి అమలవుతున్న దాఖలాలు లేవు. మహిళా కోర్టులూ, పోలీస్‌స్టేషన్లూ, ప్రభుత్వ యంత్రాంగాలు ఏవీ స్త్రీలపై సాగుతున్న హింసలను సక్రమంగా నిరోధించలేకపోతున్నాయి. లైంగిక అత్యాచారాలు, ఆడ శిశువుల హత్యలు, అమ్మకాలు, కిడ్నాపులు, హత్యలు నిరాటంకంగా సాగిపోతున్నాయి. ప్రబలిపోతున్న సామ్రాజ్యవాద సంస్కృతి పుణ్యమా అని మహిళలపై లైంగిక దాడులూ పెరిగిపోయాయి. పొదుపులో మొదటి స్థానంలో ఉందంటున్న మన రాష్ట్రం, మహిళలపై హింసలో మాత్రం అగ్రస్థానంలో ఉంది.

విద్య, ఉద్యోగ, ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాలలో మహిళాభివృద్ధి నామమాత్రమే. మహిళల ఆరోగ్యం, సంక్షేమం కోసం కేటాయింపులు గణనీయంగా తగ్గిపోయాయి. జెండర్ బడ్జెటింగ్ చేయాలని ఒత్తిడి తెస్తున్నా పట్టించుకునే స్థితి లేదు. వ్యవసాయ రంగంలో ప్రముఖపాత్ర వహించే స్త్రీలకు భూమిపై యాజమాన్యపు హక్కులేదు. ఉపాధి లేదు. వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పుల పుణ్యమా అని అంతంత మాత్రంగా ఉన్న పనులు కూడా వారికి కరువవుతున్నాయి, ప్రపంచీకరణ ఫలితంగా అసంఘటిత రంగంలో ముఖ్యంగా కుటీర, చేనేత, బీడీ పరిశ్రమలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. సెజ్‌ల పేరుతో పెద్ద ఎత్తున నిర్వాసితులను చేస్తున్నారు. అభివృద్ది పేరుతో భూమి నుండి, అడవి నుండి గెంటివేస్తున్నారు. మహిళలకు సాధికారత కల్పించడం అంటే ఉన్న జీవించే హక్కులను కాలరాయడమా? ఉపాధి హక్కుల భద్రత ఉన్నపుడే అన్ని రంగాల్లో స్త్రీలు ముందడుగు వేయగల్గుతారు తప్ప సాధికారత అంటూ కల్లబొల్లి కబుర్ల వలన కాదు. ఇన్ని సమస్యలు, సవాళ్లు మహిళలు ఎదుర్కొంటుంటే వీటిని ప్రస్తావించే పరిస్థితే చట్ట సభల్లో లేదు. వీటికి తగిన పరిష్కారాలు వెతకాలన్నా, చట్టాలు రూపొందించాలన్నా అన్ని వర్గాల మహిళల ప్రాతినిధ్యం అవసరం, హక్కు అని కూడా గుర్తించాలి.

ఈ 2010 సంవత్సరం అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా "సమాన హక్కులు, సమాన అవకాశాలు-సమగ్ర అభివృద్ది" అంటూ ఐక్యరాజ్య సమితి పిలుపునిచ్చింది. ఇందులో భారతదేశం కూడా భాగస్వామి అయింది. ఈ నేపథ్యంలోనే ఎన్నో ఒప్పందాలు ఉల్లంఘించిన భారత ప్రభుత్వాలు తప్పని సరి అయి ఈసారి బిల్లుని ప్రవేశపెట్టాయి. ఆదరా, బాదరా రాజ్యసభలో ఆమోదించారు. పైగా భారత మహిళలకు ఇది కానుక అని చెప్పుకొన్నారు. 14 సంవత్సరాలు పితృస్వామ్య, అగ్రకుల, అగ్ర వర్గ స్వభావంతో తొక్కిపెట్టిన బిల్లుకి మోక్షం కల్గించాలని మాత్రం భావించడంలేదు. అన్ని రంగాల్లో సమ భాగస్వామ్యం కల్పించడం ప్రజా స్వామిక హక్కుగా గుర్తించి, సమాన హక్కులు కల్పించాలి. అదే రాజ్యంగ లక్ష్యం, వంద సంవత్సరాల మార్చి 8 పోరాట స్ఫూర్తి అని మహిళలందరూ గుర్తించి నిజమైన సాధికారత కోసం పోరాడాలి.

ఎప్పటికప్పుడు మహిళలను ఓటు బ్యాంకులుగా చేస్తూ, చేసిన వాగ్దానాలను కల్లబొల్లి కబుర్లతో కప్పిపుచ్చుకుంటూ కాలం గడుపుతున్న ప్రభుత్వాలకి తగిన గుణపాఠం చెప్పాలి. చట్టసభల్లో మహిళలకు సముచిత ప్రాతినిధ్యం కల్పించాలని డిమాండ్ చేయాలి. సబ్ కోటాను పొందు పరుస్తూ, వెంటనే బిల్లును ఆమోదించేలా ఒత్తిడి తేవాలి. స్థానిక సంస్థలతో పాటు చట్ట సభల్లో మహిళలకు యాభై శాతం రిజర్వేషన్‌లు కల్పించాలని డిమాండ్ చేయాలి. బూర్జువా సభలైనప్పటికీ మహిళలు ప్రాతినిధ్యం వహించాలనుకునేవారికి, తమ గొంతు విన్పించాలనుకొనే వారికి భాగస్వామ్య హక్కుని కల్పించాలని కోరాలి. వీ

*భద్రతా ప్రమాణాలను గాలికొదిలి, లాభాలే కేంద్రంగా నడుస్తూ, ప్రాణాలు తీస్తున్న గ్రానైట్ పరిశ్రమలోని కార్మికుల స్థితిగతులను వివరిస్తున్నారు* **పులుగుజ్జు సురేష్**

# చీమకుర్తి గ్రానైట్ దుర్ఘటన

ప్రపంచ ప్రసిద్ధి చెందిన చీమకుర్తి గ్రానైట్ పరిశ్రమలో చోటు చేసుకున్న దుర్ఘటన రాష్ట్ర ప్రజానీకాన్ని విషాదంలోకి నెట్టింది. సుమారు ముప్ఫై నుంచి ముప్ఫై మూడు మంది చనిపోయి ఉంటారని బాధిత కుటుంబాల వారు వాపోతుంటే, సదరు గ్రానైట్ యాజమాన్యం, ప్రభుత్వం ఒకే గొంతుతో కేవలం ఆరు మంది మాత్రమే అని తొలుత ప్రకటించారు. ఆ సంఖ్య ఆరు నుంచి పదమూడుకు చేరింది. మరో 17 మంది ఆ బండరాళ్ల కింద నలిగిపోయారని బాధిత కుటుంబాల వారు ఆందోళన చెందుతున్నారు. కడసారి చూపుకైనా నోచుకోనివ్వడం లేదని ఏడ్వడం తప్ప మరొకటి చేయలేని నిస్సహాయ స్థితిలో బాధితులు ఉన్నారు.

ఎటువంటి చిన్న సంఘటన జరిగినా బ్రేకింగ్ న్యూస్, తాజా సమాచారం, ప్రత్యేక సమాచారంల పేర్లతో ప్రత్యక్ష ప్రసారాలతో ఊదరగొట్టి చెవులు చిల్లులు పడేలా చేసే ఎలక్ట్రానిక్ మీడియా, పేపరు మొత్తం అదే ఘటనతో నింపేసే ప్రింట్ మీడియా ఎందుకో మరి చీమకుర్తి గ్రానైట్ కార్మికుల వార్త లోపలి పేజీల్లోకి నెట్టేశాయి. జిల్లా పేజీలు, ప్రాంతీయ జోన్లకు పరిమితం చేసింది. రాష్ట్ర స్థాయిలోనో, జిల్లా స్థాయిలోనో ప్రకటించగలిగిన వార్త కాదా? తగినంత ప్రాధాన్యత ఎందుకివ్వలేదు. కారణం ఏమిటి? వెనకాల ఏవైన శక్తులు పనిచేసాయా లేక, మీడియానే ఆ విధంగా నిలబడిందా?

అక్షరాలే ఆయుధాలు, ప్రజలే దేవుళ్లని, ప్రజల పక్షపాతం, మెరుగైన నూతన సమాజం కోసం పాటుపడుతున్న మీడియా, తామంటే తామంటూ తాటికాయంత అక్షరాలతో ప్రకటించుకునే మీడియా చీమకుర్తి ఘటనపై ఎవరి పక్షం నిలబడింది? ఎవరి కొమ్ము కాసింది? రాజకీయ నాయకులకు కూడా పట్టని అంశమయ్యింది. గత నెలలో విజయవాడలో జరిగిన కృష్ణవేణి హత్యను ఒకటిన్నర రోజులు ప్రత్యక్ష ప్రసారం చేసిన మీడియా, అనేకమంది మేధావులను తమ స్టూడియోకు పిలిచింది. అందుబాటులో లేని వారిని తమకున్న లైవ్‌వ్యాన్ నెట్‌వర్క్‌ల ద్వారా వారి అభిప్రాయాలను ప్రత్యక్షంగా ప్రసారం చేయగలిగింది.

ఒక్క ప్రాణానికి అంత హడావుడి చేసిన మీడియా చీమకుర్తి ఘటనను పట్టించుకోకపోవడం వెనుకనున్న ఆంతర్యమేమిటి? ఎవరైనా పసిపిల్లలు బోరు బావిలోపడితే రాష్ట్ర యంత్రాంగమంతా బోరు బావి చుట్టూ ప్రదక్షిణలు చేయగలిగేలా తమకున్న ఆయుధంతో చేయగలిగే మీడియా చీమకుర్తి ఘటనపై వివక్ష చూపిందా? మీడియా చేసే హడావుడికి ఎంతటి పెద్ద నాయకులు, ప్రభుత్వమైనా తమ పనులన్నిటినీ వాయిదా వేసుకుని వారనుకున్న ఘటనవైపు దృష్టి మళ్లించేలా చేయగలుగుతుంది.

విజయవాడలో కృష్ణవేణి హత్యకు సంబంధించిన ఘటనలో అదే జరిగింది. రాష్ట్రంలోని ప్రధాన రాజకీయ నేతలందరూ చంద్రబాబు నాయుడు, చిరంజీవి, కమ్యూనిస్టు నాయకులు, రాష్ట్ర మంత్రులు, వివిధ ప్రతిపక్ష పార్టీల నేతలందరూ విజయవాడ వెళ్లక తప్పలేదు. మరి చీమకుర్తి గ్రానైట్‌కు ఎందుకు పోలేదు. సందర్శించిన వారు కూడా ఘటన జరిగిన రెండు మూడు రోజుల వరకూ ఎందుకు స్పందించలేదు. ఇవన్నీ ప్రజలు వేస్తున్న ప్రశ్నలు.

ఘటన సంభవించిన స్థలానికి యాజమాన్యం ఎందుకు రాలేదు. కంపెనీ తరపున గనులు, చేనేత జౌళి శాఖమంత్రి బాలినేని శ్రీనివాసులు రెడ్డి వకాల్తా పుచ్చుకుని ఎందుకు మాట్లాడారు? అంత పెద్ద దుస్సంఘటనను కేవలం పరిహారంతోనే ముడిపెట్టి, పరిహారమే కేంద్రంగా ఎందుకు మాట్లాడారు? చీమకుర్తి గ్రానైట్ సమస్య కేవలం పరిహారానికే పరిమితమయ్యేదా? వీటన్నిటినీ చర్చించాలి.

చీమకుర్తి గ్రానైట్ ఒక అంతర్జాతీయ సమస్య. స్థానిక వనరులను కలుషితం చేసి అక్కడి ప్రజాజీవనంపై తీవ్రమైన ప్రభావం చూపుతోంది. అక్కడొక కులవివక్ష ఉన్నది. పర్యావరణంపై చూపే ప్రభావం పై చర్చించాలి? వందలాది మంది ప్రాణాలు బలి తీసుకుంటున్నది? కొందరి ప్రయోజనాలే కొమ్ము కాసిన పరిశ్రమ అది? ఎయిడ్స్ మహమ్మారిని విపరీతంగా ప్రజలపై రుద్దిన పరిశ్రమ? వేలాది మందిని నిరుద్యోగులుగా మిగిల్చిన పరిశ్రమ? పేదలు - పెద్దలకు మధ్య ఆర్థిక వ్యత్యాసాన్ని పెంచిన పరిశ్రమ? అన్నిటికీ మించి తాగునీరు లేకుండా చేసిన పరిశ్రమ. ఆహార పంటలను విధ్వంసం చేసి, వాణిజ్యం చేసిన పరిశ్రమ అది.

ప్రపంచ ప్రసిద్ధి చెందిన పరిశ్రమ, ప్రపంచ శ్రేణి ప్రమాణాలేవి పాటించకుండా ప్రజలను క్షతగాత్రులను చేసి రోడ్డున పడేసిన పరిశ్రమ. అనేకమంది మహిళలపైన వికృత రూపం చూపి, వారి శరీరాలతో వ్యాపారం చేసి, వారి తాత్కాలిక సుఖాల కోసం అనేక కుటుంబాలలో నిప్పులు పోసిన పరిశ్రమ? వేలాది మంది యువతీ యువకులను, భావి భారత పౌరులను పక్కదారి పట్టించి, వారి బంగారు భవిష్యత్తును రాళ్లపాలు చేసిన పరిశ్రమను గురించి విస్తృతమైన చర్చ ఎందుకు జరగడం లేదు. పరిశోధనలెందుకు చేయడం లేదు. మీడియా ప్రధాన శీర్షికలుగా ప్రచారమెందుకు చేయడం లేదు.

అసలు సమస్యను పక్కకు నెట్టి మంత్రిగారు కేవలం పరిహారం చుట్టూ మాత్రమే ఎందుకు తిప్పుతున్నారు. ఓబుళాపురం మైనింగ్‌పై చేసిన చర్చ చీమకుర్తి గ్రానైట్‌పై ఎందుకు చోటు చేసుకోవడం లేదు? వీటన్నిటిని ఆపుతున్న మాయా ద్వీపం ఏమైనా ఉన్నదా? లేక మరేమైనా ప్రత్యేక కారణాలు ఉన్నాయా? ఎన్ని దుర్ఘటనలు జరుగుతున్నా యాజమాన్యంపై కేసులు నమోదు కావు. నమోదయిన కేసులపైన ఆధారాలు ఉండవు. సరయిన సెక్షన్‌లు మోపరు. నిరూపణకు శిక్షలు ఉండడం లేదు. ఇవన్నీ రాజకీయ నాయకులకు ఎందుకు పట్టడం లేదు. వారి ఆలోచనలన్నీ తెలంగాణకు మద్దతునియ్యాలా? సమైక్యాంధ్ర అనాలా? జై ఆంధ్ర అనాలా? సీమాంధ్ర అనాలా? ప్రత్యేక రాయలసీమ అంటే వారి ప్రయోజనం నెరవేరుతుందా? లేక ఇప్పుడు సమాజం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యల నుండి బయటికి తెచ్చే బాధ్యతను విస్మరించి వ్యూహాత్మకంగా ప్రజల సమస్యను పక్కదారి పట్టిస్తున్నారా? రాష్ట్ర ప్రయోజనాలను పక్కకునెట్టి ప్రజాసమస్యల పట్ల వివక్ష కొనసాగుతున్నది.

గ్రానైట్‌తోపాటు మరో మూడు అంతర్జాతీయ ప్రసిద్ధి చెందిన పరిశ్రమలు ప్రకాశం జిల్లాలో ఉన్నాయి. అవి పలకల పరిశ్రమ (మార్కాపురం), చేనేత పరిశ్రమ (చీరాల), ఒంగోలు జాతిఎద్దులు (జిల్లావ్యాప్తం) ఏ ఒక్క పరిశ్రమలోని కార్మికులు సంతృప్తిగా లేరు. ఆ పరిశ్రమలపై ఆధారపడి జీవించే వారు దుర్భర దారిద్ర్యం అనుభవిస్తున్నారు. మార్కాపురం పలకల పరిశ్రమ కేవలం పలకలను తయారు చేసినంత కాలం పరిసర ప్రాంతంలోని సుమారు 100 గ్రామాల ప్రజలు కనీసం యాభై వేల కుటుంబాలకు ఉపాధి ఉండేది. విదేశాలకు ఎగుమతి చేసేవారు. పలకల నుండి డిజైన్ రాళ్లు (ఫ్లోరింగ్, గోడలకు అంటించడానికి) తయారు చేసే రాళ్లుగా ఒకటిన్నర దశాబ్దం క్రితం యంత్రాల వినియోగం పెరిగింది. క్రేన్‌లు, బుల్డోజర్‌ల సహాయంతో భూగర్భంలోనికి వందలకొద్ది మీటర్లు తవ్వడం, లాభాల కేంద్రంగా మారిన ఈ పరిశ్రమలో ప్రమాదాలు పెరిగాయి.

పలకల పరిశ్రమపై ఆధారపడిన వారిలో అధికంగా దళితులు, గిరిజనులు, బిసిలలోని కింది వర్గాలు ఉన్నాయి. అగ్రవర్ణాలు పరిశ్రమ నిర్వాహకులు. యాంత్రీకరణ మొదలైనప్పటినుండి వేలాది కుటుంబాలు ఉపాధి కోల్పోయాయి. వందలాది మంది ప్రమాదం బారినపడ్డారు. రక్తం కార్చిన శ్రమతో ఆత్మగౌరవంతో బతికేవారు. కాళ్లు విరిగి, నడుములు విరిగిన వారిని కంపెనీలు, యాజమాన్యం పట్టించుకోక పోవడం వలన అచేతన స్థితిలో రోడ్ల మీద అడుక్కుతినే వారి సంఖ్య పెరిగిపోయింది. ఏ చట్టాలు వీరి పక్షాన నిలబడలేదు. ఇదే పరిస్థితి చీమకుర్తి గ్రానైట్ పరిశ్రమలో నెలకొన్నది. అత్యంత ప్రమాదకరమైన పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులకు ఎటువంటి భద్రతా చర్యలు తీసుకుంటున్న పరిస్థితి లేదు. క్వారీలల్లో చనిపోతే అది కార్మికుల తప్పుగానే చిత్రీకరిస్తున్న సంఘటనలు అనేకం ఉన్నాయి. ప్రమాదాల్లో బతికి బయటపడిన వారికి ఆస్పత్రి ఖర్చులు కూడా భరించడం లేదు. పిల్లలు ముఖ్యంగా బాలికలు బాల కార్మికులుగానే మగ్గుతున్నారు.

ఒంగోలు గిత్తలంటే ప్రపంచదేశాలలో పేరొందినవి. రష్యన్ దేశస్తులు ఒంగోలు గిత్తలను ఐదు లక్షలకు కొని ఆ గిత్తల వీర్యంతో రష్యన్ దేశీయ ఎద్దుల జాతిని అభివృద్ధిని చేసుకున్నాయి. అయితే ఒంగోలు గిత్తలతో వ్యవసాయం సాగించే రాష్ట్రంలో ఎద్దులు కనుమరుగవుతున్నాయి. ట్రాక్టర్ వ్యవసాయం, రసాయనిక ఎరువులు మన దేశీయ వ్యవసాయం పైన, గ్రామీణ పరిశ్రమలపైన, ఒంగోలు జాతి ఎద్దులపైన తీవ్ర ప్రభావం చూపాయి. జానపదకళలు, పరిషత్తు నాటకాలకు పరిమితమైన విధంగా ఒంగోలు జాతి ఎద్దులు, ఎడ్ల పందాలకు, పెట్రోల్ చార్జీలు పెరిగినప్పుడు ప్రతిపక్షాలు ఎడ్లబండ్లపై అసెంబ్లీకి పోయి మీడియాకు ఫోజులివ్వడానికి పరిమితమవుతున్నాయి. కానీ, పర్యావరణంపై ఎటువంటి ప్రభావం లేకుండా, ప్రజలు పశువులు, సహజ వనరుల భాగస్వామ్యంతో ఉత్పత్తి చేసే ఆహార పంటలు ఈ రోజు బహుళజాతి సంస్థలపై ఆధారపడేలా చేశారు.

చీరాలలోని చేనేత పరిశ్రమ, చేనేత రంగంలో కార్మికులు నిత్యం ఆకలి చావులు, ఆత్మహత్యలకు బలవుతున్నారు. అనేక జాతీయ, అంతర్జాతీయ కారణాలు ఉన్నాయి. ముడిసరుకు ధరలు విపరీతంగా పెరిగాయి. బడ్జెట్‌లో కేటాయింపులు ఉంటున్నాయి. కానీ ఖర్చులు చేయడంలో, కేటాయింపులు దారి మళ్లుతున్నాయి. మహిళలు, వృద్ధులు, గిరిజనులు, దళితులు, వెనుకబడిన వర్గాలు ఆధారపడిన చేనేత పరిశ్రమకు ప్రభుత్వ ప్రోత్సాహం లేకపోగా వ్యతిరేక విధానాలతో పరిశ్రమ ఉనికికే ప్రమాదం తెచ్చిపెడుతున్న పరిస్థితి ఉంది. భారత ఆర్థిక వ్యవస్థలో కీలక భూమిక పోషించిన చేనేత పరిశ్రమకు ప్రభుత్వ సహకారం లేకపోవడం, పరిశ్రమ తనంతట తానుగా స్వావలంబన దిశగా సమర్థవంతంగా నడవడానికి సరయిన చర్యలు తీసుకోకపోవడం వలన చేనేతరంగం తీవ్రమైన సంక్షోభం ఎదుర్కొంటోంది. చేనేతరంగంపై ఆధారపడిన వారికి సగటున రోజుకు యాభై రూపాయలు కూడా గిట్టుబాటు కాని పరిస్థితి ఉంది. ఆకాశానికి ఎగబాకుతున్న నిత్యావసర ధరలతో పోటీపడలేక ప్రత్యామ్నాయం లేక నిరాశా నిస్పృహలతో బతుకెళ్లదీస్తున్నది చేనేత పరిశ్రమ.

పేరు గొప్ప ఊరు దిబ్బ అన్నట్టుగా నాలుగు రకాల ప్రపంచ ప్రసిద్ధి చెందిన పరిశ్రమలు ప్రకాశం జిల్లాలో ఉంటే ఏ ఒక్క పరిశ్రమలో కూడా కార్మికుల కళ్లలో ఆనందం కనబడడం లేదు. వారు సంకెళ్లు వేసిన స్వేచ్ఛ ముసుగు కప్పుకున్న బానిసలుగా, జీవచ్ఛవాలుగా అభద్రతా జీవితం గడుపుతున్న పరిస్థితి ఉంది. కావున బుద్ధిజీవులు, పరిశోధకులు, మీడియా ఇతరవర్గాల వారు ఈ పరిశ్రమలపై దృష్టి పెట్టి వారిని హక్కుల ఉద్యమంవైపు నడిపించే ప్రయత్నం చేయాలని కోరుకుంటున్నాను. వీ

*తెలంగాణ ప్రజలకు జరిగిన మోసాలూ, నష్టాలూ ఇక చాలనీ, రాజకీయ పార్టీల అవకాశవాదాల్ని ఎండగడుతూ ఉద్యమశక్తులన్నీ ఐక్యతతో ముందుకు సాగాలనీ అంటున్నారు* **కె. ప్రభాకర్**

# రాజకీయ సంకెళ్లలో తెలంగాణ

యాభై నాలుగేళ్ల సమైక్యాంధ్రప్రదేశ్‌లో తెలంగాణ ప్రాంతం. నీళ్లు, నిధులు, భూములు, కొలువులు, విద్య, వైద్యం, విద్యుత్, పరిశ్రమలు, సంస్కృతి కోల్పోయింది. దీంతో పాటు తాము పుట్టిన నేల మీదే వలసాంధ్ర పాలన వలన పరాయి మనుషులుగా ఉండాల్సి వస్తోంది. బతుకులీడ్వలేక వలసపోతున్న లక్షలాది మంది ప్రజల జీవన్మరణ పోరాటంగా 1952లో వెల్లోడి సివిల్ పాలనలోనే 'నాన్ ముల్కీ గో బ్యాక్' అని నినదించిన నోటి నుండి, నేటి శ్రీకాంతచారి, వేణుగోపాలరెడ్డి, సిరిపురం యాదయ్య, కానిస్టేబుల్ కిష్టయ్య, అడ్వకేట్ వెంకటేశ్వర్లు, పాలమూరు సువర్ణ, కోదాడ సాయికుమార్‌ల ఆత్మహత్యల పరంపరలతో సాగుతున్న ఉద్యమం అనేకమార్లు యాభై మూడేళ్లుగా రాజకీయ నాయకుల విద్రోహానికి గురవుతూనే ఉంది.

ఆ నేపథ్యంలోనే ఇవ్వాళ సాగుతున్న ఉద్యమాన్ని, ఈ ఉద్యమానికి అడ్డంకిగా మారిన సీమాంధ్ర నేతల కుయుక్తులతో, తెలంగాణ ప్రాంత రాజకీయ నాయకుల అవకాశవాద విధానాలను అంచనా వేస్తూ ముందుకు సాగవలసి ఉంది.

తెలంగాణ ప్రాంత నాయకుల్ని మభ్యపెట్టి 'తెలంగాణ'ను 'ఆంధ్ర' రాష్ట్రంలో విలీనం చేయడం వల్ల ఆనాటి ఎస్సార్సీ పేరా 371లో స్పష్టం చేసినట్టు ఇవ్వాళ తెలంగాణ సర్వస్వాన్ని కోల్పోయి 'సీమాంధ్ర' నేతలకు, వాళ్లకు వెన్నుదన్నుగా నిలిచిన తెలంగాణను ప్రపంచీకరణ, సరళీకరణ విధానాలకు ప్రయోగశాలగా మార్చుకున్న 'ప్రపంచబ్యాంక్' ఏజెంట్లకు, బహుళజాతి 'సెజ్'ల దురాక్రమణకు వలస ప్రాంతంగా మారిపోయిందన్నది అక్షర సత్యం.

'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' స్థాపిస్తామని నమ్మబలికిన వామపక్ష విద్యావంతుల రాజకీయుల మాటలు అవాస్తవమని 1969 రుజువు చేసింది. మా ఉద్యోగాలు మాకు కావాలన్నందుకు విద్యార్థులపై జరిపిన కాల్పుల్లో 369 మంది మరణించారు. వాళ్ల నెత్తుటి సిరాతో రాసిన జిఒ 36 (1969 ఏప్రిల్) మేరకు స్వయంగా ప్రభుత్వమే ఇరవై రెండు వేల ఉద్యోగాలు తెలంగాణ ప్రాంత బిడ్డలవి, సీమాంధ్ర ఉద్యోగులు కొల్లగొట్టారు. వారి ఉద్యోగాలు వారికే ఇస్తామని చేసిన వాగ్దానాలు నెరవేరకపోగా, అసలుకే మోసం చేసే విధంగా 'ముల్కీ రూల్స్' చట్టబద్ధమేనని సుప్రీంకోర్టు ప్రకటించింది. అయినా 'జై ఆంధ్ర' ఉద్యమం పేరిట ముల్కీ రూల్స్‌ను, ఆరు సూత్రాల పథకం పేర ఆనాటి పెద్ద మనుషుల (జెంటిల్‌మెన్ అగ్రిమెంట్ – 1956) ఒప్పందాలను నీరుగార్చడం జరిగింది.

1975లో రాష్ట్రపతి ఉత్తర్వుల్లో స్పష్టంగా రాష్ట్రాన్ని ఆరు జోన్లుగా విభజిస్తూ 'హైదరాబాద్' ఆరవ జోన్‌లో భాగమేనని చెప్పినప్పటికీ అధికారంలో ఉన్న రాజకీయ పార్టీలు, అధికారులు రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని 14 (ఎఫ్) లోని సిటీ పోలీస్ ఆక్ట్ (1343 ఫస్లి) వివిధ అంశాలకు చెందిన చట్టాన్ని దుర్వినియోగం చేశారు. రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధంగా ఉత్తర్వులను అమలు చేస్తున్నారు. అందువల్లే 1985 నాటి 610జిఒ అమలు కాలేదని, ఆ కోవలోనే సుమారు రెండున్నర లక్షల ఉద్యోగాలు తెలంగాణేతరులు కొల్లగొట్టారని 2004లో 'గిర్‌గ్లానీ' స్పష్టం చేశారు.

ఉవ్వెత్తున సాగిన, సాగుతున్న తెలంగాణ ఉద్యమాన్ని కొంతమంది సీమాంధ్ర నేతలు, మేధావులు ఇది రాజకీయ నిరుద్యోగుల పోరాటమని, కేవలం కెసిఆర్, టిఆర్ఎస్ నడుపుతున్న ఉద్యమంగా అనేక ప్రశ్నలను లేవనెత్తుతున్నారు.

3 మార్చ్ 1969లో విద్యావంతులు, ఉద్యోగులు, తెలంగాణ ఉద్యమకారులు తెలంగాణ కోసం ఏర్పాటు చేసుకున్న 'తెలంగాణ ప్రజాసమితి'లో ఆనాడు చీమలు పెట్టిన పుట్టలోకి పాములు చేరినట్లు, మర్రి చెన్నారెడ్డి లాంటి నాయకులు చేరి తెలంగాణను కేంద్రానికి తాకట్టు పెట్టడం వల్ల తెలంగాణ ప్రజల ఆకాంక్ష నివురుగప్పబడింది.

ఆ నేపథ్యంలోనే ఇవాళ సాగుతున్న ఉద్యమాన్ని పరిశీలించాల్సిన అవసరం ఉంది. తమది రాజకీయ పార్టీ కాదని, ఉద్యమ సంస్థ అని ప్రకటించుకున్న 'టిఆర్ఎస్' ఈ పదేళ్ల కాలం అడపాదడపా పోరాటాలు చేసినా, అత్యధికంగా రాజకీయ 'లాబీయింగ్'కు, పొత్తులకు, ఎన్నికలకు పరిమితమయ్యారు. అందువల్లే ప్రజాభీష్టానికి భిన్నంగా ఓసారి కాంగ్రెస్‌తో మరోసారి టిడిపితో పొత్తు ద్వారా గెలవడం, ఓడడం జరిగింది. రాజీనామా ప్రహసనాలతో విసిగిపోయిన ఉద్యమ శక్తులన్నీ మళ్లీ ఆయన దీక్షతో ఉద్రిక్తులైనదీ వాస్తవం.

దీక్షలను గమనించిన ఓయు విద్యార్థి లోకం కెసిఆర్ నైజాన్ని తీవ్రంగా గర్హిస్తూనే ఉద్యమానికి ఊపిరులూదడం, వారికి అండగా మొత్తం తెలంగాణ లేచి నిలవడం చూశాం.

డిసెంబర్ 9 ప్రకటన విద్యార్థి లోకపు చైతన్యానికి నిదర్శనం. దానికి ప్రతిస్పందనగా ఉద్యమాన్ని ముందుకు నడపాల్సిన శక్తుల ఉద్యమశీలతను 24 గంటలు గడవక ముందే 'సీమాంధ్ర నేతల' వలసాధిపత్య ఐక్యతకు, హైకమాండ్‌లు, పార్టీల అధినేతలు తలొగ్గడం ద్వారా డిసెంబర్ 23 ప్రకటన 'తెలంగాణ'ను వెనక్కు నెట్టింది.

*గత నాలుగు నెలలుగా మళ్లీ రాజుకున్న తెలంగాణ ఉద్యమాన్ని సమీక్షించుకుని, అందులోని లోటుపాట్లను సరిచేసుకొని, పోరాటాన్ని ఉధృతం చేయాల్సిన అవసరాన్ని తెలియజేస్తున్నారు* **ఎడ్ల పోచయ్య**

# తెలంగాణ ఉద్యమం - కొత్త సవాళ్లు

నవంబర్ 2009 చివరివారంలో కీలకదశలోకి ప్రవేశించి, డిసెంబర్ 9న కేంద్ర ప్రభుత్వం చేత చరిత్రాత్మకమైన ప్రకటన చేయించగలిగిన తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర సాధన ఉద్యమం కాలం గడిచినకొద్దీ కొత్త చిక్కులలోకి, సవాళ్లలోకి ప్రవేశిస్తున్నది. డిసెంబర్ 9న చేసిన ప్రకటనకు కట్టుబడి ఉండాలని, ఆ ప్రకటన స్ఫూర్తితో, కొనసాగింపుగా ముందుకుపోవాలని కేంద్రప్రభుత్వం ఆలోచిస్తున్న సూచనలు కనబడడం లేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, వాటిని నడుపుతున్న కాంగ్రెస్ పార్టీ, రాష్ట్రంలో ప్రధాన ప్రతిపక్షమైన తెలుగుదేశం పార్టీ తెలంగాణ విషయంలో ఎన్ని మాటలు మారుస్తున్నాయో, ఎంత మోసపూరితంగా వ్యవహరిస్తున్నాయో లెక్కలేదు. రాజకీయపక్షాలన్నీ ఎంతగా తమ వంచననూ, అబద్ధాలనూ ప్రదర్శిస్తున్నా, తెలంగాణ ప్రజలు మాత్రం ఉవ్వెత్తున కదులుతున్నారు. తెలంగాణ రాష్ట్రం సాధించేదాకా పోరాటాన్ని విరమించేది లేదంటున్నారు. మరొకవైపు రాజకీయపక్షాల దొంగ నాటకాలవల్ల నిరాశ చెందుతున్న యువకులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఇలా ఇవాల్టి స్థితిలో ఒకవైపు ఉద్యమ ఉధృతి, మారుమూల గ్రామసీమలనుంచి నగరాల దాకా అన్ని వర్గాల ప్రజాసమూహాలు ఉద్యమంలో పాల్గొంటూ ఉండడం, కొంతమేరకు నిరాశ కనబడుతుండగా, మరొకవైపు ఇంత విశాలమైన ప్రజా సమూహాన్ని నడిపించవలసిన నాయకత్వంలో అందుకు అవసరమైన దూరాలోచన, సమగ్ర దృక్పథం కనబడడం లేదు.

ఈ సంక్లిష్టమైన, పరస్పర విరుద్ధమైన సూచనలు కనబడుతున్న పరిస్థితినంతా గమనంలోకి తీసుకుని ఇవాళ ఉద్యమం ఎదుర్కొంటున్న సమస్యలను, సవాళ్లను సమగ్రంగా గుర్తించి, వాటిని అధిగమించే ఆలోచనలుచేసి వాటిని తక్షణమే ఆచరణలో పెట్టగలిగితే ప్రస్తుత

---

ఇక్కడి నుండి సమిష్టిగా ఉద్యమాన్ని మరింత పటిష్టంగా ముందుకు తీసుకుపోవాల్సిన 'జెఎసి' రాజీనామాల పేర తాత్సారం చేసింది. 'ఢిల్లీ' మాయాజాలంలో 'ముందు'టి ప్రశాంతత కోసం అన్ని పార్టీలు 'మౌనం' వహించాయి. దీంతో దిశలేని ఉద్యమం, నాయకులు లేని ఉద్యమంగా కొనసాగింది. ప్రజలు స్వచ్ఛందంగా తమదైన శైలిలో ఉద్యమాన్ని నడుపుతుంటే 'జెఎసి', అందులోని రాజకీయ పక్షాలు టివిలకు పరిమితమైపోవడం వల్ల విద్యార్థి లోకం నైరాశ్యానికి గురై ఆత్మహత్యల బాటపట్టింది. ఇది రాజకీయ పార్టీల వైఫల్యమే.

దీనికి ఏ పార్టీ మినహాయింపు కాదని, 'ఫిబ్రవరి 20న' ఓయు, కెయు తదితర విద్యార్థి జెఎసిలు పిలుపునిచ్చిన అసెంబ్లీ ముట్టడి ద్వారా రుజువైంది. శ్రీకృష్ణ కమిటీ తెలంగాణకు వ్యతిరేకమైందని, శ్రీకృష్ణా గో బ్యాక్ అంటూ, పార్లమెంట్‌లో బిల్లు పెట్టాలని డిమాండ్ చేస్తూ అసెంబ్లీ ముట్టడికి పిలుపునిచ్చిన ఓయు జెఎసికి అండగా నిలవాల్సిన రాజకీయ పార్టీలు అసెంబ్లీలో ముచ్చట్లకు పరిమితమైతే, అప్పటికే అసెంబ్లీకి దూరంగానున్న టిఆర్ఎస్ 'అసెంబ్లీ ముట్టడికి మేం దూరం' అని ప్రకటించింది. రాజకీయ పార్టీల వైఖరికి విసిగిపోయిన విద్యార్థి లోకం అసంతృప్తి సిరిపురం యాదయ్య రూపంలో భగభగ మండిపోయింది. తెలంగాణకు ఆటంకమైన 'రాజకీయాలను ధ్వంసం చేసైనా తెలంగాణను సాధించుకుంటాం' అని ఓయు విద్యార్థి జెఎసి యాదయ్య మృతదేహంపై చేసిన 'ప్రమాణం' ఇవాల్టి రాజకీయ నాయకుల విద్రోహానికి నిదర్శనం.

ఒకవైపు శ్రీకృష్ణ కమిటీ గో బ్యాక్ అంటూనే కమిటీకి నివేదికలు అందించే పనిలో నిమగ్నమైన శక్తులన్నీ ఉద్యమిస్తున్న శక్తులను గైడ్ చేయడంలో వైఫల్యం చెందాయి. పార్టీలు, విధానాలు పదవుల కోసమేనన్నట్లు 'తెలంగాణ రాకముందే నేను దళితుణ్ని కనుక నేనే ముఖ్యమంత్రి'ని అని ఒకరు, 'తెలంగాణ వస్తే నేనంటే నేనే ముఖ్యమంత్రి'ని అని ప్రకటించుకుంటున్నారు నాయకులు. ఇట్లాంటి నాయకులు, రాజకీయాలతో విసిగిపోయిన విద్యార్థి లోకం ఆత్మహత్యలు చేసుకుంటే, వాళ్లు తెలంగాణ కోసం ప్రాణత్యాగం చేస్తే, వాళ్ల తల్లిదండ్రులకు టిక్కెట్లు ఇవ్వాలని కొందరు, రాజీనామాలు చేసిన స్థానాల్లో మళ్లీ వాళ్లనే గెలిపించాలన్న బస్సు యాత్రలకు పరిమితమై కొందరు, ఇవన్నీ ఉద్యమ వైఫల్యానికి నిదర్శనం.

దీనికి భిన్నంగా తెలంగాణ ఉద్యమానికి ఆటంకంగా మారిన రాజకీయ సంకెళ్లను తెంచుకొని తెలంగాణ ఉద్యమ శక్తులన్నీ చిత్తశుద్ధితో జెఎసిల సమన్వయ కమిటీ పేర రాజకీయేతర వేదికగా, తెలంగాణ బిల్లు పార్లమెంట్‌లో పెట్టడం కోసం రాజకీయ పార్టీల మెడలు వంచే సంఘటిత పోరాటాన్ని కొనసాగించవలసిన అవసరం ఉంది.

అందుకు విద్యార్థులను కంటికి రెప్పలే కాపాడుకనే స్ఫూర్తితో పాటు, తెలంగాణ ఉద్యమం సీమాంధ్ర సామాన్య ప్రజానీకానికి వ్యతిరేకమైనది కాదని, దోపిడీవర్గ రాజకీయ విధానాలకు వ్యతిరేకమైన ప్రజా ఉద్యమంగా కొనసాగించాలి. తెలంగాణను సాధించుకోవడం మాత్రమే కాక ఇదే స్ఫూర్తితో మన ఆకాంక్షలన్నిటిని రేపటి తెలంగాణలో సాధించుకోవాలి. వీ

ఉద్యమానికి అర్థవంతమైన భవిష్యత్తును ఆశించవచ్చు. ఆ దిశలో కొన్ని ఆలోచనలు ప్రతిపాదించడమే ఈ వ్యాస లక్ష్యం.

ప్రస్తుత తెలంగాణ ఉద్యమం ఎదుర్కొంటున్న అనేక సమస్యలలో ప్రధానమయినవి ఏడు:

1. ఉద్యమ పరిష్కారం విషయంలో పాలకవర్గాల వైపు నుంచి సాగుతున్న సందిగ్ధత, కాలయాపన.
2. ఉద్యమ ప్రత్యర్థులు సాగిస్తున్న ప్రచారం, అబద్ధాలు, ఆరోపణలు.
3. ఉద్యమ నాయకత్వపు వైఫల్యం, అసమర్థత, లోపాలు.
4. ఉద్యమంలో చీలికలు తేవడానికి పాలకవర్గాలు, ప్రత్యర్థులు, అంతర్గత శక్తులు సాగిస్తున్న ప్రయత్నాలు.
5. ఉద్యమ నాయకులలో కొందరినైనా నిశ్శబ్దం చేయడానికి పాలకుల ప్రయత్నాలు.
6. ఉద్యమాన్ని అణచివేయడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న దమననీతి.
7. ఉద్యమంలో చురుకుగా పాల్గొంటున్న ప్రజలకు గాని, ఉద్యమ నాయకత్వానికి గాని దీర్ఘకాలిక దృష్టి లేకపోవడం.

ఈ ఏడు సవాళ్లు దేనికదిగా విడివిడిగా ఉంటే ఎదుర్కోవడం, పరిష్కరించడం సులభమే కావచ్చు గాని, అవి ఒకదానితో ఒకటి కలిసిపోయి, సంక్లిష్టంగా ఉన్నప్పుడు చిక్కుముడులలాగ తయారవుతాయి. ఒకదాన్ని విప్పబోతే మరొకటి బిగుసుకుంటుంది. అన్నిటినీ సవ్యంగా పరిష్కరించడానికి చాల దూరదృష్టి, ఓపిక, సమన్వయం, ప్రజా ప్రయోజనాలపట్ల నిబద్ధత అవసరమవుతాయి. ఇవాళ తెలంగాణ ఉద్యమనాయకులు చాలమందిలో ఈ లక్షణాలు ఉండవలసినంతగా లేవనేది విచారకరమైన వాస్తవం.

మొదటి సమస్య డిసెంబర్ 9న చిదంబరం ప్రకటన కల్పించిన ఆశలతో మొదలయింది. ఆ ప్రకటనను స్వాగతించిన తెలంగాణ ప్రజలు కేంద్ర ప్రభుత్వాన్ని అవసరం కన్న ఎక్కువగా నమ్మారు. గత యాభై సంవత్సరాలలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, కాంగ్రెస్ పార్టీ తమను అనేకసార్లు మోసం చేశాయని, ఈసారి కూడ మోసం చేయవచ్చునని, అలా మోసం చేయకుండా ఉండాలంటే నిరంతర ఒత్తిడి ఉండాలని తెలంగాణ ప్రజలు గుర్తించలేకపోయారు. లేదా తెలంగాణ ప్రజలకు ఈ జాగరూకతను కల్పించవలసిన ఉద్యమ నాయకత్వం ఆ పని చేయలేకపోయింది. ఈ తెలంగాణ ఉద్యమ నాయకత్వంలో పార్లమెంటరీ రాజకీయ పక్షాలు, పాలకవర్గ ముఠాలు, స్వార్థపర శక్తులు కూడ ఉన్నాయి గనుక వాటికి ఇటువంటి ప్రజాచైతన్యాన్ని కల్పించే ఆసక్తి గాని, కార్యక్రమం గాని ఉంటాయని ఆశించలేం. కాని, ప్రజానుకూల పక్షాలు, పాలకవర్గ కుట్రలను గురించి అధ్యయనం, అనుభవం ఉన్న మేధావులు, ప్రజాసంఘాలు, పార్లమెంటరీయేతర పక్షాలు కూడ ఈ చైతన్యాన్ని కల్గించలేకపోయాయి. మొత్తం మీద డిసెంబర్ 9 ప్రకటనతో తమ పని అయిపోలేదని, నిజానికి అప్పుడే క్రియాశీలంగా పని చేయవలసిన అవసరం పెరిగిందని గుర్తించవలసిన తెలంగాణ ప్రజలు, రాజకీయ పక్షాలు కొంత ఏమరపాటును ప్రదర్శించాయి.

సరిగా తెలంగాణ ప్రజలలో, ఉద్యమంలో ఈ ఏమరపాటు ఉన్నప్పుడు ఆ అవకాశాన్ని సంపూర్ణంగా వాడుకున్నవారు కోస్తాంధ్ర, రాయలసీమ రాజకీయ నాయకులు. వారు అక్కడి ప్రజలలో ఉండగల భయాలనూ సందేహాలనూ రాజేసి, నిరాధారమైన భయాలను ప్రవేశపెట్టి అక్కడ ఒక ఉద్యమాన్ని సృష్టించగలిగారు. తమ ప్రయోజనాలనే ప్రజల ప్రయోజనాలుగా నమ్మించగలిగారు. ప్రజలను తమవెంట నడపగలిగారు. అక్కడే తెలంగాణ ఉద్యమానికి సవాల్ ఎదురయింది. కోస్తాంధ్ర, రాయలసీమ ఉద్యమాలను చూపించి తన డిసెంబర్ 9 ప్రకటన నుంచి వెనక్కి తగ్గడానికి, సందిగ్ధ స్థితి నెలకొల్పడానికి, మరొకసారి తెలంగాణ ప్రజలను మోసం చేయడానికి కాంగ్రెస్ బాటలు వేసుకుంది. అలా పూర్తిగా వెనక్కివెళ్లడం విశ్వసనీయతకు దెబ్బగనుక, కాలయాపన ప్రయత్నాలు ప్రారంభించింది. ఆ కాలయాపన ప్రయత్నాలలో భాగమే 'విస్తృత సంప్రదింపులు' అనే మాట. ఆ విస్తృత సంప్రదింపుల ప్రక్రియ దాదాపు నెలన్నర సాగి చివరికి శ్రీకృష్ణ కమిటీ నియామకమయింది. అది కూడ ఏడాదిపాటు పరిస్థితి గురించి సంప్రదింపులు జరుపుతుందంటే అంత సుదీర్ఘకాలం సాచివేతకు రంగం సిద్ధమయిందన్నమాట.

ఈ సవాలును ఎదుర్కోవడానికి వచ్చిన అవకాశాలను కూడ తెలంగాణ ప్రజలు, రాజకీయ నాయకులు సరిగా వినియోగించుకోలేదనే చెప్పాలి. పాలకవర్గాలు కాలయాపన ప్రయత్నాలు చేస్తాయని అనుమానించి వాటిని అడ్డుకోవడానికి తగిన వ్యూహాలను ముందుగానే రచించుకుని ఉండవలసింది. ఈ కాలయాపన ప్రయత్నాలన్నీ కూడ 'అవతలివాళ్లు ఒప్పుకోవడం లేద'నే సాకు మీదనే ఆధారపడ్డాయి. ఆ సాకు చూపడానికి వీలు లేకుండా, కనీసం అవతలివాళ్ల ఆందోళన పెద్ద ఎత్తున జరగడానికి వీలులేకుండా అక్కడి ప్రజలకు తెలంగాణ ఉద్యమం గురించి వాస్తవాలు చెప్పడం, ఈ ఉద్యమం ఎందుకు న్యాయమైనదో వివరించడం, అవతలివైపు సాధారణ ప్రజానీకాన్ని తెలంగాణ డిమాండ్‌కు అనుకూలంగానో, కనీసం తటస్థంగానో మార్చడం తెలంగాణ ఉద్యమకారులు చేసి ఉండవలసిన పనులు. అలాగే కేంద్ర ప్రభుత్వం ప్రకటన వచ్చిన తర్వాత 'ఎప్పుడు, ఎప్పుడు' అని వెంటబడి, 'కేంద్ర ప్రభుత్వం మాటకు కట్టుబడడంలేదో' అని గోలపెట్టి, దేశప్రజల ముందర కేంద్రప్రభుత్వ విశ్వసనీయత ప్రశ్నార్థకమయ్యేట్టు చేయడం తెలంగాణ ఉద్యమకారులు చేసి ఉండవలసిన పనులు. కాని డిసెంబర్ 10 నుంచి డిసెంబర్ 23 దాకా రెండువారాల విలువైన కాలాన్ని, రాజకీయ ఉద్యమ, చర్చా స్థలాన్ని తెలంగాణ ఉద్యమకారులు సంపూర్ణంగా ఖాళీ చేసి, కోస్తాంధ్ర, రాయలసీమ రాజకీయ నాయకులకు, సంపన్నులకు అప్పగించారు. సరిగ్గా అప్పుడే కేంద్ర ప్రభుత్వం, కాంగ్రెస్ పార్టీ కాలయాపన ప్రయత్నాలకు కుట్రలను ముమ్మరం చేశాయి. ఆ ప్రయత్నాలకు ఇప్పటికైతే డిసెంబర్ 2010 దాకా గడువు పెట్టుకున్నాయి. అప్పటివరకు ఉద్యమం చల్లారిపోతుందని, అలా చల్లారిపోతే ఇక తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయనక్కరలేదని, చల్లారకపోతే మళ్లీ కాలయాపనకు మరొక సాకు వెతుక్కోవచ్చునని కాంగ్రెస్ పాలకవర్గాలు ఆలోచిస్తున్నాయి.

ఈ కాలయాపన సవాలును ఎదుర్కోవడం తెలంగాణ ప్రజలకు పెద్దసమస్య కాదు. కాలయాపనను అంగీకరించబోమని, ఏ నిర్ణయమైనా తక్షణమే అమలు చేయవలసిందేనని దృఢమైన సంకేతాలు పంపడమే ఇవాళ తెలంగాణ ఉద్యమం చేయవలసిన పని. పాలకపక్షాలు చేసే ఏ ప్రకటనకయినా తక్షణ ఫలితాన్ని అడగడం, పాలకపక్ష ప్రతినిధులను నిలదీయడం, వారు సరయిన జవాబు చెప్పేదాకా మెసలనీయకపోవడం తెలంగాణ ఉద్యమం చేయగలిగిన, చేసి ఉండవలసిన పనులు. తెలంగాణ ఉద్యమం గత నాలుగు నెలలలో తీసుకున్న పోరాటరూపాలతో పోలిస్తే ఇలా నిలదీయడం, మాటకు కట్టుబడి ఉండాలని కోరడం తక్కువ

స్థాయివే, ఆచరణసాధ్యమైనవే. 'ఇంకా ఆలస్యం వద్దు, కాలయాపన వద్దు, డిసెంబర్ 9 మాటను అమలు చేయండి' అనే నినాదాలతో ఆందోళన సాగించడం, కొత్తగా మళ్లీ కాలయాపన చేసే అవకాశం పాలకులకు ఇవ్వకపోవడం తెలంగాణ ఉద్యమం తక్షణం చేపట్టవలసిన పనులు.

ఇవాళ తెలంగాణ ఉద్యమం ఎదుర్కొంటున్న ముఖ్యమైన సవాళ్లలో మరొకటి అసలు తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌ను పూర్వపక్షం చేసే అబద్ధపు వాదనలు, ప్రచారాలు, అంకెలను, చరిత్రను వక్రీకరిస్తూ, కొన్నిచెప్పి కొన్నిదాస్తూ, నిరాధారమైన అరోపణలు చేస్తూ అనేకమంది కోస్తాంధ్ర, రాయలసీమ రాజకీయనాయకులు, మేధావులు ఈపని చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావం నాటినుంచి వివిధ రంగాలలో జరిగిన అభివృద్ధి గురించి, వివక్ష గురించి, ప్రాంతీయ అసమానతల గురించి, తెలుగు జాతి చరిత్ర గురించి, 1956కు ముందూ తర్వాతా తెలుగుజాతి జరిపిన ఉద్యమాల గురించి పెద్ద ఎత్తున అబద్ధాలు ప్రచారమవుతున్నాయి. తెలుగులో ప్రధాన ప్రచారసాధనాలన్నీ కోస్తాంధ్ర, రాయలసీమ పెట్టుబడిదారుల చేతుల్లోనే ఉండడంవల్ల, ఆంధ్రప్రదేశ్ యథాతథంగా కొనసాగడమే ఆ వర్గాల ప్రయోజనాలకు అవసరం కావడంవల్ల ఆ అబద్ధాలకే అత్యధిక ప్రాచుర్యం లభిస్తోంది. ఆ అబద్ధాలను ఖండించే పని శక్తిమంతంగా జరగడంలేదు. జరుగుతున్న పనికయినా ప్రచారసాధనాలలో అవకాశం దొరకడం లేదు.

ఇలా తెలంగాణ గురించి అబద్ధాలు ప్రచారం చేయడం కోస్తాంధ్ర, రాయలసీమ రాజకీయనాయకులకు, మేధావులకు చాలకాలంగా అలవాటే గాని, ప్రస్తుత స్థితి వల్ల, ఆ రచనలకు, అభిప్రాయాలకు దొరుకుతున్న ప్రాధాన్యత వల్ల వాటివల్ల కొందరయినా మోసపోయే ప్రమాదం ఉంది. మరీ ముఖ్యంగా కోస్తాంధ్ర, రాయలసీమలలో అమాయకంగా తెలంగాణను వ్యతిరేకిస్తున్న వారికి ఈ అబద్ధాలే ఆధారాలవుతున్నాయి. తెలంగాణ ప్రజలలో కూడ సమగ్రంగా వాస్తవాలు తెలియనివారు ఈ అబద్ధాలతో గందరగోళపడుతున్నారు. అందువల్ల ఈ సవాలును ఎదుర్కోవడం తెలంగాణ ఉద్యమానికి తక్షణ అవసరం. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు అవసరం కేవలం భావోద్వేగపూరితమైన అంశం కాదు. అది అసమానత, అన్యాయం, వివక్ష, వనరుల దోపిడీ, హామీల ఉల్లంఘన, ప్రత్యేక అస్తిత్వ నిరాకరణ, అవమానం వంటి అనేక కారణాల మీద మొదలయి, స్వయంపాలన, అధికార వికేంద్రీకరణ, ఆత్మగౌరవం సాధించే క్రమంలో ప్రత్యేకరాష్ట్రంగా ఏర్పడకతప్పదనే అవగాహనకు దారి తీసింది. ఇది కేవలం సెంటిమెంటో, కొన్ని ఎంపికచేసిన అంకెల ప్రకటనో, రాజకీయ నిరుద్యోగుల సృష్టో కాదు. ఇది ఐదున్నర దశాబ్దాల ఘోష. న్యాయబద్ధమైన, ప్రజాస్వామికమైన, ప్రజా ఆకాంక్ష. అందువల్ల దీన్ని బలపరచడానికి ఉద్యమకారులు కేవలం భావోద్వేగాలమీద ఆధారపడితే సరిపోదు. ప్రజలను అంతకంతకూ ఎక్కువగా సమీకరించడానికి, వీరిలో ఉత్తేజం నింపడానికి, నిబద్ధత పెంచడానికి భావోద్వేగభరితమైన ప్రచారం అవసరమే కావచ్చు. కాని ఆ ఉత్తేజం, నిబద్ధత దీర్ఘకాలికంగా, దృఢంగా నిలవాలన్నా, పత్యర్థుల ప్రశ్నలకు జవాబులు చెప్పాలన్నా, ప్రత్యర్థుల అబద్ధాలను ఖండించాలన్నా, శాస్త్రీయమైన, కచ్చితమైన అధ్యయనం, పరిశోధన, వాదనలు అవసరమవుతాయి. ఇవాళ తెలంగాణ ఉద్యమం ఈ పనిమీద ఎక్కువ కేంద్రీకరించవలసి ఉంది. ప్రత్యర్థులు లేవనెత్తుతున్న అబద్ధపు వాదనలను ఎప్పటికప్పుడు ఖండించవలసి ఉంది. తమ వాదనలలో పొరపాట్లు, వక్రీకరణలు లేకుండా జాగ్రత్త పడవలసి ఉంది.

తెలంగాణ ఉద్యమం ఎదుర్కొంటున్న సవాళ్లలో మరొకటి నాయకత్వానికి ఉన్న అసమర్థత, లోపాలు, వైఫల్యం. ఉద్యమం ఎన్ని మార్గాల నడవాలో, ఇది ఎంత విస్తృతమైన ఉద్యమమో, అందరినీ కలుపుకుపోవడానికి ఏ స్థాయిలో ఇచ్చిపుచ్చుకునే సమన్వయ వైఖరి అవలంబించాలో స్పష్టంగా తెలిసిన నాయకత్వం గాని, తెలిసినా అమలులో పెట్టగల నాయకత్వం గాని లేకపోవడం ఒక సమస్య. ఇది ప్రాంతీయ ఆకాంక్షల ఉద్యమం గనుక, పార్లమెంటరీ ప్రజాస్వామిక చట్రంలోపల, రాజ్యాంగబద్ధంగా అమలు కాగల డిమాండ్ మీద సాగుతున్న ఉద్యమం గనుక ఇందులో ప్రజలు ఎంత పెద్ద ఎత్తున పాల్గొన్నప్పటికీ, అంతిమంగా ఉద్యమ నాయకత్వాన్ని పార్లమెంటరీ పక్షాలు, పాలకవర్గాల ముఠాలు ఆక్రమిస్తాయి. ఆ పక్షాలకు తమకు అధికారం రావాలనే కోరికే తప్ప, నిజంగా ప్రజల ఆకాంక్షలు నెరవేరాలనే కోరిక ఉండకపోవచ్చు. కాని ఉద్యమ సాఫల్యంలో ప్రజల ఆకాంక్షలు కూడ ఇమిడి ఉన్నాయి గనుక ప్రజలు నిరంతర జాగరూకత ప్రదర్శించవలసి ఉంటుంది. నాయకత్వం తన స్వార్థ ప్రయోజనాలకు ఉద్యమాన్ని బలి చేయకుండా కాపాడగలిగేది ప్రజల జాగరూకత మాత్రమే. అందువల్ల ఈ సవాలును అధిగమించడానికి ప్రజలు ఎప్పటికప్పుడు ఉద్యమ నాయకత్వాన్ని తమ చేతులలోకి తీసుకోవడానికి ప్రయత్నించడం, నిర్ణయాధికారాన్ని వీలయినంతగా వికేంద్రీకరించమని ఒత్తిడి తేవడం, ఏకవ్యక్తి నాయకత్వం స్థానంలో సామూహిక నాయకత్వాన్ని, ఏక వర్గ/బృంద నాయకత్వం స్థానంలో బహువర్గ/బృంద నాయకత్వాన్ని కోరడం, ప్రతి చర్చలోనూ, నిర్ణయంలోనూ, అమలులోనూ నాయకత్వం సమన్వయపూరితంగా ఉండాలని కోరడం చేస్తూ ఉండాలి.

ఉద్యమంలో చీలికలు తేవడానికి పాలకవర్గాలు, ప్రత్యర్థులు, అంతర్గత శక్తులు సాగిస్తున్న ప్రయత్నాలు ఇవాళ్టి మరొక సవాలు. ఉద్యమ స్వభావం వల్లనే ఇందులో అన్ని వర్గాల, అన్ని సమూహాల ప్రజలు పాల్గొంటారు. అందువల్ల భిన్న వర్గాలకు, సమూహాలకు, ప్రయోజనాలకు చెందిన నాయకులను, ప్రజలను చీల్చడం ప్రత్యర్థులకు సులభమవుతోంది. అంతర్గతంగా కూడ చీలికలకు అవకాశం ఉంటుంది. ఎప్పుడైనా ఇటువంటి విశాలమైన ప్రాంతీయ ఉద్యమంలోకి ప్రాంతవాసులైన వారందరూ – వారి వారి రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, వర్గ, మత, కుల, స్త్రీ పురుష, వయో భేదాలతో నిమిత్తం లేకుండా, ఆ భేదాలను పక్కనపెట్టి – వస్తారు. ఇన్ని రకాల వాళ్లు ఉండడం ఇటువంటి ఉద్యమపు బలమూ బలహీనతా కూడ. ఇన్ని రకాలవాళ్లు ఉండడం ఉద్యమానికి గొప్ప శక్తినీ, వైవిధ్యాన్నీ, ప్రజాస్వామికతనూ ఇస్తుంది. అదేసమయంలో ఇన్ని రకాల వాళ్లు ఉండడం వల్ల ఏ క్షణమైనా ఈ ఐక్యత భగ్నమయ్యే అవకాశమూ ఉంటుంది. ఏదయినా ఒక వర్గ, బృంద ప్రయోజనాలు నెరవేర్చి, నెరవేరుస్తామని ఆశపెట్టి ఉద్యమాన్ని చీల్చడానికి ప్రత్యర్థులు, పాలకులు ప్రయత్నించడానికి అవకాశం దొరుకుతుంది. తమ ప్రయోజనాలు నెరవేరాకగాని, నెరవేరాయని నమ్మిగాని ఏదయినా ఒక బృందం ఉద్యమం నుంచి చీలిపోయే అవకాశం ఉంటుంది.

ప్రపంచ చరిత్రలో విశాల ఉద్యమాలన్నీ ఈ చీలికల సవాలును ఎదుర్కొన్నాయి. ఐక్యంగా ఉండడం, ఐక్యత కొరకు ఇతోధిక ప్రయత్నాలు చేయడం, ఐక్యత కొరకు పట్టువిడుపులకు సిద్ధపడడం ద్వారా మాత్రమే

ఈ సవాలును అధిగమించడం జరిగింది. ఇవాళ తెలంగాణ ఉద్యమం కూడ అటువంటి ఐక్యతా ప్రయత్నాలను ముమ్మరం చేసి, చీలిక సవాలును అధిగమించవలసి ఉంది. ఇంకా ఎక్కువ శక్తులను ఆకర్షించడం, సమీకరించడం, మిగిలిన విషయాలలో ఘర్షణ, భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ, తెలంగాణ రాష్ట్ర సాధన అనే ఏకైకలక్ష్యం పునాదిగా బలమైన ఐక్యత సాధించడం ఇవాళ తెలంగాణ ఉద్యమ శక్తుల కర్తవ్యం.

ఈ క్రమంలోనే ఉద్యమ శ్రేణులను, నాయకులను చీల్చడానికి మాత్రమే కాక, కొనివేయడానికి, మాట్లాడకుండా చేయడానికి కూడ ప్రత్యర్థులు ప్రయత్నిస్తున్నారు. పదవుల ఆశ చూపి, డబ్బులు ఎరవేసి, పార్టీల కట్టుబాట్లు చూపి నాయకులను, శ్రేణులను తెలంగాణ ఉద్యమం నుంచి దూరం చేయడానికి ప్రధాన రాజకీయ పక్షాలు ప్రయత్నిస్తున్నాయి. విశాలమైన ప్రజా ఉద్యమం జరుగుతున్న సమయంలో ఇలా ఏదో ఒక సాకుతో దూరం కావడం ఉద్యమానికీ, ప్రజలకూ ద్రోహం చేయడమేననే స్పష్టతతో ద్రోహులను ఎండగట్టడం, వారిని మిగిలిన తెలంగాణ సమాజం నుంచి వేరుచేసి చూపడం, వారు అంతిమంగా ఉద్యమంలోకి రావడానికి, కనీసం తటస్థంగా ఉండడానికి సహకరించడం ఇవాళ ఉద్యమకారుల బాధ్యత.

తెలంగాణ ఉద్యమం ప్రస్తుతం ఎదుర్కొంటున్న సవాళ్లన్నిటిలోకీ ముఖ్యమైనదీ, కష్టతరమైనదీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సాగించబోతున్న అణచివేత, దమననీతి. పోలీసు కాల్పులలో 370 మందిని బలి తీసుకుని, నెలల తరబడి 144 సెక్షన్, కర్ఫ్యూలు, నిషేధాజ్ఞలు విధించి 1969 ఉద్యమాన్ని అణచివేసినట్టుగానే ప్రస్తుత ఉద్యమాన్ని కూడ అణచివేయవచ్చునని పాలకులు ఆలోచిస్తున్నారు. ఈ దమనకాండ ఆలోచనలకు ఎన్నో సూచనలున్నాయి. తెలంగాణ ఉద్యమం ఉధృతంగా సాగుతుండగానే డిసెంబర్ 27న ఇ ఎస్ ఎల్ నరసింహన్ కు ఆంధ్రప్రదేశ్ గవర్నర్‌గా అదనపు బాధ్యతలు ఇచ్చారు. జనవరి 22న ఆయననే పూర్తికాలపు గవర్నర్ గా మార్చారు. మాజీ పోలీసు అధికారిగా, చత్తీస్‌గఢ్ గవర్నర్‌గా ప్రజా ఉద్యమాల అణచివేతలో శిక్షణ, అనుభవం ఉన్న వ్యక్తిని గవర్నర్‌గా నియమించడం తెలంగాణ ప్రజాఉద్యమంపై దమననీతిని అమలు చేయడానికే. గవర్నర్‌గా ఎవరిని నియమించాలనే విషయంలో మార్గదర్శక సూత్రాలేవీ లేకపోయినప్పటికీ, సాధారణంగా రాజకీయవాదులనే, క్రియాశీల రాజకీయ జీవితం ముగిసి, విశ్రాంత జీవితం గడుపుతున్న వాళ్లనే నియమించడం ఆనవాయితీ. రాష్ట్రవిభజన ఉద్యమం ఉధృతంగా సాగుతూ, కేంద్ర ప్రభుత్వం ఆ ప్రక్రియ ప్రారంభమయిందని ప్రకటన కూడ చేసిన తర్వాత తలెత్తే సమస్యలకు తప్పనిసరిగా రాజకీయ పరిష్కారాలే ఉంటాయి గనుక గవర్నర్ పదవిలో రాజకీయ వ్యక్తినే నియమించాలి. కాని అటువంటి స్థితిలో పోలీసు అధికారిని నియమించడమంటే తప్పనిసరిగా ఉద్యమ అణచివేతకు సంకేతాలు పంపినట్టే.

ఆ పోలీసు అధికారి – గవర్నర్ పదవి చేపట్టిన నాటినుంచీ, రాష్ట్రంలో రాజకీయ నాయకత్వాన్ని కూడ పక్కనపెట్టి విధాన నిర్ణయాలు, సంప్రదింపులు జరుపుతూ ఒకరకంగా రాష్ట్రపతి పాలన ఉన్నట్టుగా ప్రవర్తిస్తున్నారు. ఆయన గవర్నర్‌గా వచ్చిననాటినుంచీ తెలంగాణ ఉద్యమంలో మావోయిస్టుల పాత్ర గురించి అధికారవర్గాలు, కాంగ్రెస్ రాజకీయ నాయకులు కూడ మాట్లాడడం ఎక్కువయింది. మావోయిస్టుల బూచి చూపి ఉద్యమం మీద అణచివేత సాగించడానికి సన్నాహాలు మొదలయినట్టు కనబడుతోంది. ఇప్పటికే రాపిడ్ ఆక్షన్ ఫోర్స్, సెంట్రల్ రిజర్వ్ పోలీస్ ఫోర్స్ వంటి కేంద్ర బలగాలను, మహారాష్ట్ర, కర్ణాటక వంటి పొరుగు రాష్ట్రాల నుంచి పోలీసు బలగాలను, గ్రేహౌండ్స్ వంటి రాష్ట్రస్థాయిలో కరడుగట్టిన అణచివేత బలగాలను దించడం జరిగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఇటువంటి ప్రత్యేక బలగాలను మోహరించడాన్ని రాష్ట్ర హైకోర్టు తప్పుపడితే ఆ తీర్పు మీద రాష్ట్ర ప్రభుత్వం సుప్రీంకోర్టుకు కూడ వెళ్లి అణచివేత బలగాలను దింపుతానని నిస్సిగ్గుగా ప్రకటించుకున్నది. విద్యార్థుల మీద, ఆందోళనకారుల మీద కేసులు ఉపసంహరిస్తామని కేంద్రహోం మంత్రి ప్రకటించి మూడునెలలు గడిచినా ఒక్క కేసు కూడ ఉపసంహరించలేదు సరిగదా మరికొన్ని వేల కొత్త కేసులు బనాయించారు. కొంతమంది పోలీసు అధికారులు విద్యార్థుల మీద కక్ష సాధింపు ధోరణి అవలంబిస్తున్నారని, వారిమీద చర్యలు తీసుకోవాలని రాష్ట్ర మానవహక్కుల సంఘం నిర్దేశించినా రాష్ట్రప్రభుత్వం ఖాతరు చేయలేదు. తెలంగాణ ఉద్యమాన్ని సమర్థిస్తున్న మావోయిస్టు పార్టీ అగ్రనాయకులను ఎక్కడో పట్టుకుని, ఎన్‌కౌంటర్ పేరిట కాల్చిచంపి తెలంగాణ ఉద్యమ కారులకు హెచ్చరిక చేయాలని ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం ఈ దమననీతికంతా పరాకాష్ఠ.

ఈ అణచివేత సవాలును కూడ తెలంగాణ ఉద్యమం తీసుకోవలసినంత తీవ్రంగా తీసుకుంటున్నట్టులేదు. అణచివేత ప్రతిఘటనకు దారితీస్తుందనే సాధారణ సూత్రం సరైనదే గాని, ఆ ప్రతిఘటనకు మార్గదర్శకత్వం వహించే, సమన్వయం చేసే ఆలోచనలు, శక్తులు లేకపోతే ప్రతిఘటన దానంతట అది సరయిన దారిలో నడవదు. ఆ ప్రతిఘటనను సమరశీల పోరాట రూపాలలోకి, విస్తృతిలోకి తీసుకుపోకపోతే అణచివేత తాత్కాలిక విజయాన్ని కూడ సాధించవచ్చు. ఎప్పటికైనా న్యాయం గెలుస్తుందనే మాట నిజమే గాని, న్యాయ పోరాటాన్ని కూడ పశుబలం తాత్కాలికంగా ఓడించగలుగుతుంది. ఆ పశుబలాన్ని, ప్రత్యర్థులు పన్నుతున్న దమనకాండను సరిగా అర్థం చేసుకుని, ప్రతిఘటించే చైతన్యాన్ని ఉద్యమంలో భాగం చేసినప్పుడే ఉద్యమానికి విజయం చేకూరుతుంది.

ఈ తక్షణ సవాళ్లకు తోడు దీర్ఘకాలికంగా పరిష్కరించవలసిన మరొక సవాల్ కూడా ఉంది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర సాధనతో అన్ని సమస్యలు సమసిపోతాయని, అది ఒక మంత్రదండం లాగ తమను స్వర్గంలోకి తీసుకుపోతుందని చాలామంది ప్రజలు అమాయకంగా నమ్ముతున్నారు. ఇవాళ ఉన్న అన్ని సమస్యలకు ఆంధ్రప్రదేశ్ సమైక్య రాష్ట్రమే కారణమని, అది తొలగిపోగానే చదువులు, ఉద్యోగాలు, నీళ్లు, కరెంట్, హక్కులు, అవకాశాలు, సమానత్వం వాటంతట అవే వస్తాయని ఆశిస్తున్నారు. అటువంటి స్వర్గతుల్యమైన మార్పులు జరగబోవని, జరగడానికి అవకాశం లేదని తెలిసిన నాయకత్వం కూడా ఆ విషయాలు చెప్పడం లేదు. ఎక్కువలో ఎక్కువ సమైక్య రాష్ట్రంలో జరుగుతున్న వనరుల దోపిడీకి, విద్యా, ఉద్యోగ అవకాశాలలో వివక్షకు స్థానం తొలగిపోతుంది. ఆ తర్వాత మిగిలిన సమస్యల పరిష్కారం కొరకు ఇప్పటికన్నా తీవ్రతరమైన పోరాటమే చేయవలసి ఉంటుంది. ఈ అవగాహనను ఇప్పటి నుంచే కల్పించకపోతే ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన ఏడాదిలోపు పెద్ద ఎత్తున నిరాశా నిస్పృహలు అలుముకుంటాయి. అది సాంస్కృతిక జీవనానికే ప్రమాదం తెస్తుంది. ఈ దీర్ఘకాలిక దృష్టితో ఈ సవాల్‌ను కూడా ఎదుర్కోవడం ఇవాళ్టి అవసరం. వీ

*ఈనాటికీ మంచినీళ్లకు కూడా నోచుకోకుండా, నిత్యం కరువుతో అల్లాడుతున్న రాయలసీమ వెనుకబాటుకు పాలకుల వైఫల్యాలే కారణమని అంటున్నారు* **అంగడి రంగారెడ్డి**

# ప్రాంతీయ అసమానతలు : ప్రత్యేక రాయలసీమ

ప్రపంచంలో చిన్న దేశాలలో శాస్త్రీయంగా, సాంకేతికంగా వచ్చిన గణనీయ మార్పులు, జనాభా అధికంగా ఉండి పెద్ద రాష్ట్రాలుగా ఉండే వాటిలో రాలేదు. ఇ.ఎం. ఘుమేకర్ తన గ్రంథం 'చిన్నదే అందం'లో చిన్న వాటివల్ల ఉండే ప్రయోజనాలను విపులంగా వివరించారు. నీతి, సుపరిపాలన, కొత్త ఆలోచనలు, సమానత, సామాజిక న్యాయం చిన్న దేశాలలోనే అధికంగా కనపడింది. ఉదాహరణకు బంగ్లాదేశ్‌లో మహమ్మద్ యూనెస్ ప్రవేశపెట్టిన స్వయం సహాయక సంఘాలు, పాకిస్తాన్‌లో మగ్‌బుల్ హక్ సృష్టించిన మానవాభివృద్ధి సూచిక.

14వ శతాబ్దంలో శ్రీకృష్ణదేవరాయల పాలనలో రాయలసీమ పురోభివృద్ధి, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలలో గణనీయమైన మార్పులు వచ్చాయి. 'అచటనొకప్పుడు పండే ముత్యాలు చాలు, అటనొకప్పుడు నిండె కావ్యాలు జాలు, అచటనొకప్పుడు కురిసే భాష్యాల జల్లు' అంటూ విద్వాన్ విశ్వం తన పెన్నేటి పాటలో రాసుకుంటాడు. శ్రీకృష్ణదేవరాయలు తర్వాత నైజాం ఈ ప్రాంతం రావడం, సరైన పాలన లేకపోవడంతో నోబెల్ గ్రహీత గున్నార్ మిర్థాల్ చెప్పినట్లుగా 'అరాచక పాలనలు' ఏర్పడ్డాయి. నవాబులు బ్రిటిష్ వారికి ఈ ప్రాంతాన్ని దత్తత ఇచ్చారు.

థామస్ మన్రో (1761-1827) కలెక్టర్‌గా రావడంతో దోపిడీ పాలెగారు వ్యవస్థను అణచివేసి, రైతువారి విధానాన్ని అమలు పరిచారు. మెకన్‌జీ (1758-1821) కృష్ణా - పెన్నా నదుల సంవిధానాన్ని పరిచయం చేయడం, ఆర్థర్ కాటన్ (1803-1899) కర్నూలు-కడప కాలువను నిర్మించడం, చార్లెస్ ఫిలిప్స్ బ్రౌన్ (1792-1884) తెలుగును పునరుద్ధరణ చేయడంతో, ఒక కొత్త మలుపు రాయలసీమ జిల్లాలలో ఏర్పడిందని చెప్పవచ్చు. రాయలసీమ జిల్లాలలో ఒక కొత్త ఆలోచన ఒరవడికి, భాషకు, నాగరికతకు తెరతీయడమయింది. వీరి వల్లనే ప్రపంచీకరణ ప్రభావం అప్పుడే రాయలసీమ గడ్డ మీద పడిందని చెప్పవచ్చు.

మద్రాస్ నుండి బొంబాయి, మద్రాస్ నుండి కలకత్తా ట్రంక్ రైలు మార్గాలు ఏర్పడడంతో ఆహార వస్తువుల మార్పిడికి, ఇతర ప్రాంతాల అభివృద్ధిని బాహ్యంగా చూడడానికి అవకాశం కలిగింది. వీరి వల్లనే పట్టణాలు, నగరాలు ఏర్పడ్డాయి. తంతి, తపాల, రహదారులు, వార్తా పత్రికలు, పోలీస్, న్యాయ వ్యావస్థ, ఆంగ్ల విద్య, ఉపాధులు రాయలసీమ జిల్లాలకు ఇవ్వడంతో సాంప్రదాయ అలవాట్లకు, ఆధునిక అలవాట్లకు మధ్య ఘర్షణ ఏర్పడి, తరాల మధ్య తేడాలు వచ్చి భావి విప్లవాలు, కొత్త అలవాట్లు, లాభసాటిగా ఉండడంతో, వీటి పక్క మొగ్గుచూపింది. అయినా కొన్ని గ్రామీణ అలవాట్లు నాటుకొని పోయినవి. తొందరగా తొలగించుకోలేక పోయింది. ఆంగ్ల విద్యే ప్రపంచాన్ని గూర్చి ఆలోచించే శక్తిని కల్పించింది.

రాయలసీమకు భూ - భౌతిక, వ్యవసాయ పరిస్థితులు ఇతర కోస్తా ఆంధ్ర, తెలంగాణ జిల్లాలను పోల్చుకుంటే విభిన్నంగా ఉన్నది. 2001 జనాభా లెక్కల ప్రకారం రాష్ట్రంలో 7.6 కోట్ల జనాభాలో, రాయలసీమ 1.7 కోట్లు. భూ విస్తీర్ణం 2.75 లక్షల చదరపు కిలోమీటర్‌లలో 24.5 శాతం భూభాగం కలిగి ఉంది. రాయలసీమలో 74 శాతం గ్రామీణ ప్రాంతంలో జీవిస్తున్నారు. 14 శాతం వ్యవసాయ దారులు, 18 శాతం వ్యవసాయకూలీలు, 54 శాతం శ్రమలేనివారు ఉన్నారు. 2001నాటికి అక్షరాస్యత 53 శాతం ఉంది.

గత చరిత్ర రాయలసీమది ఘనమైనది కాదు. ప్రతి ఐదు సంవత్సరాలకు ఒక కరువు, కాటకం తరచు రావడం వల్ల జీవన భారం అనేక ఛిద్రాలకు గురయింది. విజయనగర రాజుల స్వర్ణ పాలన తర్వాత అనేక కష్టాలకు గురి కావడం, తురుష్కులు, ఆంగ్లేయుల పాలనలు, పాలేగార్లు పాలనతో చిన్నాభిన్నం కావడం వలన దట్టమైన పేదరికం, నిరుద్యోగం, వ్యవసాయం ఓ జూదం అయింది. పెట్టుబడులు పెరగక పోవడం, ప్రభుత్వ ఆదరణ అల్పంగా ఉండడం, రాజకీయ జులుం, ముఠా కక్షలు గోరుచుట్టుపై రోకటిపోటులా ఉండడంతో అభివృద్ధికి నోచుకోలేక పోయింది.

ఆంగ్లేయుల తర్వాత వ్యవసాయ భూములను బ్రాహ్మణులు, తర్వాత రెడ్లు, వీరి తర్వాత ప్రస్తుతం వెనుకబడిన తరగతులు - యాదవులు, ఉప్పర, గంగపుత్రులు, సాలెవారు, ఈడిగ వారు భూమిపై యాజమాన్యపు హక్కులు వస్తున్నవి. రాయలసీమ జిల్లాలలో భూమిపై యాజమాన్య హక్కులు దున్నేవారికి అందలేదు. భూసంస్కరణలు అమలు కాలేదు. అధిక ఉష్ణోగ్రత ఉండే ప్రాంతాలలో అభివృద్ధి చేయడం చాలా ఖరీదుగా ఉంటుంది. గరిష్ట ఉష్ణోగ్రత 40 డిగ్రీల సెంటిగ్రేడ్ పైబడి, అల్ప ఉష్ణోగ్రత 20 డిగ్రీల సెంటిగ్రేడ్‌లలో ఉంటుంది. వర్షపాతం 750 మిల్లీమీటర్లలోపు ఉంటుంది. దీనిని బట్టి భూమిలో నీటి తేమను నిలబెట్టడం కష్టం.

ఈ పరిస్థితులలో వ్యవసాయం కత్తిమీద సాములా ఉంటుంది. కరువు కాటకాలు అనంతపురంకు పిలవని అతిథిగా వస్తూ ఉంటాయి. భూమి వినియోగంలో అడవుల విస్తరణ అనంతపురంలో భూ వైశాల్యంలో 18 శాతం, కర్నూలు జిల్లాలో 20 శాతం, కడపలో 30 శాతం, చిత్తూరు 33 శాతం ఉంది. సగటుగా 40 శాతం భూమి వ్యవసాయానికి ఉపయోగంలో ఉంది. మిగతా 40 శాతం బంజరు వ్యవసాయేతర భూమిగా గుర్తించబడింది. ఆహార పంటల నుండి వాణిజ్య పంటల పక్క వ్యవసాయం నడుస్తోంది. మెట్ట భూమిని నమ్ముకున్న వారు తమ పిల్లలు వ్యవసాయం చేయడానికి ఇష్టపడడం లేదు.

ఎక్కడైతే సాగునీరు నిరంతరంగా లభ్యమైందో అక్కడ వ్యవసాయం, పరిశ్రమలు, సేవల రంగం, ఎగుమతులు-దిగుమతులు, పెట్టుబడులు, నాగరికత, పట్టణీకరణ ఏపుగా జరిగింది. దానికి నిదర్శనం కోస్తా ఆంధ్ర ముఖచిత్రమే. అన్నిరకాల నీటి వనరులను కలిపితే యోగ్యమైన భూమి రాయలసీమ జిల్లాలలో 22 శాతం, తెలంగాణలో 40 శాతం, కోస్తా ఆంధ్రలో 60 శాతం ఉంది.

కోస్తా ఆంధ్ర, తెలంగాణ జిల్లాలలో వర్షపాతం వెయ్యి మిల్లిమీటర్ల పైబడి ఉండడం, రెండు మహానదులు కృష్ణా, గోదావరులు ఉండడం, తరచు తుపానులు రావడం వల్ల భూగర్భ జలాలు అధికంగా ఉండడంతో వ్యవసాయం నుండి విభిన్న పోకడలు రావడమయినది. వరి, చెరుకు, పత్తి, మిరప, తోటపైర్లు, వాటి ఆధారిత పరిశ్రమలు పెరగడంతో ఆదాయాలు, ఉద్యోగిత, పెట్టుబడులు విపరీతంగా పెరగడంతో ఇతర ప్రాంతాలలో అధిక లాభాలు వచ్చే రంగాలపై పెట్టుబడులు చేయడమవుతున్నది.

కోస్తావారిలో పెట్టుబడుల కాంక్ష, పట్టుదల, కార్యదీక్షత అధికంగా ఉండడం, వారిలోని గమనశీలతతో, వెనుకబడిన ప్రాంతాలలో వచ్చే అభివృద్ధి ఫలాలను పొందడానికి పరుగులిడుతూ ఉంటారు. రియల్ ఎస్టేట్ వ్యాపారం, సాగునీరు కింద వచ్చి వ్యవసాయం చేయడం, కాంట్రాక్టులు, ప్రభుత్వ ఉద్యోగాలు మొదలయినవి. ఉన్నత పదవులలో ఉండే వారిలో అవినీతి ఉంటే అది సంపద ఉండేవారికి, ప్రత్యేకంగా కోస్తావారికి పండుగే. రాయలసీమలో సాగునీరు ఉండే ప్రాంతాలలో వీరి శాంతి వనాలు పరిపుష్టి చెందుతూ ఉన్నాయి. కోస్తాలో ట్రాక్టర్లు, యంత్రాలతో పంటను నాటడం, కోత కోయడంలో పోతూ ఉంటే, రాయలసీమలో సగటు రైతు ఎద్దుల బండి సంస్కృతిని వదలలేక పోయాడు. ఎద్దులను వానకాలంలో కొని, ఎండాకాలంలో సంతలో అమ్మడం కనబడుతుంది. పశువుల సంతలు ఎండకాలం కిక్కిరిసి నడుస్తూంటే, కోస్తా జిల్లాలలో అవి కనుమరుగైనవి.

ఊటనీరు, చెక్‌డ్యాంలు, నీటి నిల్వపంటలు, సన్న - చిన్నకారు డ్యాంలు, చెరువులు, బోరుబావులు, వర్షాకాలంలో పనిచేస్తాయి. ఎండకాలంలో ఇవి మొరాయిస్తాయి. గాలేరు-నగరి, హంద్రీ-నీవ ప్రాజెక్టులు పూర్తికావడం పట్ల గ్రామాలు ఎదురుచూస్తున్నాయి. నీటి పంపిణీలో అసమానతలు అధికంగా ఉన్నాయి. పెద్ద రైతులు అధికంగా సాగునీరును, భూగర్భ జలాలను వాడుకుంటున్నారు. సన్న, చిన్నకారు రైతులు అధికంగా నీరులేక వ్యవసాయంలో నష్టపోవడం, కొందరు ఆత్మహత్యలకు గురికావడం జరుగుతోంది.

వనరుల వ్యవస్థాపక ప్రణాళిక, అభివృద్ధి అనేది ఇంకా రాయలసీమ జిల్లాలలో వేళ్లు నాటుకోలేదు. ముఠానాయకుల పాలన, అంటే ప్రభుత్వానికి మరో సమాంతర పాలనలా ఉండడం వలన వ్యవస్థాపకుడు అనేక సున్నితమైన, విస్ఫోటన విషయాలను అర్థం చేసుకున్న వారైతేనే ఈ గడ్డమీద పరిశ్రమలు నడుపుతారు. లాభాలు కొంత కాలం లేకపోయినా నడపగల వారే ఇక్కడ పరిశ్రమలను వృద్ధి చేయగలరు. ముఠా నాయకులతో చేయికలిపితే ఎంత ప్రకృతిని దోపిడీ చేసినా అడిగేవారు ఉండరు.

పత్తి మీద ఆధారపడిన జౌళి మిల్లులు, అడవుల మీద ఆధారపడ్డ పేపర్ మిల్లులు, కరువు రావడంతో పాడి పరిశ్రమ, పాలశుద్ధి కర్మాగారాల పరిశ్రమ, ముడిపదార్థాల లభ్యత లోపం వల్ల కావచ్చు లేదా యాజమాన్యాల అసమర్థత వల్ల కావచ్చు మూతపడినవి. కాని ప్రకృతి సిద్ధంగా లభ్యమయిన ముడిపదార్థాలు - ముగ్గురాయి, సున్నపురాయి, గ్రనైట్, పలక రాళ్లు కడప జిల్లాలో ఉన్నాయి. చిత్తూరు జిల్లా చికరగుంట, నందిమడుగు, మల్లప్పకొండ ప్రాంతంలో 30 కిలోమీటర్‌ల పొడవు బంగారు నిక్షేపాలు ఉన్నాయి.

అనంతపురం జిల్లాలో వజ్రకరూరు వజ్రాలకు ప్రసిద్ధి. వర్షం పడితే వజ్రాలు కనబడతాయి. అనంతపురం, కర్నూలు, కడప జిల్లాలలో ఇనుప ఖనిజం లభ్యమవుతుంది. ప్రపంచ మార్కెట్‌లో అధిక డిమాండ్ ఉండే ఎర్రచందనం చిత్తూరు, కడప జిల్లాలో అధికంగా లభిస్తుంది. ప్రభుత్వ యంత్రాంగం, పరిశ్రమల పర్యవేక్షణకు ఉండినా, వారు కేవలం నిమిత్తమాత్రులే, నిలుపు దోపిడీకి వారు సాక్షులు కారు.

ఈ మధ్య ఇంజనీరింగ్ కళాశాలలు రావడంతో, కంప్యూటరీకరణ చౌకగా లభ్యమవడంతో, విద్యార్థులు విదేశాలకు పోయి కొంత విదేశ మారకం రావడంతో ఆర్థిక, సామాజిక హోదాలలో కొంత మార్పులు రావడమయింది. మిగతా రెండు ప్రాంతాలను పోల్చుకుంటే పారిశ్రామిక విప్లవమంటూ రాయలసీమ జిల్లాలో రాలేదు. విదేశీ పెట్టుబడులు రాయలసీమ జిల్లాలలో రాకపోవడానికి గల కారణాలు, ప్రోత్సాహపరిచే శక్తులను గురించి, ప్రజల, ప్రభుత్వ భాగస్వామ్యాన్ని గురించి ఇంకా పరిశోధనా పత్రాలు రావాలి.

మానవ వనరుల అభివృద్ధి వేగంగా జరగాలంటే రహదారులు, రవాణ, నీరు, విద్యుచ్ఛక్తి, విద్య, వైద్య సౌకర్యాలు వేగంగా పెరగాలి. వీటన్నిటిలో రాయలసీమ జిల్లాలు అట్టడుగున ఉన్నాయి. కడప, కర్నూలు జిల్లాలలో నల్లమల కొండ కింది గ్రామాలు, పదిహేను కిలోమీటర్ డోలి మీద రోగులను దగ్గర ఉండే గ్రామాలకు తీసుకువస్తారు. విద్యుచ్ఛక్తి లేని కుటుంబాలు, ఇండ్లు లేని కుటుంబాలు ఉన్నాయి. 40,000 చెంచులు ఆకలితో చస్తూ ఉన్నారంటే పేదరికం ఎంత ఉందో అర్థం చేసుకోవచ్చు. వేసవి వచ్చిందంటే అధిక గ్రామాలు తాగడానికి మంచినీరు లేక కటకటలాడతాయి. ఇప్పటికి అధిక గ్రామాలకు రహదారుల సౌకర్యాలు లేకపోవడం శోచనీయం. తుపాన్‌కు ఇచ్చిన ప్రాముఖ్యత కరువుకు ప్రభుత్వాలు ఇవ్వడం లేదు. మెగసస్సే అవార్డ్ గ్రహీత పి. సాయినాథ్ అభిప్రాయంలో 'మంచి కరువు కోసం ఉద్యోగులు ఎదురు చూస్తారుట'. కరువు అనేది ఒక ప్రాంతానికి వస్తుందంటే, అది 'నెమ్మదిగా ఆ ప్రాంతానికి విషమివ్వడం' అవుతుంది.

అక్షరాస్యత నుండి విద్యావంతుల వరకు రాయలసీమ జిల్లాలు నిమ్నస్థాయిలోనే ఉన్నాయి. నాణ్యమైన విద్య, ఉపాధి ఉందంటే, మూఢాక్షలు, అరాచకాలు, రావణకాష్టాలు, ప్రత్యక్ష దోపిడీలు తగ్గుముఖం పడతాయి. ప్రభుత్వాలు ఎలా ఉన్నాయంటే - ఆహారం, విద్యుచ్ఛక్తి, సాగునీరు, గృహాలు, పరపతులు - ధనిక ప్రాంతానికి, వెనుకబడిన ప్రాంతానికి ఒకటే అంటాయి. ధనికులు వేగంగా ధనికులు కావడానికి సహకరిస్తూ ఉన్నదే కాని, పేద ప్రాంతానికి పెట్టుబడులకు పెద్ద పీట వేయడం లేదు. 62 సంవత్సరాలు అయినా సాగునీరు శాతం రాయలసీమ జిల్లాలకు పెరగలేదు. ప్రాణహిత-చేవెళ్ల, పోలవరం-పులిచింతల నుండి కృష్ణానదికి, గోదావరి జలాలను ఇచ్చే వేగాన్ని, రాయలసీమలో హంద్రీ-నీవ, గాలేరు-నగరికి దశాబ్దాలనుండి అదిగో, ఇదిగో అని చూపించారు.

ప్రభుత్వ వ్యయాలు రాజకీయ నాయకులు ఉండే ప్రాంతాలలో వారి కనుసన్నలలో ఉండే వారికి సబ్సిడీలు అధికంగా పోయాయి. రాజకీయ నాయకులు, పారిశ్రామికవేత్తలలో ఖనిజ పరిశ్రమలను, ఇంజనీరింగ్ కళాశాలలను, మెడికల్ కళాశాలలను నడపడమైనదే కాని, ఒక గిరిజనుడు, ఒక దళితుడు వీటిని ప్రారంభించిన దాఖలాలు రాయలసీమలో లేవు.

సామాజిక ఉద్యమాలకు ఆంధ్రప్రదేశ్ ఒక ప్రయోగశాలని చెప్పవచ్చు. ఎందుకంటే కమ్యూనిస్టులలో అతివాదుల ఉద్యమాలు, దళితులలో రిజర్వేషన్లలో మళ్లీ వర్గీకరణ, రాడికల్ లెఫ్ట్ పార్టీల పోరాటాలు, పౌరహక్కుల ఉద్యమాలు, మహిళల స్వయం సహాయక ఉద్యమాలు, తెలంగాణలో వచ్చినవి. రాయలసీమలో వాటి వాసనలే గాని ఆచరణలో అల్పం. 94 శాతం ఉద్యోగాలు అసంఘటిత రంగంలో ఆంధ్రప్రదేశ్‌లో ఉంటే అదే రీతిలో రాయలసీమలో ఉంది. విద్యాలయాలు ఉన్న నాణ్యతను పెంచకపోవడంతో రాజకీయ బడుగులుగా, ఎండాకాలం చదువుల్లా ఉన్నాయి.

ఒక ప్రాంత అభివృద్ధి, ఆ ప్రాంతంలో లభ్యమయ్యే ప్రకృతి వనరుల మీద ఆధారపడుతుంది. ఆ వనరుల వల్లనే నిలకడాభివృద్ధి ఏర్పడుతుంది. అల్ప వనరుల వలన అక్కడి ప్రజల ఆదాయాలు, ఉపాధులలో అభద్రతా భావం ఏర్పడుతుంది. తలసరి భూమి అనంతపురంలో 0.35 హెక్టారు, కర్నూల్‌లో 0.34 హెక్టారు ఉంది. కడప జిల్లాలో 13 శాతం భూమి నిరుపయోగంగా ఉంది. ఇది ఆంధ్రప్రదేశ్‌లో మొదటి జిల్లా. దానికి కారణం గనుల తవ్వకమని చెప్పవచ్చు. తర్వాత చిత్తూరు జిల్లా 10.35 శాతంతో ఉంది. అడవులు క్షీణిస్తూ ఉంటే అనంతపురం, కడప జిల్లాలలో గొర్రెలు, మేకలు, బర్రెలు సగటు స్థాయి కన్నా అధికంగా పెరగడం శ్రేయస్కరం కాదు. ఇది పర్యావరణానికి ముప్పు.

ఫ్లోరైడ్ అధికంగా ఉండే జిల్లా కూడా అనంతపురమే. అధిక కుటుంబాలకు మరుగుదొడ్ల సౌకర్యం లేని ప్రాంతాలు ఆంధ్రప్రదేశ్‌లో అత్యధికంగా రాయలసీమలోనే ఉన్నాయి. దీంతో అంటువ్యాధులు కూడా అధికంగా ప్రబలుతాయి.

గాలిలో కనపడని దుమ్ము, ధూళి సంబంధించిన కాలుష్య పదార్థాలు భారతదేశంలో సగటు కన్నా రాయలసీమలో మిగతా ప్రాంతాల కన్నా ఎక్కువ. దీనికి కారణం ఇక్కడ నీటి లభ్యత లేకపోవడమే. ఈ కారణంగా శ్వాసకోశ వ్యాధులు, ప్రజలలో హెచ్చుగా కనబడుతున్నాయి. నీటికన్న ప్రభుత్వ - ప్రైవేట్ మద్యం అధికంగా లభ్యమవుతోంది. పర్యావరణ సూచికను పరిశీలిస్తే రాయలసీమ 0.400 నుండి 0.500 మధ్యలో ఉంది. అంటే అత్యధికంగా భూమి, నీరు, అడవులు దెబ్బతిన్నాయని దీని సంకేతం. గ్రామీణ ప్రాంతాలకు సరైన నిధులు, విధులు ఇవ్వకపోవడంతో అవి రుగ్మతలో ఉన్నాయి. సుపరిపాలన అనేది ఇంకా ప్రజల దగ్గరకు రాలేదు. వలసలు అనేవి ఆదాయార్జనకు అనివార్యం, అవసరం. 2001 జనాభా లెక్కల ప్రకారం 53 శాతం ప్రజలు ఒక గ్రామం నుండి మరొక గ్రామానికి వలస పోతున్నారు. వలసలు అధికంగా అనంతపురం, కర్నూలు జిల్లాలో జరుగుతున్నాయి. గ్రామాల నుండి నగరాలకు వచ్చే వలసలు 14 శాతంగా ఉన్నాయి. నగరాలకు వలసలు రావడంతో రాయలసీమలో నగరాలలో జనాభా పెరగడం, దీంతో పర్యావరణ హాని జరుగుతోంది. నగరాలు పెరిగే కొద్దీ అడవులు, నీరు, ఇసుక క్షీణిస్తున్నాయి. పట్టణీకరణ వలన తిరుపతి దగ్గర ఉండే స్వర్ణముఖీ నది కనపడడం లేదు.

ఏది ఏమైనా గత 62 సంవత్సరాల ప్రభుత్వ విధానాలు, రాజకీయ నాయకుల ఉదాసీనత, ఉద్యోగస్వామ్య నిర్లిప్తత, ప్రజల అవగాహన లోపం, ప్రకృతి వనరుల అల్ప లభ్యతనేవి రాయలసీమ జిల్లాలకు రాలేకపోయాయి. ప్రజల కనీస అవసరాలను తీర్చలేకపోయాయి. చివరికి ప్రజలను సుదీర్ఘకాలం కుసంస్కార మూఢాక్షలతో కాలం గడపండనే పాఠాన్ని ప్రభుత్వాలు విన్నవించాయి.

ప్రత్యేక రాష్ట్రం వల్ల వచ్చే ప్రయోజనమేమంటే, స్వయంగా నిర్ణయాధికారం; ప్రప్రథమంగా ఈ గడ్డ ప్రజలకు వస్తుంది. పాలకులు వారి ప్రాధాన్యతలకు ప్రాధాన్యమిస్తారు. కేంద్ర నిధులు ప్రత్యక్షంగా ఈ గడ్డకే వస్తాయి. విద్యాధికులు నేరచరితులను ప్రత్యక్షంగా గుర్తిస్తారు. లంచగొండులను ఎదిరిస్తారు. చిన్న ప్రాంతాలలో త్యాగశీలురులను ప్రోత్సహిస్తారు. సాగునీరు, విద్య, వైద్య, అవస్థాపనా సౌకర్యాలు ప్రభుత్వ సహకారంతో అమలు వేగిరపరుస్తారు. వారి పన్నులు వారిగడ్డకే పెట్టుబడులుగా మారుతాయి. ప్రవాస భారతీయులు, విదేశీ పెట్టుబడులు, ప్రపంచీకరణ, ప్రపంచ బ్యాంక్ రుణాలు ఈ గడ్డకు చేరుతాయి. అనంతపురం జిల్లా వాసి పప్పూరి రామాచార్యులు, సాధన పత్రిక సంపాదకుడు 1937లో యూరప్ దేశాలకన్నా రాయలసీమ గొప్పదవుతుంది అనే వాదన, కల నిజమవుతుంది. ఇజ్రాయిల్‌లా ఎడారిగా మారే ఇసుకనే బంగారంగా మార్చే ధైర్య, సాహసాలు రాయలసీమ బిడ్డలకు ఉన్నాయి. వీ

*రెండు దశాబ్దాలుగా పర్యావరణం గురించి శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నా, దుష్ఫలితాలను సామాన్యులు అనుభవిస్తున్నా, నిర్దిష్టమైన నిర్ణయాలు చేయకుండానే కోపెన్‌హాగెన్ సదస్సు ముగిసిందంటున్నారు* **ఎ. నరసింహారెడ్డి**

# నిరాశపర్చిన కోపెన్‌హాగెన్ సదస్సు

ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా ప్రజలకు ఆందోళన కలిగించే అంశం ప్రమాదస్థాయికి చేరిన పర్యావరణం. రోజురోజుకి పెరిగిపోతున్న వాతావరణ కాలుష్యం మానవజాతి మనుగడకే ముప్పు తెచ్చే స్థాయికి చేరిందని శాస్త్రజ్ఞులు తెలుపుతున్నారు. ప్రకృతితో బాధ్యతారహితంగా వ్యవహరిస్తే 2050 నాటికి భూమిపై 30 శాతం జనాభా మనుగడ ప్రశ్నార్థకమేనని శాస్త్రజ్ఞులు హెచ్చరిస్తున్నారు.

19వ శతాబ్దపు ద్వితీయార్థంలో ఊపందుకున్న పారిశ్రామికీకరణ, పెట్టుబడిదారీ వ్యవసాయ పద్ధతులు సృష్టించిన వాతావరణ కాలుష్యం వలన భూమి సెగలు కక్కుతోంది. మితిమీరిన చమురు, ఇతర ఇంధనాల వినియోగం కారణంగా వాతావరణంలో కర్బన వాయువు, ఇతర హరిత గృహ (గ్రీన్ హౌస్) విష వాయువుల (మిథేన్, క్లోరోఫ్లోరో కార్బన్స్, కార్బన్ మోనాక్సైడ్, నైట్రోజన్ ఆక్సైడ్, హైడ్రోజన్ పెరాక్సైడ్) శాతం త్వరలో 450 పి.పి.ఎం. పాయింట్స్‌కు (వైద్యపరంగా మానవుడు భరించలేని) చేరడం వలన ఉష్ణోగ్రత పెరిగి (అంటార్కిటికా, సైబిరియా, హిమాలయాల్లోని) మంచు ఖండాలు శరవేగంగా కరిగిపోయి సముద్ర మట్టం పెరిగే ప్రమాదముంది.

దక్షిణ, ఈశాన్య రుతుపవనాల ద్వారా మనకు లభించే వర్షపాతం తగ్గుతుంది. ప్రపంచ శీతోష్ణ స్థితిలో ఊహించని రీతిలో మార్పులు సంభవిస్తే రుతుపవనాల్లో తిరోగమనం ఏర్పడి దుర్భిక్షాలు, వరదలు, ఉప్పెనలు సంభవిస్తాయి. ఈ తిరోగమనాన్ని శాస్త్రజ్ఞులు 'ఎల్‌వినో' అని అంటారు. వాతావరణంలోని అపసవ్యాల వల్ల ఏర్పడేదే ఈ ఎల్‌వినో. ఇది కొన్ని సంవత్సరాల కొకసారి తూర్పు ఫసిఫిక్ మహా సముద్రంలోని పెరూ, ఈక్వెడార్ తీరంలో సముద్ర వాతావరణ సంయోజనం వల్ల ఏర్పడుతుంది.

గ్లోబల్ వార్మింగ్ వల్ల ఎల్‌వినో ప్రభావం మరింత పెరుగవచ్చునని హెచ్చరిస్తున్నారు. ఇటువంటి పర్యావరణ సమస్యల పట్ల సమాజాలు తగిన సమయంలో తగిన విధంగా స్పందించకపోతే సమస్యలు తీవ్ర రూపం దాల్చిన తరువాత పరిష్కారాలు చేయడం కష్టమవుతుంది.

గత మూడు దశాబ్దాల నుండి భూమి వాతావరణంలో మార్పులు వస్తున్నాయని, వేడి పెరుగుతోందనీ, ఇదే రీతిగా పెరుగుతూ పోతే భూమిపై మానవ వికాసానికే తీవ్ర ప్రమాదం ఏర్పడుతుందని శాస్త్రజ్ఞులు హెచ్చరిస్తున్నారు. మానవుడు ప్రకృతిని విచక్షణారహితంగా ఉపయోగించుకోవడం వలన వాతావరణంలో మార్పులు వస్తున్నాయని శాస్త్రజ్ఞులు పేర్కొంటున్నారు.

భూమిపై అడవి కనీసం 40 శాతం ఉండాలి, కాని అది నేడు 25 శాతానికి పడిపోయింది. బొగ్గు, పెట్రోలియం లాంటి ఇంధనాలను మండించడం వలన బొగ్గుపులుసు వాయువు పెద్దయెత్తున విడుదలవుతోంది. వీటి వలన గడిచిన శతాబ్దంలో భూమి పై వాతావరణంలో అరడిగ్రీ సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత పెరిగిందని అంచనా. అదే విధంగా పెరుగుతూ పోతే 2050 నాటికి 3 సెంటీగ్రేడ్ డిగ్రీల వరకు పెరుగుతుందని అంచనా వేశారు. దీనివలన అనూహ్యమైన మార్పులు వస్తాయని శాస్త్రజ్ఞులు హెచ్చరిస్తున్నారు.

భూ వాతావరణంపై శాస్త్రజ్ఞుల పరిశోధనలు 1990 నుంచే ప్రారంభమైనా ఇటీవల కాలంలో అవి మరింత తీవ్రమైనాయి. శాస్త్రజ్ఞుల హెచ్చరికలు పెరిగాయి. వారి హెచ్చరికల ఫలితం కూడా కొన్ని సందర్భాలలో భూమిపై కనబడుతోంది. ఇటీవల దక్షిణాసియాలో, అమెరికాలో వరుసగా వచ్చిన తుపాన్లు, అడవులు తగలబడడం, దక్షిణ యూరప్‌లో గత దశాబ్దంలో వరుసగా వచ్చిన వర్షాభావ పరిస్థితులు ఆయా ప్రాంతాల ప్రజలను నానా ఇబ్బందులకు గురి చేశాయి. వందల వేల మంది ప్రజలు చనిపోయారు.

మానవజాతి మనుగడ కోసం మన పర్యావరణాన్ని పరిరక్షించు కునేందుకు చర్యలు చేపట్టాలని పర్యావరణ పరిరక్షణ ఉద్యమాలు ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్నాయి. వాతావరణంలో హానికరమైన మార్పుల్ని నిరోధించే లక్ష్యంతో కోపెన్‌హాగెన్‌లో జరిగిన ప్రపంచ వాతావరణ సదస్సు జరిగింది. భూగోళ ఉష్ణోగ్రత పెరుగుదలను పరిమితిలో ఉంచేందుకు నిర్దిష్టమైన, శిరోధార్యమైన ఒప్పందం కుదురుతుందని ఆశించిన, ఎదురుచూసిన ప్రపంచ ప్రజలకు నిరాశే మిగిలింది.

ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యాన 2009 డిసెంబర్ 7 నుండి 18 వరకు డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగెన్‌లో జరిగిన 'ప్రపంచ వాతావరణ సదస్సు' లో 192 దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు. 110 దేశాల నుండి అగ్రనేతలు పాల్గొన్నారు. వీరితోపాటు ప్రపంచ సంస్థలకు చెందిన ప్రతినిధులు, ప్రఖ్యాత శాస్త్రజ్ఞులు, సామాజిక శాస్త్రవేత్తలు దాదాపు 15,000 మంది పాల్గొన్నారు. సదస్సుకి ప్రపంచవ్యాప్తంగా విస్తృత ప్రచారం జరిగింది. ప్రభుత్వాధినేతలు సాగించిన చర్చల్లో ఏకీభావం కన్నా విభేదాలే ఎక్కువ వ్యక్తమయ్యాయి. భూతాపం పెరుగుతున్న కారణంగా ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తున్నాయని, జీవరాశుల ఉనికికి ప్రమాదం ముంచుకొస్తుందన్న వాదనను అందరూ అంగీకరిస్తున్నప్పటికీ,

అందుకు మూల కారణమైన కర్బన ఉద్గారాలను, ఇతర ఉష్ణాల విడుదలను తగ్గించేందుకు పారిశ్రామిక సంపన్న దేశాలు తగినంత బాధ్యతను స్వీకరించకపోవడమే విభేదాలకు ప్రధాన హేతువు.

భూతాపం ముంచుకొస్తుందని శాస్త్రజ్ఞులు హెచ్చరించడంతో 1988లో ఐక్యరాజ్యసమితి పర్యావరణ కార్యక్రమం, ప్రపంచ వాతావరణ సంస్థలు సంయుక్తంగా పర్యావరణ మార్పులపై అంతర్ ప్రభుత్వ ప్యానల్ (ఇంటర్ గవర్నమెంట్ పానల్ ఫర్ క్లైమేట్ చేంజ్ – ఐజిపిసిసి) ను ఏర్పాటు చేశాయి. ఈ ప్యానల్ సమస్య తీవ్రతను నిర్ధారించి తక్షణం తగిన చర్యలు చేపట్టక తప్పదని హెచ్చరించింది. ఫలితంగా ఐక్యరాజ్యసమితి నేతృత్వంలో రెండు ఒడంబడికలు కుదిరాయి.

మొదటిది పెరుగుతున్న పర్యావరణ ముప్పును ఒక సమస్యగా గుర్తించిన తొలి అంతర్జాతీయ అవగాహన యునైటెడ్ నేషన్స్ ఫ్రేమ్ వర్క్ ఆన్ క్లైమాటిక్ చేంజ్ (యు.ఎన్.ఎఫ్.సి.సి.). రెండవది క్యోటో ఒడంబడిక. ప్రమాదకర మార్పులను అడ్డుకోవడం అవసరమని 192 దేశాలు 1992లో రియోలో జరిగిన ధరిత్రి సదస్సులో దీనిపై సంతకాలు చేశాయి. గ్రీన్‌హౌస్ వాయువులు పెరగడానికి మూలం సంపన్న దేశాలే కాబట్టి ఈ వాయువులను అడ్డుకునే విషయంలో కూడా వాళ్లే ముందుండాలని ఈ ఒడంబడిక స్పష్టం చేసింది. పేద దేశాలలో గ్రీన్‌హౌస్ వాయువులను తగ్గించుకునేందుకు సంపన్న దేశాలు ఆర్థికంగా, సాంకేతికంగా సహకరించాలని ఈ ఒడంబడిక స్పష్టం చేసింది.

ఐ.రా.స. ఆధ్వర్యంలో భూమిపై వాతావరణంలో వేడి తగ్గించడానికి తీసుకోవాలసిన చర్యల గురించి చర్చించడానికి జపాన్ నగరమైన క్యోటోలో డిసెంబర్ 1997లో సదస్సు జరిగింది. అక్కడ ఒక ఒప్పందం జరిగింది. వివిధ దేశాలను చట్టబద్ధంగా బాధ్యులను చేసే నిర్దిష్టమైన ఒడంబడిక. గ్రీన్‌హౌస్ వాయు ఉద్గారాలను ఎంత తగ్గించుకోవాలో 37 పారిశ్రామిక దేశాలకు కచ్చితమైన లక్ష్యాలు నిర్దేశించింది. దీన్ని ఇప్పటివరకు 184 దేశాలు ఆమోదించాయి. దానినే 'క్యోటో' ఒప్పందంగా పిలుస్తున్నారు.

ఈ ఒప్పందాన్ని అమెరికా అంగీకరించలేదు. యురపియన్ దేశాలు, ఇతర ధనిక దేశాలు దానిలో ప్రముఖ పాత్ర వహించాయి. వాతావరణంలో వేడి పెరగడానికి ప్రధాన కారణంగా కార్బన్ డైయాక్సైడ్ వాయువు విడుదలను పేర్కొన్నారు. దానినే కర్బన 'ఉద్గారాల' విడుదలగా పిలుస్తున్నారు. ఇలాంటి ఉద్గారాల విడుదల అత్యధికంగా 98 శాతం పారిశ్రామిక దేశాలనుండే జరుగుతోంది. ఈ మేరకు ఈ దేశాలు 1990 నాటి ఉద్గారాల విడుదల స్థాయిలో 20 శాతం తగ్గించడానికి అంగీకరించాయి. ఈ అంగీకారాన్ని అన్ని పారిశ్రామిక దేశాలు తప్పనిసరిగా అమలుచేయాలని నిర్ణయించాయి. ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉద్గారాల విడుదలే తక్కువగా ఉంటుంది కాబట్టి వాటికి లక్ష్యాలను నిర్దేశించలేదు. స్వచ్ఛందంగా ఉద్గారాల విడుదలను తగ్గించుకోవాలని మాత్రం కోరాయి. ఈ ఒప్పందం 1997 నుండి 2012తో ముగుస్తోంది.

క్యోటో ప్రోటోకాల్ ప్రకారం ప్రాథమికంగా ప్రతి దేశం తన కర్బన్ ఉద్గారాలను తగ్గించుకోవాలి. అయితే తమ లక్ష్యాలను చేరుకోవడానికి ఇది కొన్ని మార్కెట్ ఆధారిత చర్యలకు వెసులుబాటు కల్పించడం విశేషం. వీటిలో ముఖ్యమైనది ఎమిషన్ ట్రేడింగ్ / కార్బన్ మార్కెట్. అంటే మనం తగ్గించుకోలేకపోతే, తగ్గించుకున్న వారికి ధనసాయమైనా చేసి, ఆ పుణ్యాన్ని కాస్త మూటగట్టుకుని, లక్ష్యాల్లో గట్టెక్కడం. మరో రకంగా చెప్పాలంటే ఇది కర్బన ఉద్గారాలను తగ్గించుకుంటూ, హరిత విధానాలను అనుసరించే వారికి ఆర్థికంగా బాసటగా నిలిచే మార్కెట్ యంత్రాంగం.

అభివృద్ధి చెందుతున్న దేశాల్లో హరిత విధానాలను అనుసరించే పరిశ్రమలు, ప్రాజెక్టులు – తాము తగ్గిస్తున్న ప్రతి టన్ను కార్బన్ డైయాక్సైడ్ ఉద్గారానికి ఒక క్రెడిట్ పాయింట్ సాధిస్తాయి. ఈ పాయింట్‌ను ఆ పరిశ్రమలు, ప్రాజెక్టులు కార్బన్ మార్కెట్‌లో అమ్ముకోవచ్చు. సంపన్న దేశాల్లోని పరిశ్రమలు, తాము హరిత విధానాలను అనుసరించలేని సందర్భంలో ఈ కార్బన్ క్రెడిట్స్‌ను మార్కెట్లో కొనుగోలు చేసుకోవచ్చు. తాము ఉద్గారాలను తగ్గించు కోకపోయినా మార్కెట్లో డబ్బు పోసి బడుగు దేశీ కంపెనీల నుంచి ఈ క్రెడిట్స్ కొనడం ద్వారా తమ లక్ష్యాలను చేరుకోవచ్చు. దీనివల్ల బడుగు దేశాల్లో హరిత విధానాలను అనుసరిస్తున్న వారికి ఆర్థిక ప్రోత్సాహం లభిస్తుంది. సంపన్న దేశాల్లో హరిత విధానాలకు మారలేని కంపెనీలకు లక్ష్యాలను చేరుకునే వెసులుబాటూ వస్తుంది.

ఈ భూమ్మీద కార్బన్ ఉద్గారాలు ఏ దేశంలో తగ్గినా అందరికీ మేలే కాబట్టి ఈ ట్రేడింగ్ సత్ఫలితం అందరికీ దక్కుతుంది. అంతర్జాతీయ మార్కెట్లో ఎన్ని కార్బన్ యూనిట్లు విక్రయానికి ఉంటే భూమికి అంత మేలు జరుగుతున్నట్లు భావించాలి. గత ఏడాది ప్రపంచ కార్బన్ ట్రేడింగ్ మార్కెట్ దాదాపు 500 కోట్ల డాలర్లకు చేరినట్టు అంచనా.

జేమ్స్ హన్సన్ ప్రపంచ ప్రఖ్యాత వాతావరణ శాస్త్రవేత్త, డైరక్టర్ నాసా అంతరిక్ష అధ్యయన కేంద్రం వెలిబుచ్చిన ప్రాముఖ్యత గల అంశాలు: 1) ఆర్కిటిక్ సముద్రంలో తెల్లటి మంచు కరగడం వలన భూమిమీద పడే సూర్య కిరణాల వెలుతురు, వేడిమి గ్రహించడంలో తేడా రావడంతో భూమిపై ఉష్ణోగ్రత పెరుగుతుంది. 2) ఉత్తర ధృవ ప్రాంతంలోని చెట్లు లేని విశాలమైన టండ్రా మైదానాలలోని గడ్డకట్టిన మంచు కరగడం వలన వాటి కింది భాగాన దాగివున్న మిథైన్ విడుదలై వాతావరణం వేడి ఎక్కుతుంది. 3) సముద్రాలు ఆమ్లీకరణ చెందడం వలన 1980 నుండి కార్బన్ డై ఆక్సైడ్‌ను గ్రహించి ఉష్ణోగ్రతను తగ్గించే అవకాశం క్షీణిస్తుంది. 4) జీవ జాతులు అంతరిస్తున్నాయి, భవిష్యత్తులో మరిన్ని జీవరాశులు అంతరిస్తూ పర్యావరణానికి విఘాతం కలిగించే ప్రమాదం ముంచుకొస్తుంది.

వాతావరణ మార్పులు వేగంగా ప్రమాదకరంగా పరిణమిస్తున్నందున అక్టోబర్ 2009లో ఐక్య రాజ్య సమితి నిర్వహించిన ఎడారీకరణ నివారణ సదస్సు కార్య నిర్వాహక కార్యదర్శి లక్‌నాకడ్జ నివేదిక ప్రకారం ప్రస్తుతమున్న 40 శాతం వర్షాభావ ప్రాంతం 2025 నాటికి 70 శాతానికి పెరుగుతుందని హెచ్చరించాడు. ఐపిసిసి – 2007 నివేదిక ప్రకారం వాతావరణంలో ప్రతి పది లక్షలకు 450 భాగాలు (పి.పి.ఎం.) అధిగమిస్తే ప్రమాదస్థాయిగా గుర్తించింది. ప్రస్తుతం 387 పాయింట్లున్నట్లు తెలుపుతూ దీన్ని 350 పాయింట్‌లకు తగ్గించుకోవడం జీవ, మానవ మనుగడకు సురక్షితంగా ఉంటుందని పేర్కొంది.

1997లో కుదిరిన క్యోటో ఒప్పందం (అమెరికా ఒక్కటే దాన్ని ఆమోదించలేదు). 'సమిష్టి – భిన్నమైన బాధ్యతలతో సమన్యాయాన్ని' నిర్దేశించగా ఆ ప్రాతిపదికను తుంగలో తొక్కేందుకు, కొత్త ఒప్పందం పేరుతో దాన్ని పూర్తిగా తిరస్కరించేందుకు కోపెన్‌హాగెన్‌లో పారిశ్రామిక దేశాలు గట్టిగా ప్రయత్నించాయి. వర్ధమాన ప్రపంచంలో వేగంగా అభివృద్ధి చెందుతున్న బేసిక్ దేశాలు (బ్రెజిల్, దక్షిణాఫ్రికా, ఇండియా, చైనా) కూడా విష వాయువుల విడుదల తగ్గింపు కోటాలను శిరోధార్యంగా స్వీకరించాలని ఒత్తిడి తెచ్చాయి. అయితే ఆఫ్రికా, లాటిన్ అమెరికా, ఆసియా దేశాలు అభివృద్ధి చెందిన దేశాల వైఖరిని తీవ్రంగా నిరసించాయి. ప్లీనరీ నుండి, మంత్రులస్థాయి సమావేశాల నుండి వాకౌట్‌లు కూడా చేశాయి.

కోపెన్‌హాగెన్ సదస్సులో అమెరికా, బ్రిటన్ దేశాల నేతృత్వంలో సదస్సుకి ఆతిథ్యమిచ్చిన డెన్మార్క్ ఒక ముసాయిదా ఒప్పంద పత్రాన్ని ప్రతిపాదించింది. దాని ప్రకారం ధనిక దేశాలతో పాటు పేద దేశాలు కూడా కర్బన ఉద్గారాల తగ్గింపుకి నిర్దిష్ట లక్ష్యాలను అంగీకరించాలని, వాటి అమలుకి పర్యవేక్షణ, తనిఖీలు ఉండాలని, అమలు చేయడమనేది చట్టబద్ధంగా ఉండాలని, అలా అమలు చేయని దేశాలపై ఆర్థిక ఆంక్షలు విధించాలని ప్రతిపాదించింది.

అయితే అనేక పేద దేశాలు ఈ ముసాయిదా ప్రతిపాదనలను తిరస్కరించాయి. కోపెన్‌హాగెన్ సదస్సులో దేశాల మధ్య వ్యక్తమైన విభేదాలు కొత్తగా పుట్టుకు వచ్చినవి కావు. అవి ఇంతకు మునుపు నుంచి అభివృద్ధి చెందిన – అభివృద్ధి చెందుతున్న దేశాల వాదనలకు కొనసాగింపు మాత్రమే. భారీ పారిశ్రామికీకరణ కారణంగా విడుదల చేస్తున్న కార్బన్ డై ఆక్సైడ్, మిథేన్, నైట్రస్ ఆక్సైడ్, సల్ఫర్ హెక్సా ఫ్లోరైడ్ పుడమిని ఆవరించిన రక్షణ ఓ జోన్ కవచానికి తూట్లు పొడుస్తున్నాయనడంలో మరో అభిప్రాయానికి తావే లేదు. వీటి విడుదలను తగ్గించాలంటే సూత్రప్రాయంగా విభేదించే దేశాధినేతలూ లేరు. ఎవరు ఎంత తగ్గించాలనేసరికే పితలాటకం మొదలవుతోంది. కోపెన్‌హాగెన్‌లోనూ జరిగినది సరిగ్గా అదే.

పారిశ్రామిక విప్లవం పదిహేడు, పద్దెనిమిది శతాబ్దాల్లోనే మొదలైనా, అది అన్ని దేశాల్లో ఒకేసారి, ఒకే మోతాదులో ప్రారంభం కాలేదు. నేడు పారిశ్రామికంగా చాలా ముందున్న దేశాలు, ఆర్థిక వ్యవస్థలు దాని ఫలితంలో సింహభాగాన్ని అనుభవిస్తూ వస్తున్నవి. కాలుష్య కారక వాయువుల విడుదలను నియంత్రించగల నైపుణ్యాలను మెరుగ్గా అమలు చేయగల ఈ దేశాలకు – పారిశ్రామికీకరణ కుంటి నడకనో, నత్త నడకనో సాగుతున్న దేశాలకు ఉద్గారాల విషయంలో ఒకే న్యాయం అమలు చేయాలంటే సమంజసమేనా? కాబట్టే గ్రీన్ హౌస్ ఉద్గారాలను నియంత్రించడానికి నీతి సూత్రాలంటూ క్యోటో తరువాత చేసిన అనేక ప్రతిపాదనల్లో అభివృద్ధిపరంగా కడుపు నిండిన దేశాలు చేస్తున్న కుట్ర దాగి ఉందేమో అన్న అనుమానాల చర్చే ఎక్కువగా సాగింది.

ఐక్యరాజ్యసమితి చూపుతున్న చొరవ మీద గౌరవం ఉన్నా, పారిశ్రామికంగా ముందున్న దేశాలు చేస్తున్న ప్రతిపాదనల మీద నమ్మకం లేక పర్యావరణ చర్చలు ప్రతిష్టంభనకు పర్యాయపదంగా మారాయి. కాబట్టే కోపెన్‌హాగెన్‌లో ఒబామా ఎంత గొప్పగా ప్రసంగించారనే దానికన్నా, అభివృద్ధి చెందుతున్న దేశాలను అమెరికా, ఐరోపా సమాఖ్యలు కలిపి ఎలా ముంచాలనుకుంటున్నాయన్న అనుమానాల చుట్టూనే మిగతా దేశాల బృందాలూ, అధినేతల ఆలోచనలూ పరిభ్రమించాయి.

భూతాపం పెరిగిపోవటం వల్ల సంభవించే విపరిణామాల్లో నష్టపోయే పేద దేశాలకు ధనిక దేశాలు అండదండలు అందించడానికి చివరగా ముందుకు వచ్చాయి. 2020 నుండి వర్ధమాన దేశాలకు వాతావరణాన్ని రక్షించడానికి 100 బిలియన్ల డాలర్ల ఆర్థిక సాయం చేస్తామని సంపన్న దేశాలు అంగీకరించాయి. 2012 వరకు 30 బిలియన్ల డాలర్లు అందిస్తామని వాగ్దానం చేశాయి. ఈ ప్రకటన నమ్మశక్యం కాని వాగ్దానంలా కనిపించింది. ఆ సహాయం అందుకున్న దేశాలు ఖర్చు చేసిన సొమ్ము లెక్కలూ, ఆనవాళ్లనూ తమ తనిఖీలకు తెరిచి పెట్టాలన్న అమెరికా అధ్యక్షుడి ప్రతిపాదన పుండు మీద కారం రాసింది. సంపన్న, పేద దేశాల మధ్య అంతరాలే కాక, ఆయా దేశాలు తమ ప్రయోజనాలను కాపాడుకునే క్రమంలో వాటిలో అంతర్గతంగానూ భిన్నాభిప్రాయాలే వ్యక్తమయ్యాయి.

ఇక ఏకీభావం సాధ్యంకాదని గ్రహించి మారుతున్న పరిస్థితిలో, అసలు ఒప్పందం లేకపోవడం కన్నా ఏదో ఒకటి ఉందనిపించడమే మేలని రంగంలో దిగిన అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా బేసిక్ దేశాధినేతలు సమావేశంలో ఉన్న గదిలోకి చొరబడి ముమ్మరంగా చర్చలు జరిపి కర్బన ఉద్గారాల తగ్గింపుపై నిర్దిష్ట బాధ్యతలు లేని, చట్టబద్ధంగా శిరోధార్యం కాని ఒక ఒప్పందాన్ని హడావిడిగా ఒప్పించారు. ఐదు దేశాల అంగీకారంగా ప్లీనరీ ముందుకొచ్చిన ఆ ఒప్పందాన్ని అత్యధిక దేశాలు ఆమోదించలేదు.

దాన్ని ఒప్పందంగా గాక 'రెఫరెన్స్ నోట్'గా పరిగణనలోకి తీసుకొని, అందుకు అంగీకరించిన దేశాలు సంతకాలు చేయవచ్చునని సమావేశ అధ్యక్షుడు ఫిలిప్ వీచ్ – (బహమస్) ప్రకటించి సమావేశాన్ని ముగించారు. కోపెన్‌హాగెన్‌లో విజేతలెవరూ లేరు. క్యోటో ఒప్పందం తరువాత నెరవేరాల్సిన విధి విధానాలను నిర్దేశించడంలో, వాతావరణ పరిరక్షణకు, మానవాళి మనుగడకు మెరుగైన భరోసా ఇచ్చే ప్రయత్నంలో 193 దేశాల ప్రతినిధులూ ఓటమి భారంతోనే వెనుదిరిగినట్టయింది.

సంపన్న దేశాలకు హెచ్చుగా, కచ్చితమైన కర్బన ఉద్గారాల తగ్గింపు లక్ష్యాలు నిర్దేశించనందున భూ వాతావరణ కాలుష్యానికి ఎక్కువగా కారకులైనవారు ఎక్కువగా తగ్గించాలన్న సహజ న్యాయం నిరాకరించబడింది. భూతాపం పెరగడానికి, పర్యావరణానికి ఏర్పడిన ప్రమాదానికి సంపన్న పారిశ్రామిక దేశాలు మూల కారణమన్నది పరమ సత్యం.

దారిద్ర్యం, ఆకలి నుండి తమ ప్రజలను గట్టెక్కించేందుకు గత కొద్ది దశాబ్దాలుగా పారిశ్రామీకాభివృద్ధిని వేగవంతం చేయడానికి ప్రయత్నిస్తున్న పేద దేశాలను కూడా ఆదేగాటన కట్టి కర్బన ఉద్గారాల తగ్గింపును డిమాండ్ చేయడం క్యోటో ఒప్పందంలోని 'సమిష్టి – భిన్నమైన బాధ్యతల' సూత్రానికి విరుద్ధం. బేసిక్‌దేశాలు కర్బన ఉద్గారాల తగ్గింపునకు స్వచ్ఛంద లక్ష్యాలను ప్రకటించాయి. అయితే వాటి పాటింపు తీరుపై అంతర్జాతీయ పర్యవేక్షణను తిరస్కరించిన ఈ దేశాలు, అభివృద్ధి

చెందిన దేశాల నుండి అదనపు తగ్గింపు లక్ష్యాలు సాధించకుండానే, అందుకు అంగీకరించడం ఈ దేశాల సమిష్టి లొంగుబాటు. చట్టరీత్యా శిరోధార్యంగా ఉండే అంతర్జాతీయ ఒప్పందం డిమాండ్ నుండి అవి వెనక్కు తగ్గాయి. ఆరు నెలల క్రితం చర్చల్లో అంగీకరించిన ప్రకారం అమెరికా 2005 నాటి కర్బన ఉద్గారాల స్థాయి నుండి 17 శాతం తగ్గిస్తుంది. చైనా 2005 నాటి విడుదల నుండి 40-45 శాతం, భారత్ 20-25 శాతం, యురపియన్ యూనియన్ 1990 నాటి స్థాయిలో 20-30, జపాన్ 25 శాతం తగ్గించుకోవలసి ఉంది, కాని అలా జరగలేదు.

ప్రపంచ అనుభవాలను పరిశీలించినప్పుడు, లాభాల వేటలో పర్యావరణానికి నష్టం కలుగజేస్తూ, ప్రయోజనాలు పొందుతున్నది కొందరైతే, కష్టాలు నష్టాలను భరిస్తున్నది మరికొందరు. ఈ కారణం వల్లనే ప్రపంచ దేశాలు రెండు గ్రూపులుగా ఏర్పడ్డాయి. మొదటి గ్రూపులో అమెరికా, ఆస్ట్రేలియా వంటి అభివృద్ధి చెందిన దేశాలు ఉండగా, రెండోదాంట్లో ఇండియా, చైనా, బ్రెజిల్ వంటి మూడో ప్రపంచ దేశాలు కొన్ని ఉన్నాయి. ముఖ్యంగా అమెరికా, ఆస్ట్రేలియా దేశాలు ఈ సదస్సులో ఒక ఉమ్మడి ఒప్పందం జరగకుండా అడ్డుకున్నాయి. ఈ పరిణామాలు పర్యావరణంపై రానున్నకాలంలో తీవ్ర ప్రభావం చూపనున్నాయి.

యు.ఎన్.ఎఫ్.సి.సి. అంచనా ప్రకారం ప్రపంచ సగటు ఉష్ణోగ్రత సంవత్సరానికి 0.3 డిగ్రీల చొప్పున పెరుగుతున్నది. ఇందువల్ల రాబోయే కాలంలో 55 కోట్ల ప్రజలు పేదరికంలోనూ, 12 కోట్ల తీర ప్రాంత ప్రజలు వరద ముంపుకు గురవుతారని పేర్కొంది. అలాగే ఇంటర్ - గవర్నమెంటల్ ప్యానల్ ఆన్ క్లైమేట్ చేంజ్ (ఐజీపిసిసి) అంచనా ప్రకారం వాతావరణంలో మార్పుల వల్ల 2050 నాటికి 15 కోట్ల మంది వేరే ప్రాంతాలకు వలసపోతారని, పసిఫిక్ సముద్రంలోని తూవలు అనే చిన్న దీవులు, మాల్దీవులు, లక్షద్వీప్, అండమాన్ నికోబార్ దీవులతో పాటు బెంగాల్‌లోని సుందరబన్స్, కేరళలోని కుట్టన్డ్, అలాగే తీర ప్రాంతాలు ముంపుకు గురవుతాయని ఆ సంస్థ పేర్కొంది.

1989లోనే జెనీవాలో జరిగిన ప్రపంచ వాతావరణ మహాసభ 'వాతావరణ మార్పు - వ్యవసాయం' అనే తీర్మానంలో 'వాతావరణంలో 1 నుండి 2 డిగ్రీల సెల్సియస్ ఉష్ణోగ్రత పెరిగితే దక్షిణాసియా సబ్ - సహారన్ ఆఫ్రికాలో పంటల దిగుబడి గణనీయంగా తగ్గిపోతుందని పేర్కొంది. 2009లో ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ (ఎఫ్.ఎ.ఒ.)కు చెందిన నిపుణుల కమిటీ కూడా ఇదే హెచ్చరిక చేసింది.

భూసారం క్షీణించడం వల్ల 20 శాతం మేరకు సాగు భూమి విస్తీర్ణం తగ్గిపోయిందని, అందువల్ల రాబోయే 20 ఏళ్ల కాలంలో వ్యవసాయంపై ఆధారపడుతున్న 150 కోట్ల మంది ప్రజలు జీవనాధారాన్ని కోల్పోతారని పేర్కొంది. మొత్తంగా చూసినపుడు ఈ వాతావరణ మార్పుల వల్ల వ్యవసాయ ఉత్పాదకత తగ్గి ఆహార సంక్షోభం పెరగడంతో పాటు, జీవ వైవిధ్యానికి తీవ్ర నష్టం వంటి సమస్యలు పెరుగుతాయి. మరి దీనికి ఎవరు బాధ్యత వహించాలి?

'బియాండ్ ది లిమిట్స్' రచయితలు వెల్లడించిన వివరాల ప్రకారం ప్రతిరోజు పదిలక్షల టన్నుల ప్రమాదరకరమైన వ్యర్థాల ఉత్పత్తి జరుగుతూ ఉంది. ఇందులో 90 శాతం వాటా పారిశ్రామిక పెట్టుబడిదారీ దేశాలదే. అతి ఎక్కువగా కార్బన్ డై ఆక్సైడ్ ఉద్గారాలు విడుదల చేస్తున్న దేశాలలో అమెరికా ప్రతియేటా 19.78 టన్నులు విడుదల చేస్తుంది. ఇది భారతీయ సగటు కన్నా 18 రెట్లు ఎక్కువ. అయినప్పటికీ అమెరికా ఉద్గారాలను తగ్గించుకోవడానికి ముందుకు రావడం లేదు.

1990 నాటి స్థాయిలో కనీసం 40 శాతం ఉద్గారాలు తగ్గించుకోవాలన్నది లక్ష్యమైతే 2005 నాటి స్థాయిలో 17 శాతం తగ్గించుకుంటామని ఒబామా బేరాలు పెడుతున్నారు. 1992లో రియోలో సంతకాలు చేసినప్పటి నుండి ప్రపంచ జి.ఎచ్.జి. ఉద్గారాల స్థాయి 30 శాతం పెరిగింది. భౌగోళిక ఉష్ణోగ్రత అదనంగా 2 సెంటిగ్రేడ్ డిగ్రీల ప్రమాదస్థాయిని దాటకుండా నిరోధించాలంటే పారిశ్రామిక దేశాలు తమ జి.ఎచ్.జి స్థాయిలను 1990 నాటి స్థాయి కన్నా 25 నుండి 40 శాతానికి తగ్గించుకోవాల్సి ఉంటుందని ఐజిపిసిసి స్పష్టం చేసింది.

పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యవస్థలో మానవాళికి వీలైనంత తక్కువ హాని కల్గించే ఉత్పత్తి పద్ధతులను చేపట్టి పర్యావరణాన్ని, ప్రకృతిని సంరక్షించుకోవాలనే తపన కంటే లాభాలు సంపాదించడమే ప్రధాన ధ్యేయంగా ఉంటుంది. అందువల్లనే పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలు తమ స్వార్థ ప్రయోజనాల కోసం ప్రకృతి వనరులను కొల్లగొట్టే 'ప్రైవేటీకరణ' విధానాన్ని కొనసాగిస్తున్నాయి. దీంతో మానవ సమాజ అవసరాలకు, ఉత్పత్తికి కీలకమైన ఇంధన వనరులు హరించుకు పోతున్నాయి. నేటి పెట్టుబడిదారీ విధానంవల్ల ప్రపంచ ఉత్పత్తిలో 75 శాతం వాటాని పారిశ్రామిక దేశాల్లోని 25 శాతం జనాభా చేజిక్కించు కుంటున్నది.

ప్రపంచ జనాభాలో 4 శాతంగా ఉన్న అమెరికా, 25 శాతం పైగా వాటాను పొందుతున్నది. అమెరికా లాంటి దేశాలు ఎక్కువ ఇంధన వినియోగ అభివృద్ధి నమూనాను అనుసరించడం వల్ల మూడవ ప్రపంచం లోని సగటు వ్యక్తి కంటే 40 రెట్లు ఎక్కువ ఇంధనాన్ని వినియోగిస్తున్నారు. ఇదే సబ్ సహారన్ ఆఫ్రికాతో పోల్చితే 80 రెట్లు ఎక్కువ. అలాగే ఆహారధాన్యాల వినియోగంలో కూడా ఇదే పరిస్థితి కనిపిస్తోంది. దీన్ని బట్టి అర్థమయ్యేదేమంటే వనరుల వినియోగంలో ప్రపంచ ప్రజల మధ్య అసమాన పంపిణీ ఎంతగా ఉన్నదో అర్థమవుతుంది.

స్థూలంగా పరిశీలించినప్పుడు అమెరికా తదితర దేశాల పెట్టుబడిదారీ వినియోగ సంస్కృతే పర్యావరణ వినాశానికి ప్రథమ కారణం అవుతుంది. అందువలన పెట్టుబడిదారీ వ్యవస్థను మార్చకుండా పర్యావరణాన్ని రక్షించుకోవడం సాధ్యం కాదు. ప్రత్యేకించి ప్రకృతి వనరులను ప్రైవేటీకరించే నేటి ప్రపంచీకరణ విధానానికి వ్యతిరేకంగా ఉద్యమాలు సాగాలి. ధనవంతుల భోగ వినియోగతత్వానికి వ్యతిరేకంగా ఉద్యమించాలి. అదే సమయంలో పర్యావరణానికి విఘాతం కల్గించని ప్రకృతి పరిరక్షణకు జవాబుదారీగా నిలిచే ఉత్పత్తి పద్ధతులు, జీవన విధానాలను అవలంబించితేనే మానవాళికి మనుగడ. ఈ ధరిత్రి ప్రజలందరి అవసరాలను తీర్చగలుగుతుంది గాని, వారి అత్యాశలను కాదనే యధార్థాన్ని గమనించి ముందుకు సాగాలి. వీ

ఒరిస్సా, ఛత్తీస్‌ఘడ్‌లలో మావోయిస్టుల పేరిట ఆదివాసులను అడవి నుంచి, భూమి నుంచి, బతుకు నుంచి దూరం చేయడంలో భాగంగానే నారాయణపట్నా ఘటన కూడా జరిగిందని అంటున్నారు **సుధా రామచంద్రన్**

# నారాయణపట్నా వేస్తున్న ప్రశ్నలు

**తూ**ర్పు ఒరిస్సాలోని కోరాపుట్ జిల్లాలోని నారాయణ పట్టణంలో పోలీసుల కాల్పులలో ఇద్దరు ఆదివాసులు చనిపోయారు. మరెందరో గాయపడ్డారు. ఈ ఘటన జరిగి ఆరు వారాలు గడచిపోయినప్పటికీ ఉద్రిక్తత ఇంకా తగ్గలేదు.

ఆదివాసులను అడ్డగోలుగా అరెస్టు చేయడం ఇంకా కొనసాగుతూనే ఉంది. ఇప్పటి వరకు 109 మంది అరెస్ట్ అయ్యారు. వీరిలో కనీసం 12 మంది పిల్లలు ఉన్నారు. వీరిపై మోపిన ఆరోపణలు: నేరపూరిత కుట్ర, అల్లర్లు, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొట్టడం, ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధానికి పూనుకోవడం. ఈ ప్రాంతంలో ఆదివాసుల హక్కుల కోసం చురుకుగా పనిచేస్తున్న 'చాసి మాలియా ఆదివాసి సంఘ్' (సిఎంఎఎస్) కార్యకర్తలను నిర్బంధించడం కోసం పోలీసు, పారా మిలిటరీ దళాలు గాలింపులను తీవ్రతరం చేశాయి.

సిఎంఎఎస్ కార్యకర్తలు అడవుల లోపలికి వెళ్లిపోయి అక్కడ పునఃసంఘటితమవుతున్నారని చెబుతున్నారు. 'పోలీసులు సిఎంఎఎస్ కార్యకర్తలను వేటాడడం, ఆదివాసులను భయపెడుతుండడం వల్ల వాళ్లు మావోయిస్టుల రహస్య నివాసాలైన అడవులలో ఆశ్రయం పొందాల్సి వస్తోంది' అని ఒక సీనియర్ అధికారి 'ఆసియా టైమ్ ఆన్‌లైన్'కి చెప్పారు. 'తమ చర్యలతో పోలీసులు ఆదివాసులను మావోయిస్టులుగా మారేలా చేస్తున్నార'ని అన్నారు.

ఈ పరిణామం ఒక్క నారాయణపట్టణానికే పరిమితమై లేదు. దేశంలోని ఒరిస్సా, ఛత్తీస్‌గడ్, జార్ఖండ్, బెంగాల్, ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన ప్రాంతాలలోని అన్ని గ్రామాలూ, పట్టణాలలో ఇదే పరిస్థితి. ఆదివాసులపై పోలీసుల అత్యాచారాల వల్ల మావోయిస్టులకు మద్దతు పెరుగుతోంది.

భారతదేశంలో దళితుల కంటే కూడ ఆదివాసుల పరిస్థితి మరీ దారుణంగా ఉంది. అధికారిక లెక్కల ప్రకారమే 49.5 శాతం ఆదివాసులు పేదరికంలో మగ్గుతున్నారు. 76.2 శాతం నిరక్షరాస్యులు, 30 శాతం మందికి ఎటువంటి ఆసుపత్రి చికిత్స అందుబాటులో లేదు. వాళ్లని ఒకవైపు వారి భూమి నుంచి తరిమేస్తున్నారు. ఇంకోవైపు పరిశ్రమలలో ఉద్యోగాలు ఇవ్వనిరాకరిస్తున్నారు. తమకు మిగిలి ఉన్న ఏకైక వనరు అయిన భూమిని కాపాడుకోవడానికివాళ్లు పోరాడుతున్నారు.

ఆదివాసుల సమస్యల పరిష్కారంలో శాంతియుత పోరాటాలు, ప్రజాస్వామిక సంస్థలు దారుణంగా విఫలమయ్యాయి. న్యాయం జరుగుతుందన్న భావన కూడా లేకుండా పోయింది. దాంతో భారతదేశ ప్రజాస్వామ్యంలో ఆదివాసుల పరాయీకరణ తీవ్రతరమవుతోంది. ఆదివాసుల ఈ కోపాగ్ని, పరాయీకరణలతో మావోయిస్టులకు మద్దతు, కొత్తగా చేరే సభ్యులు లభిస్తున్నారు.

భారతదేశంలో మావోయిస్టులు సామాజిక, ఆర్థిక మార్పునకు సాయుధ పోరాటం ద్వారా రాజ్యాన్ని కూలదోయడం ఒక్కటే మార్గమని నమ్ముతారు. అనేకమంది ఆదివాసులు తాము హింసకు వ్యతిరేకమని చెబుతారు. అయితే రాజ్యమూ, దాని పోలీసు, పారామిలిటరీ దళాల హింసను ఎదుర్కోడానికి తుపాకులు చేపట్టడం తప్పించి మరొక మార్గం ఆదివాసులకు కనపడడం లేదు. చాలామంది గిరిజనులు ఇప్పటికీ ప్రజా రాజకీయాలు, ఉద్యమాలలో పాల్గొంటున్నారు. అయితే రాజ్యమే వారిని మావోయిస్టుల వైపు, సాయుధ పోరాటం వైపు నెడుతోంది.

ఆదివాసుల ఆందోళనలను మావోయిస్టులు బలపరచడానికీ, మద్దతు ఇవ్వడానికీ తరచు ముందుకు రావడంతో మావోయిస్టుల సాయుధ పోరాటానికీ, ఆదివాసుల రాజకీయ ఉద్యమాలకూ మధ్య అంతరం క్రమేపీ అంతరించిపోతోంది. ఆదివాసులను దోపిడీకి గురిచేసే వాళ్లు, వేధించే వాళ్లు – భూస్వాములు, పోలీసులు, వడ్డీ వ్యాపారస్తులు – ప్రధానంగా మావోయిస్టుల హింసకు లక్ష్యంగా ఉన్నారు.

ఆదివాసుల సమస్యల పరిష్కారంలో ప్రభుత్వం విఫలం కావడం వల్లనే దేశంలో మావోయిస్టులు బలం పుంజుకోవడానికీ, వాళ్ల ప్రభావం పెరగడానికీ కారణం అవుతోందని విశ్లేషకులు సూచిస్తున్నారు. అయితే రాజ్యం మాత్రం ఆయుధ శక్తితో మావోయిస్టులను నిర్మూలించడం ద్వారా సమస్యను పరిష్కరించవచ్చని భావిస్తోంది.

మావోయిస్టులను నిర్మూలించే ఉద్దేశంతో మహరాష్ట్ర, ఛత్తీస్‌గడ్, ఒరిస్సా అడవులలో ఇటీవల పెద్ద ఎత్తున సాయుధ దళాలను మోహరించారు. ఇప్పటికే 80,000 సైనికులు ఈ ప్రాంతంలో ఉండగా రానున్న కొన్ని వారాలలో మరో 20,000 మంది రానున్నారు. ఈ ప్రాంతంలోని 20 లక్షల మందిని – వారిలో సగానికి పైగా ఆదివాసులను ఎదుర్కోడానికి ఈ బలగాలను దించారు.

ఈ యుద్ధ భూమికి చాలా దూరంగా ఉన్న అధికారులు విజయం తథ్యం అన్న ఆత్మవిశ్వాసంతో ఉండగా, స్థానిక అధికారులలో ఏ మాత్రం ఆశ లేదు. మావోయిస్టు వ్యతిరేక అణచివేత పెరగడంతో ఇప్పటికే పరాయీకరణకు గురయిన ఆదివాసులలో ఇది మరింత తీవ్రతర మవుతుందని భావిస్తున్నారు.

సిఎంఎఎస్ పెరిగి, బలం పుంజుకుని నారాయణపట్టణాన్ని హస్తగతం చేసుకుంటారు' అని ఒక కోరాపుట్ అధికారి హెచ్చరిస్తున్నారు.

సిఎంఎఎస్ కార్యకర్తలు హింసకు, 'ప్రజా వ్యతిరేక కార్యక్రమాలకు' పాల్పడుతున్నారు కాబట్టి వాళ్లని నిర్బంధిస్తున్నామని పోలీసు అధికారులు పేర్కొంటున్నారు. అయితే, ఈ ప్రాంతంలోని సంపన్న వర్గాల ప్రయోజనాలను కాపాడడం కోసమే ఆదివాసుల సంఘంపై పోలీసులు విరుచుకుపడుతున్నారన్న భావన బలంగా ఉంది.

గిరిజనేతర భూస్వాములూ, వడ్డీ వ్యాపారస్తులూ తమ నుంచి చట్ట విరుద్ధంగా తీసుకున్న భూములను తిరిగి పొందడానికి ఆదివాసులను సిఎంఎఎస్ సమీకరిస్తోంది. ఇప్పటి వరకు 800 హెక్టార్ల భూమిని ఈ విధంగా తిరిగి స్వాధీనం చేసుకోవడంలో అది విజయవంతం అయ్యింది. దీంతో గిరిజనేతర భూస్వాములు సహజంగానే ఆందోళనకు గురయ్యారు. సిఎంఎఎస్ బలం పుంజుకోవడం మైనింగ్ కంపెనీలు, సారా మాఫియాలలో వణుకు పుట్టిస్తోంది.

సిఎంఎఎస్ వంటి ఆదివాసీ సంఘాలను ఎదుర్కోవడం కోసం కోరాపుట్, మల్కన్‌గిరి ఇతర జిల్లాల్లో శాంతి సంఘాలను ఏర్పాటు చేయడం వెనక ప్రైవేట్ గనుల కంపెనీలు, సారా మాఫియా, భూ ఆక్రమణదారులు, కాంట్రాక్టర్లు ఉన్నారు.

ఒరిస్సాలో ఖనిజ సంపద దండిగా ఉంది. భారతదేశంలోని మొత్తం బాక్సైట్ నిల్వలలో (ప్రపంచంలో ఇది ఆరవ స్థానంలో ఉంది) 70 శాతం, క్రోమ్, నికెల్ ఖనిజాలలో 90 శాతం, బొగ్గులో 24 శాతం ఒరిస్సాలోనే ఉన్నాయి. కానీ ఖనిజ నిల్వలు దండిగా ఉన్న ప్రాంతంలో ఆదివాసులు ఉంటున్నారు. ఈ సంపదను దోచుకోవడానికి దేశ, బహుళజాతి మైనింగ్ కంపెనీలు బారులుతీరి ఉన్నాయి. అయితే వీటికి ఆదివాసుల ఆందోళనలు, మావోయిస్టుల హింస అడ్డంకిగా ఉన్నాయి.

సిఎంఎఎస్, ఇతర ఆదివాసీ సంఘాలను బలహీనపరచడానికి శాంతి సంఘాలకు మైనింగ్ కంపెనీలు నిధులను కుమ్మరిస్తున్నాయని కోరాపుట్‌లోని అభిజ్ఞ వర్గాల భోగట్టా.

'సిఎంఎఎస్ వంటి సంఘాలు భూమిని, పంటలను బలవంతంగా దోచుకోకుండా ఉండడానికి' తాము స్వచ్ఛందంగా ముందుకు వచ్చామని కోరాపుట్ మల్కన్‌గిరిలలోని శాంతి సంఘ సభ్యులు చెబుతున్నారు. అయితే ఇవి ఏర్పడడం వెనక స్థానిక ప్రభుత్వ అధికారుల పాత్ర ఉన్నట్టు కనబడుతోంది.

అంతేకాదు, శాంతి సంఘాల కార్యకలాపాలను కూడా ప్రభుత్వం సమర్థిస్తోంది. ఆదివాసీ కార్యకర్తలపై దాడులు, వారిని చంపడం వంటి వాటికి శాంతి సంఘాలు పూనుకుంటున్నాయి. నారాయణ పట్టణంలో నవంబర్‌లో జరిగిన పోలీస్ కాల్పుల ఘటనపై స్వతంత్ర నిజ నిర్ధారణ కమిటీలోని సభ్యులను శాంతి సంఘ సభ్యులు కొట్టారు. అయినప్పటికీ శాంతి సంఘంపై ఎటువంటి చర్యా తీసుకోలేదు.

కోరాపుట్ డిఎస్‌పి పి.కె. సాహ్ని శాంతి సంఘాల కార్యక్రమాలు 'శాంతియుతంగా, చట్టబద్ధంగా, ప్రజాస్వామికంగా ఉన్నాయ'ని కితాబిచ్చారు. 'దాని సభ్యులు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడం లేదు. కాబట్టి వాళ్లపై ఎటువంటి కేసులూ నమోదు చేయలేదు.'

శాంతి సంఘాల కార్యక్రమాలను చూసి చూడనట్లు వదిలేస్తున్న పోలీసులు ఇందుకు విరుద్ధంగా సిఎంఎఎస్ పట్ల కఠిన వైఖరి అవలంబిస్తున్నారు. ఈ సంస్థను నిషేధించాల్సిందిగా కోరాపుట్ పోలీసులు కోరుతున్నారు.

ఆదివాసుల నుంచి లాక్కున్న భూమిని తిరిగి పొందడానికి సిఎంఎఎస్ చేపట్టిన ఉద్యమం చట్ట విరుద్ధమైనదేమీ కాదని కోరాపుట్‌లోని స్వచ్ఛంద సంస్థల కార్యకర్తలు పేర్కొంటున్నారు. తమ పూర్వీకుల భూమిపై ఆదివాసులకు ఉన్న హక్కును ఒరిస్సా ప్రభుత్వం గుర్తించి ఆదివాసీయేతర ప్రజలకు భూమి బదిలీ కావడాన్ని నిషేధించింది. న్యాయం కోసం ఆదివాసులు పెట్టుకున్న అర్జీలను ప్రభుత్వం పెడచెవిన పెట్టినందువల్ల సిఎంఎఎస్ బలప్రయోగంతో వీటిని స్వాధీనం చేసుకోవాల్సి వస్తోంది.

సిఎంఎఎస్ ఇప్పటివరకు రాజకీయ ఉద్యమంగా ఉంది. ఆదివాసుల హక్కుల కోసం అది ఆదివాసులను సమీకరిస్తూ ఆందోళనలు, ఉద్యమాలకు పూనుకుంటోంది. దాని కార్యకర్తలను వేధిస్తూ, అరెస్టులు చేస్తూ, దానిని నిషేధించాలని కోరుతున్న స్వార్థ పరశక్తులూ, వారి ప్రయోజనాలను కాపాడే పోలీసులూ వారిని రహస్య కార్యకలాపాల వైపు నెడుతున్నారు.

ఒరిస్సాలో జరుగుతున్న దానికీ, పక్కన ఛత్తీస్‌గఢ్‌లో వివాదాస్పద 'సల్వాజుడుం'కీ మధ్య చాలా పోలికలు ఉన్నాయి. ఒరిస్సాలో మాదిరే ఛత్తీస్‌గఢ్‌లోని దక్షిణాది జిల్లాలైన బస్తర్, దంతెవాడలలో ఖనిజాలు దండిగా ఉన్నాయి. ఒరిస్సాలో మాదిరిగానే ఇక్కడ కూడా తమ భూములను ప్రభుత్వాలు, ప్రైవేట్ మైనింగ్ కంపెనీలు తీసుకోవడాన్ని వ్యతిరేకిస్తున్న ఆదివాసులు ఉంటున్నారు.

మావోయిస్టులకు వ్యతిరేకంగా ఆదివాసులతో ఏర్పడిన ఈ బృందాలకు ప్రభుత్వం ఆయుధాలను సమకూర్చింది. మైనింగ్ కంపెనీలు, సారా మాఫియాలు నిధులు సమకూరుస్తున్నాయి. ఇవి 2005 నుంచి బస్తర్, దంతేవాడలలో విధ్వంసాన్ని సృష్టిస్తున్నాయి. సల్వాజుడుంతో ఆరంభమైన హింస - ప్రతిహింస చక్రాలలో వేలాది ఆదివాసులు తమ భూములను విడిచిపెట్టి వెళ్లారు. దీనంతటికీ డబ్బులు సమకూరుస్తున్న మైనింగ్ కంపెనీలు, భూస్వాముల ప్రధాన ఉద్దేశం ఇదే.

ఒరిస్సాలోని శాంతి సంఘాలు కూడా ఖనిజాలు దండిగా ఉన్న కోరాపుట్, ఇతర ప్రాంతాలలో ఇదేదిశగా పనిచేస్తున్నాయి. మావోయిస్టుల పేరుతో చేపడుతున్న మిలిటరీ చర్యల నేపథ్యంలో పోలీసులు, మైనింగ్ కంపెనీలు, సారా మాఫియాలు, భూస్వాములు ఆదివాసులను వారి భూముల నుంచి తొలగించగలుగుతున్నారు. 'మావోయిస్టు హింస'ను వ్యతిరేకించడం వెనకనున్న అసలు ఉద్దేశం ఇదే.

మల్కన్‌గిరిలో పనిచేస్తున్న ఆదివాసీ కార్యకర్తలతో ఆసియా టైమ్ ఆన్‌లైన్ మాట్లాడింది. తాము సాయుధ పోరాటంలో కాక ప్రజా రాజకీయాలలో ఉన్నామని, బహిరంగంగా పని చేస్తున్నామని, తాము మావోయిస్టులం కామని వాళ్లు చెప్పారు. అయితే ఈ తేడాను కావాలనే పోలీసులు విస్మరిస్తున్నారు. పారా మిలిటరీ దళాలు గ్రామాలకు చేరుకున్నప్పుడు మావోయిస్టులతో, ఆదివాసులతో ఒకే రకంగా వ్యవహరిస్తాయని తేటతెల్లం చేశాయి. భారతదేశ ఆదివాసీ ప్రాంతాలు రక్తపాతాన్ని చూడనున్నాయి.

*(తెలుగుసేత : కె. సురేష్)*

*అమెరికాలో ఆర్థిక మాంద్యం సృష్టించిన సునామిలో లక్షలాది మంది ఉద్యోగాలు కోల్పోయి అవస్థ పడుతుంటే, కొద్దిమంది చేతుల్లో సంపద పోగుపడడమే సంక్షోభానికి అసలు కారణమని అంటున్నారు* **ఇ.ఎస్. బ్రహ్మాచారి**

# సామాన్యుల సంక్షోభం - సంపన్నుల సంక్షేమం

ఫిబ్రవరి 2010లో ఇంతకుముందు ఇతరులు తీయని లెక్కలు చూపుతూ ఒక నివేదిక వెలువడింది. అది ఆదాయ వర్గాల వారీగా అమెరికా నిరుద్యోగాన్ని విశ్లేషించింది. ఇదే ఫిబ్రవరిలో బ్యూరో ఆఫ్ లేబర్ స్టాటిస్టిక్స్ నివేదిక జనవరిలో పోయిన 20 వేల ఉద్యోగాలగురించి చెప్పడంతోపాటు 2009 మొత్తంలో పోయిన వాటిని సవరించింది. వివరాల్లోకి పోతే సామాన్యుడు దిమ్మర పోవలసిందే. అమెరికాలో 2008లో మొత్తం 36 లక్షలా 23 వేల ఉద్యోగాలు పోయాయి. అంతకుమించి 2009లో 47 లక్షలా 81 వేల ఉద్యోగాలు పోయాయి. తొలి అంచనాలని బట్టి ఆ రెండేళ్లలో పోయినవి 72 లక్షలనుకున్నారు. అయితే 2009 ఫిబ్రవరి 5న బ్యూరో ఆఫ్ లేబర్ స్టాటిస్టిక్స్ (బి.ఎల్.ఎస్.) ఉద్యోగ నివేదిక వచ్చాక మరో 12 లక్షలు పెరిగి 84 లక్షలయ్యాయి. ఇవన్నీ మళ్లీ వస్తాయనే నమ్మకం ఎవ్వరికీ లేదు. చాలావరకూ శాశ్వతంగా పోయినట్లే.

2007 డిసెంబర్‌లో ఉద్యోగాలు పెరిగి 13 కోట్లా 82 లక్షలయ్యాయి. ఇదే శిఖరస్థాయి. దీంతో 3 సంవత్సరాలుగా సాగుతున్న ఉద్యోగ వృద్ధి వెనక్కి తిరిగింది. ఆ మూడేళ్లలో 54 లక్షల కొత్త ఉద్యోగాలు వచ్చాయి. అక్కడ నుంచి మాంద్యం. కొన్ని దశాబ్దాలుగా ఉద్యోగాలు తగ్గని పరిశ్రమల్లో కూడా పోయాయి.

గడచిన మూడు దశాబ్దాలలో అమెరికాలో మూడుసార్లు ఉద్యోగాలు తగ్గాయి. 1981 ఆగస్ట్ తర్వాత 1982 డిసెంబర్ వరకూ 28 లక్షల ఉద్యోగాలు తగ్గాయి. 1990-91 మాంద్యం వల్ల 11 నెలల్లో 16 లక్షలు తగ్గాయి. 2001 మాంద్యం మూలంగా 30 నెలల్లో 27 లక్షలు పోయాయి. ఈ మాంద్యం ఫలితంగా 24 నెలల్లో అంతకు మూడింతలు 84 లక్షలు పోయాయి. 2008 లో మొత్తం 36 లక్షలు పోయాయి. ఈ లెక్కలు 1938లో మొదలయ్యాయి. అప్పటికదే ఎక్కువ. 2009లో దాన్ని మించి ఇంచుమించు 48 లక్షలు పోయాయి. అంటే నెలకి సగటున 4 లక్షలు.

2007 డిసెంబర్‌లో మాంద్యం మొదలైనప్పుడు నిరుద్యోగులు 77 లక్షల మంది. 2009 డిసెంబర్‌లో 1 కోటీ 53 లక్షల మందయ్యారు. అంటే 76 లక్షలు పెరిగారు. ఇంచుమించు రెండింతలయ్యారు. అప్పుడు నిరుద్యోగం రేటు 5 శాతం. ఇప్పుడు రెట్టింపై 10శాతానికి చేరింది. 27 వారాలు/ ఆపైనా ఉద్యోగాలు లేనివాళ్లు(దీర్ఘకాల నిరుద్యోగులు) 61 లక్షల మంది ఉన్నారు. పార్ట్ టైం పనివాళ్లు 92 లక్షలమంది. టీనేజ్ వాళ్ల నిరుద్యోగం 27.1 శాతం. నల్లజాతీయులకి 16.2 శాతం. తెల్లవాళ్లకి 9 శాతం. పార్ట్ టైం వాళ్లనీ, పనులకోసం ప్రయత్నించి, దొరకవని వెతకటం మానుకున్నవాళ్లనీ కలిపితే నిరుద్యోగం రేటు- 17.3 శాతం

ఈ వివరాలన్నీ నెలనెలా వచ్చే బ్యూరో ఆఫ్ లేబర్ స్టాటిస్టిక్స్ నివేదికల్లో లభిస్తాయి. ఇతర రిపోర్ట్‌లలోనూ కొన్ని ఉంటాయి. ఉద్యోగాలు పోయిన వారిలో స్త్రీలెందరో, పురుషులెందరో వివరాలుంటాయి. ఏ జాతి వారికి ఎన్ని పోయాయో, ఏయేవయసు వారికి ఎన్నెన్ని పోయాయో కూడా నివేదికల్లో ఉంటుంది. అవి చూసి చాలామంది బాధితులంతా సమంగా ఇబ్బందులు పడుతున్నారని అనుకుంటారు. అంటుంటారు. ఇది తప్పు అని ఫిబ్రవరిలో విడుదలైన ఒక అధ్యయనం కుండబద్దలు కొట్టినట్లు చెప్పింది. ఆదాయ వర్గాలని బట్టి నిరుద్యోగశాతం మారుతుందని రుజువు చేసింది.

బోస్టన్‌లోని నార్త్ ఈస్టర్న్ యూనివర్సిటీలో సెంటర్ ఫర్ లేబర్ మార్కెట్ స్టడీస్‌కి చెందిన ఆండ్రూ సం, ఈశ్వర్ ఖటివాడా, శీలా పామా అనే ముగ్గురు ఈ కార్యక్రమంలో కృషి చేశారు. మిచిగన్ సి.చిస్. మాట్ ఫౌండేషన్ కోసం ఈ నివేదికను తయారు చేశారు.

శ్రామికుల్ని ఆదాయాన్ని బట్టి 10 వర్గాలుగా విడగొట్టారు. ఆయా వర్గాల వారీగా 2009 నాలుగో క్వార్టర్లో నిరుద్యోగ పరిస్థితుల్ని పరిశీలించారు. అట్టడుగు విభాగం (ఏడాదికి 12,449 డాలర్లూ, అంతకు తక్కువ ఆదాయం ఉన్నవాళ్లూ) లో నిరుద్యోగం 30.8 శాతం. చాలీచాలని ఉద్యోగాల వాళ్లు 20.7 శాతం. దానిపైన రెండవ వర్గం (12,500-20000 డాలర్ల ఆదాయం ఉన్న వాళ్లు) లో నిరుద్యోగం 19.1 శాతం. కాగా చాలీచాలని ఉద్యోగులు 17.2 శాతం.

వీళ్ల పరిస్థితులు ఎంతో హీనంగా ఉన్నాయి. అదే పైనున్న తొమ్మిదవ వర్గం (లక్ష నుంచి లక్షా 49 వేల ఆదాయమొచ్చేవాళ్ల) లో ఉద్యోగాలు లేనివాళ్లు నాలుగు శాతం మాత్రమే. చాలీ చాలని ఉద్యోగాల వాళ్లు 2.5 శాతం. పై పదవ వర్గం (లక్షా 50 వేలు ఆపైనా ఆర్జించే వాళ్లు) లో కేవలం 3.2 శాతం మాత్రమే. చాలీ చాలని ఉద్యోగాల వాళ్లు 1.6 శాతం.

మధ్యతరగతి వాళ్లూ మాంద్య కాలంలో భారీగా దెబ్బతిన్నారు. అయితే పైరెండు వర్గాలకు చెందిన పెద్ద ఆదాయపరులు దాదాపు దెబ్బతిననట్లే. ఈపట్టికలో అన్ని వివరాలూ ఉన్నాయి.

పై వర్గాలకి పూర్తిస్థాయి ఉద్యోగిత ఉండగా, అడుగు రెండు వర్గాలకీ శ్రమ మార్కెట్ సంక్షోభం ఉంది. మధ్యలో ఉన్న వాళ్లకి శ్రమ

మార్కెట్ మాంద్యం ఎక్కువగా ఉంది. అమెరికా సంపన్నులకి శ్రమ మార్కెట్ మాంద్యం లేదు అని నిర్ధారించింది అట్టడుగు వాళ్ల నిరుద్యోగం 1930ల మహా సంక్షోభంలో ఉన్న దానికంటే 5 శాతం పాయింట్లెక్కువ.

నిరుద్యోగుల్నీ, చాలీచాలని ఉద్యోగుల్నీ, శ్రామికుల జాబితాలో లేనివాళ్లనీ కలిపి లెక్కిస్తే అట్టడుగు వర్గం నిరుద్యోగం 50 శాతం పైన్నే ఉంటుంది. రెండో దానికి 37.6, మూడో దాంట్లో 17.1, నాలుగో దాంట్లో 15 శాతం. ఇక పై వర్గానికి 6.1 శాతం మాత్రమే. రిజర్వ్ శ్రామికులు అట్టడుగు వర్గంలో 9.9 శాతం కాగా పై దాంట్లో 1.4 మాత్రమే. ఈ తేడాల్ని స్పష్టంగా ఎత్తి చూపిందీ నివేదిక.

ఒక పక్క ఇంతటి దారిద్ర్యం గూడు కట్టుకుంటుండగా మరో వైపు అపార సంపద కూడుతోంది. సంపన్న దేశాల్లో ఆర్థిక అసమానతలు అమెరికాలోనే ఎక్కువ. అంతేకాదు వేగంగా పెరుగుతున్నాయి కూడా. గడచిన 20-30 ఏళ్లలో ఎక్కువ భాగం ఆదాయం పైవర్గాలకే చెందుతోందని తిమోతీ స్మీడింగ్ రాశాడు. 2007 జనాభా లెక్కల్ని బట్టి 20 శాతం కుటుంబాలకి మొత్తం ఆదాయంలో 3.4 శాతం వస్తోంది. పై 20 శాతానికి 49.7 శాతం ఆదాయం చేరుతోంది. 1940- 1980 కాలంలో పై 10 శాతం మందికి మొత్తం ఆదాయంలో 30-35 శాతం పోయేది. ఇప్పుడు 45-50 శాతం పోతోంది.

2009లో ప్రపంచంలో 703 మంది 100కోట్ల డాలర్ల ఆస్తిపరులున్నారు. 2010 లో 1011 కి పెరిగారు. అమెరికా విషయానికొస్తే 2009 లో ఉన్న 359 మందికి మరో 44 మంది కలిసి 403 మంది అయ్యారు. 2009లో వాళ్లందరి సంపద ఒక లక్షా 10 వేల కోట్లయితే 2010 లో ఒక లక్షా 30 వేలకోట్లని తాకింది. ఈమొత్తం దేశఆస్తిలో 8 శాతం. జనాభాలో వీళ్లు 0.00014 శాతం మాత్రమే. ఒక్కొక్కడు సగటు అమెరికా నివాసి కంటే 30 కోట్ల రెట్ల ఆస్తి గుప్పెట్లో పెట్టుకొని ఉన్నాడు. దీన్నిబట్టి అసమానతలు అమెరికాలో ఏస్థాయిలో పెరుగుతున్నాయో తెలుస్తుంది.

అసమానతలు అమెరికాలో ఏ స్థాయిలో పెరుగుతున్నాయో తెలుస్తుంది. ఈ మాంద్యంలో అసమానతలు మరీ వేగంగా పెరుగుతున్నాయి. ఇంతటి అసమానతలు రాబోయే సామాజిక అస్థిరత్వానికి సూచికలు.

ఈ సమస్య దానికదే సమసిపోయేది కాదు. ఒబామా వాళ్ల బతుకుల్ని సరిదిద్దినట్లు అనిపించలేదు. వాళ్ల బాధలు రోజురోజుకీ ఎక్కువవుతున్నాయే తప్ప ఏమాత్రం వెనక్కి తిరగలేదు. అందుకే 2010 ఫిబ్రవరి 17 న బయటపెట్టిన సి.ఎన్.ఎన్ పోల్‌లో ఒబామా 2014లో రెండోసారి పోటీకి అర్హుడేనని 44 శాతం మాత్రమే చెప్పారు. 52 శాతం తగదన్నారు. ఇంతేకాలంలో ఇంత తక్కువ ఏ అధ్యక్షునికి లేదు. 1938 నుంచీ ఈ పోల్ తీస్తున్నరు.

మసాచూసెట్స్ డెమొక్రటిక్ సెనేటర్ టెడ్ కెనెడీ చనిపోయిన కారణంగా జనవరి 2010లో ఎన్నిక జరిగింది. అందులో ఒబామా పార్టీ అభ్యర్థి ఓడిపోయాడు. ఆ స్థానం 47 సంవత్సరాల దీర్ఘకాలం డెమొక్రట్ల చేతిలో ఉంది. అధ్యక్ష ఎన్నికల్లో ఒబామాకి 26 పాయింట్లు తెచ్చిన రాష్ట్రం అది. అక్కడ ఆయనకి దాదాపు 8 లక్షల మెజారిటీ వచ్చింది. ఇప్పుడు లక్షకి పైచిలుకు మెజారిటీతో వీళ్లని రిపబ్లికన్ బ్రౌన్ ఓడించాడు. ఒబామా పోయి ప్రచారం చేసినా పరువు నిలవలేదు.

యువకులు ఆయన గెలుపుకోసం సర్వశక్తులూ ఒడ్డి ప్రచారం చేసారు. అలాంటి టీనేజర్ల నిరుద్యోగం రేటు 2009 చివరలో 27.1 శాతం. మరిక ఆయన పాలన మీద నమ్మకం సడలక ఏమవుతుంది?

జె.పి మోర్గాన్ చేజ్ కంపెనీ సి.ఇ.ఒ.కి 1 కోటీ 70 లక్షల డాలర్ల బోనస్ ఇచ్చారు. గోల్డ్‌మన్ శాచ్స్ సి.ఇ.ఒ. కి 90 లక్షలిచ్చారు. దీన్ని ఒబామా దృష్టికి తీసుకుపోగా, ప్రపంచ పోటీలకు చేరని బేస్‌బాల్ ఆటగాళ్లు కొందరు అంతకాన్నా ఎక్కువే పొందుతున్నారన్నాడు. ఇది స్వేచ్ఛా వాణిజ్యంలో ఉండేదేనన్నాడు.

| ఆదాయ వర్గం (మొత్తం పది) | ఆదాయం డాలర్లలో | 2009 నాలుగో క్వార్టర్‌లో నిరుద్యోగ శాతం | చాలీచాలని ఉద్యోగాల శాతం | రిజర్వ్ శ్రామికుల శాతం |
|---|---|---|---|---|
| అట్టడుగు | 12,499/ ఆలోపు | 30.8 | 20.7 | 9.9 |
| రెండు | 12,500 - 20,000 | 19.1 | 17.2 | 6.3 |
| మూడు | 20,000 - 29,999 | 15.3 | 12.7 | 3.0 |
| నాలుగు | 30,000 - 39,999 | 12.2 | 8.3 | 3.7 |
| అయిదు | 40,000 - 49,999 | 9.0 | 6.1 | 3.0 |
| ఆరు | 50,000 - 59,999 | 7.8 | 5.4 | 2.6 |
| ఏడు | 60,000 - 75,000 | 6.4 | 4.4 | 1.9 |
| ఎనిమిది | 75,000 - 99,999 | 5.0 | 3.6 | 1.7 |
| తొమ్మిది | 100,000 - 149,999 | 4.0 | 2.5 | 1.5 |
| పది | 150,000/ ఆపైన | 3.2 | 1.6 | 1.4 |

ఈ అడుగు జనానికి పనులు కల్పించలేకపోయాడు. పగ్గాలు పట్టినప్పటినుంచీ నెలనెల భారీగా ఉద్యోగాలు పోయాయి. ఉద్యోగాలు కొన్ని కల్పించినట్లూ, కొన్ని పోకుండా కాపాడినట్లూ చెప్పుకుంటున్నాడు. కాని ప్రజలు 84 లక్షల ఉద్యోగాలు పోయాయనీ ఇంకాపోతాయనీ భయంతో ఉన్నారు. ఇందుకోసం ఒబామా సరైన చర్యలు తీసుకోలేదనే అభిప్రాయం రోజురోజుకీ బలపడుతోంది. అందుకే ఆయన రేటింగ్ తగ్గుతోంది. సరిగ్గా ఏడాది క్రితం 2009 ఫిబ్రవరి 17న నూటికి 76 మంది ఆయనకు అనుకూలంగా ఉన్నారు. మరిప్పుడేమో నూటికి 44 మంది మాత్రమే 2014 లో పోటీకి మద్దతు పలికారు. నూటికి 52 మంది రెండోసారి అధ్యక్ష స్థానానికి తగినవాడు కాడని తేల్చారు. ఒక్క ఏడాదిలో ఎంత మార్పు!

కార్పొరేట్ల గుప్పెట్లో ఉండే పాలకులు సామాన్యులకి ప్రయోజనం చేకూర్చే చర్యలు చేపట్టారు. బుష్ ఎంతో ఒబామా అంతే. రిపబ్లికన్లెంతో డెమొక్రాట్లూ అంతే. బుష్‌ని దించి ఒబామాని కూర్చోబెడితే ఏమయిందో రేపు ఒబామాని దింపి మరొకర్నెక్కించినా అదే అవుతుంది. కార్మికులకి తమ శ్రమ ఫలితం దక్కే ఆర్థికవ్యవస్థ రానిదే పరిస్థితులు మెరుగుపడవు. కనుక వాళ్లు ఏకం కావలసింది ఒకళ్లని ఎక్కించడానికో ఇంకొకళ్లని దించటానికో కాదు. తమ శ్రమ ఫలం తాము దక్కించుకోటానికి.

రిపోర్ట్ ఇక్కడ దొరుకుతుంది http://www.clms.neu.edu/publication/documents/Labor_Underutilization_Problems_of_U.pdf

*బ్యాంకుల జాతీయికరణ జరిగి నాలుగు దశాబ్దాలు గడిచినా ఇన్‌క్యాడర్‌లో రిజర్వేషన్‌లు అమలు చేయకపోవడం రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధమని అంటున్నారు* **ఆస శ్రీరాములు**

# బ్యాంకింగ్‌లో అమలు కాని రిజర్వేషన్‌లు

దేశంలో బ్యాంకింగ్ రంగంలో పనిచేస్తున్న ఉద్యోగులకు ప్రమోషన్‌లలో రిజర్వేషన్‌లు నేటికీ అమలు జరగలేదు. అయితే డిసెంబర్ 9, 2009న మద్రాస్ హైకోర్ట్ బ్యాంకుల్లో పనిచేస్తున్న వారికి స్కేల్ 7 వరకు ప్రమోషన్‌లు (పదోన్నతులు) కల్పించాలని ఆదేశించింది. ఇది బ్యాంకింగ్ రంగంలో పనిచేస్తున్న ఎస్.సి., ఎస్.టి.,లకు ఊరట కల్పిస్తుంది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కేంద్ర ప్రభుత్వ, రాష్ట్ర ప్రభుత్వ శాఖల్లో పనిచేస్తున్న ఎస్.సి., ఎస్.టి. ఉద్యోగులకు వారు పనిచేస్తున్న సంస్థల్లో ఇన్ క్యాడర్ ప్రమోషన్‌లలో రిజర్వేషన్‌లు పాటించాలి.

కాని దేశంలోని బ్యాంకులకు వచ్చే వరకు అది అమలు జరగడం లేదు. ఇప్పటి వరకు ప్రమోషన్‌లు పొందిన వారు స్వయంగా తమ కృషి వల్లనే పొందగలిగారు.

ప్రైవేట్ సంస్థలుగా ఉన్న బ్యాంకులను 1969లో 29 బ్యాంకులను అంటే దేశంలోని అతి పెద్ద బ్యాంకులుగా ఉన్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాని అనుబంధ బ్యాంకులతో సహా అప్పటి ప్రధానమంత్రి ఇందిరాగాంధీ జాతీయికరణ చేశారు. నిజానికి 1969 నుండి బ్యాంకింగ్ రంగంలో పనిచేస్తున్న ఎస్.సి., ఎస్.టి. ఉద్యోగులకు ప్రమోషన్‌లలో రిజర్వేషన్‌లు కల్పించవల్సి ఉంది. కాని అవి అమలు జరగలేదు.

అప్పటికే ప్రైవేట్‌గా ఉన్న బ్యాంకులు ఒకొక్కరు ఒకొక్క విధంగా ప్రమోషన్ పాలసీని ఏర్పాటు చేసుకొని కొనసాగించారు. అప్పటి వరకు ఎస్.సి., ఎస్.టి.లు బ్యాంకింగ్ రంగ ఉద్యోగాలలో చాల తక్కువ మంది ఉన్నారు.

ఎమర్జెన్సీ కాలంలో 1974-75 కాలం నుండి దేశంలో ఎస్.సి., ఎస్.టి.లను ప్రత్యేక నియామకాల ద్వారా కేంద్ర ప్రభుత్వ శాఖలో, కేంద్ర ప్రభుత్వ అనుబంధ శాఖల్లో, రాష్ట్ర ప్రభుత్వ శాఖలో ఉద్యోగ నియామకాలు చేపట్టారు. అప్పుడు బ్యాంకింగ్ రంగంలోకి కొంతమేర ఎస్.సి., ఎస్.టి.లు క్లర్క్ (గుమాస్తా) లుగా వచ్చారు. కాని వారికి ఉద్యోగాల్లో రిజర్వేషన్ కల్పించాలని ఉద్యోగ సంఘాలు కేంద్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాయి.

ప్రస్తుతం దేశంలోని జాతీయికరణ చేసిన బ్యాంకుల్లో అంటే స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్, ఆంధ్రా బ్యాంక్, సిండికెట్ బ్యాంక్, సెంట్రల్ బ్యాంక్, యూకో బ్యాంక్, పంజాబ్ నేషనల్ బ్యాంక్, ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్, యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్రలతో పాటు 29 బ్యాంకులు ఉన్నాయి. వీటిల్లో సుమారు రెండు లక్షలకు పైగా ఎస్.సి., ఎస్.టి. ఉద్యోగులు వివిధ స్థాయిల్లో పనిచేస్తున్నారు. పని చేస్తున్న వారిలో క్లాస్ డి అంటే అటెండర్, క్లర్క్‌ల స్థాయి వారు అధికంగా ఉన్నారు. ఒక్క ఎస్.బి.ఐ. లోనే సుమారు యాభై వేల మంది ఉద్యోగులు ఉన్నారు.

బ్యాంకుల్లో పని చేస్తున్న వారికి ప్రమోషన్‌లలో రిజర్వేషన్‌లు కల్పించాలని కేంద్ర ప్రభుత్వాన్ని ఎస్.సి., ఎస్.టి. ఉద్యోగ సంఘాలు కోరాయి.

బ్యాంకులన్నింటినీ సమన్వయపరిచే ఇండియన్ బ్యాంక్స్ అసోసియేషన్ (ఐబిఏ) కేంద్ర ప్రభుత్వంతో జరిపిన చర్చలలో సఫలం కాకపోవడంతో ఐదు బ్యాంకుల ఎస్.సి., ఎస్.టి. ఉద్యోగ సంఘాల వారు యూకో బ్యాంక్, సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, కెనెరా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్, యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వారు మద్రాస్ హైకోర్టులో కేసు వేశారు. కేంద్ర ప్రభుత్వం అమలు చేస్తున్న రిజర్వేషన్‌లు బ్యాంకింగ్ రంగంలో అమలు చెయ్యాలని 1990లో కేసు వేశారు.

రకరకాల వాదనలు విన్న మద్రాస్ హైకోర్టు జస్టిస్ అయ్యప్ప రెడ్డి ధర్మాసనం ఎస్.సి., ఎస్.టి.లకు నిబంధనల ప్రకారం ప్రమోషన్‌లలో రిజర్వేషన్‌లు కల్పించాలని తీర్పు చెప్పింది. బ్యాంకుల్లో 1978 నుండి పనిచేస్తున్న వారికి బ్యాక్‌డేటాను ఈ తీర్పు అమలవుతుందని ఆయన స్పష్టం చేశారు. అయితే ఇది సాధ్యం కాదని తిరిగి బ్యాంకుల యజమానులు కోర్టుకు వెళ్లారు.

1997 నుండి కోర్టుల్లో విచారణ జరిగిన తర్వాత 9 డిసెంబర్ 2009న 1997 నాటి తీర్పుతో పాటు ప్రమోషన్‌లలో హై ఎకలాంగ్ గ్రూప్ ఎ క్యాడర్ వరకు పదోన్నతి కల్పించాలని హైకోర్టు ధర్మాసనం ఇద్దరు న్యాయమూర్తులు జస్టిస్ ధర్మారావు, జస్టిస్ సెల్వన్‌లు తీర్పునిచ్చారు. దీంతో ఉద్యోగ వర్గాల్లో కొంత ఊరట కలిగింది. బ్యాంకుల్లో పనిచేసే వారిలో ఇన్ క్యాడర్ ప్రమోషన్‌లు అంటే స్కేల్-1 అసిస్టెంట్ మేనేజర్, స్కేల్-2 డిప్యూటీ మేనేజర్, స్కేల్-3 అంటే మేనేజర్, స్కేల్-4 అంటే ఛీఫ్ మేనేజర్, స్కేల్-5 అసిస్టెంట్ జనరల్ మేనేజర్, స్కేల్-6 డిప్యూటీ జనరల్ మేనేజర్, స్కేల్-7 జనరల్ మేనేజర్ వరకు పదోన్నతులు కల్పించాలని కోర్టు తీర్పు చెప్పింది. ఇది అంతా ఒక ప్రాసెస్.

దేశంలో బ్యాంకింగ్‌లోని 29 జాతీయ బ్యాంకుల్లో ఇప్పటివరకు జనరల్ మేనేజర్ స్థాయి అధికారులను వేళ్ల మీద లెక్కపెట్టవచ్చు. అసలు ఇన్‌క్యాడర్ ప్రమోషన్‌లలో రిజర్వేషన్‌లు అమలు చేయడంలేదు. ఇప్పటి

వరకు దేశంలోని అతిపెద్ద బ్యాంకుగా ఉన్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో రిజర్వేషన్‌లు అమలు చేయడం లేదు. గత సంవత్సరం నుండి మేనేజర్ స్థాయి అంటే స్కేల్-3 వరకు అమలు చేస్తున్నారు.

ఇప్పటికి ఎస్.సి., ఎస్.టి. ఉద్యోగ సంఘాలు మద్రాస్ హైకోర్టు ఇచ్చిన తీర్పును అమలు చెయ్యాలని డిమాండ్ చేస్తున్నాయి. మద్రాస్ హైకోర్టు తీర్పును ఇండియన్ బ్యాంకింగ్ అసోసియేషన్ (ఐ.బి.ఎ.) జాతీయ బ్యాంకులు అమలు చేసేలాగ చూడాలని వారు కోరుతున్నారు.

దేశంలో 1935 నాటి నుండి ఎస్.సి., ఎస్.టి.లకు విద్యా, ఉద్యోగ, రాజకీయ రంగాల్లో రిజర్వేషన్‌లు అమలులో ఉన్నాయనీ, వాటిని యథాతథంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేయాలని సీనియర్ న్యాయవాది బొజ్జ తారకం అభిప్రాయపడ్డారు. కోర్టు తదనంతరం ఆల్ ఇండియా ఎస్.సి., ఎస్.టి. బ్యాంక్ ఎంప్లాయిస్ అసోసియేషన్ ఆంధ్రప్రదేశ్ శాఖ వారు ఏర్పాటు చేసిన సమావేశంలో ఆయన మాట్లాడారు. ప్రభుత్వంలో పనిచేస్తున్న వారి ద్వంద్వ వైఖరి వల్లనే ఇలాంటివి జరుగుతున్నాయనీ, రిజర్వేషన్‌ల అంశంలో రాజ్యాంగంలో స్పష్టంగా ఉందనీ, వాటిని అమలు చెయ్యడం ఇష్టంలేని అగ్రకులం వారు రకరకాల కారణాలు చెప్పి అడ్డుకుంటున్నారనీ ఆరోపించారు.

పార్లమెంట్‌లో గెలిచిన 120 మంది సభ్యులు సరిగ్గా పర్యవేక్షించని కారణంగానే రిజర్వేషన్‌లు సరిగ్గా అమలు జరగడం లేదనీ, ప్రతి శాఖలో సమీక్ష జరిపి రిజర్వేషన్‌లు అమలు జరిగేలాగ ఉద్యోగ సంఘాలు సిద్ధం కావాలని, లేదంటే న్యాయపోరాటం చేయాలనీ తెలిపారు.

మద్రాస్ హైకోర్టు తీర్పుకు స్పందించిన జాతీయ ఎస్.సి., ఎస్.టి. కమిషన్ 12 ఫిబ్రవరి 2010న దేశంలో అతిపెద్ద బ్యాంక్ అయిన స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా దాని ఆరు అనుబంధ బ్యాంకుల చైర్మన్ ఓంప్రకాష్ భట్‌ను ప్రమోషన్‌లలో రిజర్వేషన్‌లు అమలు జరపాలని ఆదేశించింది. ఎస్.సి.లకు 15 శాతం, ఎస్.టి.లకు 7.5 శాతం మొత్తంగా 22.5 శాతం అమలు చెయ్యాలని వివరించింది. అదే విధంగా ఐబిఎ అనుబంధంగా ఉన్న జాతీయ బ్యాంకులకు కూడ జాతీయ కమిషన్ ఆదేశించింది.

డిసెంబర్ 9న మద్రాస్ హైకోర్టు డివిజన్ బెంచ్ ఇచ్చిన తీర్పును ఆల్ ఇండియా ఎస్.సి., ఎస్.టి. కాన్ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి కె.పి.చౌదరి జాతీయ కమిషన్‌ను ఆశ్రయించి బ్యాంకుల్లో రిజర్వేషన్‌లను అమలు చేయాలని కోరిన మేరకు జాతీయ కమిషన్ స్పందించింది.

అయితే బ్యాంకుల్లో పనిచేస్తున్న ఆఫీసర్‌లకు ఇన్ క్యాడర్‌లో ప్రమోషన్‌లు అమలు జరిగితే వారి కంటే కింది స్థాయిలో పనిచేస్తున్న వారి అంటే (అవార్డ్) క్లరికల్ స్టాఫ్ (సబార్డినేట్స్) అటెండర్‌ల పరిస్థితి ఏమిటి అనే ప్రశ్న ప్రారంభమైంది.

దేశంలోని బ్యాంకింగ్ రంగంలో మూడు రకాల క్యాడర్లుగా ఉద్యోగులు పనిచేస్తున్నారు. 1) సూపర్‌వైజర్ స్టాఫ్ అంటే ఆఫీసర్లు; 2) అవార్డ్ స్టాఫ్ అంటే క్లరికల్ స్టాఫ్; 3) సబార్డినేట్స్ అంటే అటెండర్లు. వీరికి కూడా వారి వారి అర్హతను బట్టి ప్రమోషన్‌ల మాట ఏమిటనీ, వీరికి ఇన్‌క్యాడర్‌లో ఒకసారి మాత్రమే అవార్డ్ స్టాఫ్‌కు రిజర్వేషన్ అమలు చేస్తున్నారు. క్లరికల్ స్టాఫ్ నుండి ఆఫీసర్ కావడానికి మాత్రమే. కాని క్లరికల్ స్టాఫ్‌లో ఇన్‌క్యాడర్ ప్రమోషన్ అంటే అసిస్టెంట్ నుండి సీనియర్ అసిస్టెంట్, స్పెషల్ అసిస్టెంట్, సీనియర్ స్పెషల్ అసిస్టెంట్‌లుగా పదోన్నతులు జరిగినప్పుడు రిజర్వేషన్‌లు అమలు చెయ్యడం లేదు. బ్యాంకుల్లోని ట్రేడ్ యూనియన్‌లు వారి వారి యజమాన్యాలతో కుదుర్చుకున్న ఒప్పందాల మేరకు మిగిలిన ఉద్యోగులతో సమానంగా వీరికి ప్రమోషన్‌లు వర్తిస్తున్నాయి కాని ఇందులో రిజర్వేషన్‌లు అమలు జరగడం లేదు.

అలాగే సబార్డినేట్ నుండి క్లరికల్ స్టాఫ్‌గా ప్రమోషన్ పొందడానికి రిజర్వేషన్‌లు అమలు చేయడం లేదు. ఇందులో జనరల్ అభ్యర్థులతో సమానంగా ప్రమోషన్ పొందుతున్నారు.

ప్రస్తుతం సుదీర్ఘ న్యాయపోరాటం ద్వారా ఆఫీసర్స్ అసిస్టెంట్ మేనేజర్ నుండి జనరల్ మేనేజర్ వరకు ఇన్‌క్యాడర్ ప్రమోషన్‌లు అమలు చేయాల్సిన కోర్టు తీర్పు 9 డిసెంబర్, 2009న రావడం, రెండు నెలల కాలంలో కేంద్ర ప్రభుత్వం, జాతీయ ఎస్.సి. కమిషన్ స్పందించి రిజర్వేషన్‌లు అమలు చేయాలని ఆదేశించడంతో సుమారు రెండు లక్షల మంది ఉద్యోగులకు కొంత మేర ఊరట కలిగించింది.

సంబంధిత జాతీయ బ్యాంకుల యాజమాన్యాలు స్పందించి వాటిని అమలు చేస్తాయా లేదా? మరేదైన కారణం చెప్పి తిరిగి రిజర్వేషన్‌లను అడ్డుకోవడానికి కోర్టులను ఆశ్రయిస్తాయా అన్నది చూడాలి.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత 1969లో బ్యాంకుల జాతీయికరణ జరిగిన నలభై సంవత్సరాలలో బ్యాంకుల్లో రిజర్వేషన్‌లు అమలు చెయ్యడం లేదు. ఉద్యోగ నియామకాలలో రీజనల్ రిక్రూట్‌మెంట్‌లలో అమలు చేసిన తర్వాత ఇన్‌క్యాడర్‌లో నేటికీ అమలు జరగడం లేదు. కనుకనే కోర్టు తీర్పు అమలు చేయాలనీ ఆదేశించింది. చివరి క్షణంలో సంబంధిత కోర్టు ఉత్తర్వులను సవాల్ చేస్తూ ఐదు బ్యాంకుల యాజమాన్యాలు సుప్రీంకోర్టును ఆశ్రయించి ప్రమోషన్‌లలో రిజర్వేషన్‌లు అమలు సాధ్యం కాదని వాదించడానికి సిద్ధమైనాయి. వాటిని ఎలాగైనా అమలు చేయించి, బ్యాంకింగ్ రంగంలో పనిచేస్తున్న ఉద్యోగులకు భవిష్యత్ తరాల వారికి రిజర్వేషన్ ఫలాలు అందించాలని బ్యాంకుల్లోని ఎస్.సి., ఎస్.టి. ఉద్యోగ సంఘాలు న్యాయపోరాటానికి సిద్ధమవుతున్నాయి. కోర్టు ఆదేశం రావడంతో ఊపిరి పీల్చుకున్న ఉద్యోగులు బ్యాంకు యాజమాన్యాలు సుప్రీం కోర్టును ఆశ్రయించడంతో నిరాశ చెందుతున్నారు. వీ

*వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడంగాని వీలుకావడం లేదు.*

**- వై. రామచంద్రం** *(సర్క్యులేషన్ మేనేజర్)* **9949 391028**
Email : yatelliram@gmail.com

*సామ్రాజ్యవాద కుట్రలకు బలి అయి తొమ్మిది దశాబ్దాలుగా విముక్తి కోసం పోరాడుతున్న పాలస్తీనా పోరాట చారిత్రక నేపథ్యాన్ని వివరిస్తున్నారు* **కె. నరేంద్రమోహన్**

# పాలస్తీనా పోరాట నేపథ్యం

**ఎల్.**టి.టి.ఇ. పై శ్రీలంక ప్రభుత్వం సాధించిన సైనిక విజయంతో తమిళ విముక్తి పోరాటంలో ఒక దశ ముగిసింది. అదే సందర్భంలో, 90 సంవత్సరాలకు పైగా రగులుతున్న పాలస్తీనా విముక్తి పోరాటాన్ని గుర్తు చేసుకోవల్సిన అవసరం ఉంది. శ్రీలంక ప్రభుత్వానికి ఇజ్రాయిల్ సైనిక, సాంకేతిక సహాయం అందించడమే కాక, పాలస్తీనా ప్రాంతాలను ఆక్రమిస్తున్న ఇజ్రాయిల్ అనుభవం నుంచి శ్రీలంక తన భవిష్యత్ వ్యూహాన్ని రూపొందించుకోవచ్చున్న అనుమానానికి ఆధారం లేకపోలేదు.

బహుశా పాలస్తీనా ప్రజల మీద జరుగుతున్న దురాక్రమణను సమర్థించుకోవడానికి జరుగుతున్న వంచన, విషం కక్కే పచ్చి అబద్ధాల ప్రచారం ఇంక ఏ దేశ ప్రజల మీద జరిగి ఉండదు. ఈ పోరాటం, దానిలోని ఎగుడు దిగుడులు, పరాజయాలు, బ్రిటిష్, అమెరికా ప్రభుత్వాల వంచన గురించి విపులంగా వివరించడానికి ఒక గ్రంథాలయ అవసరం ఉంటుంది.

ఏ సమస్యనైనా అవగాహన చేసుకోవడానికి దాని చారిత్రక మూలాలను పరిశీలించాలి. పాలస్తీనా సమస్య ఏర్పడడానికి ఉన్న చారిత్రక నేపథ్యం టూకీగా పరిచయం చేసే ప్రయత్నానికి మాత్రమే ఇందులో పరిమితమవుతున్నాను. విపులంగా తెలుసుకోవాలనుకునే పాఠకులకు రాల్ఫ్ షూమాన్, లెన్ని బ్రెన్నర్, ఇల్లాన్ పపె, తాన్య రేన్‌హార్ట్, వాల్టర్ లాక్వెర్ వంటి చరిత్రకారుల రచనలను చూడవచ్చు. ఇక్కడ ఒక విషయం మాత్రం చెప్పాలి, పైన ఉటంకించిన వారు చాలావరకు ఇజ్రాయిల్ పౌరులో లేక యూదు సంతతికి చెందిన వారో. ఈ ముందు జాగ్రత్త ఎందుకంటే, ఇజ్రాయిల్ – పాలస్తీనా గురించి వాస్తవాలు ప్రకటించే వారెవరైనా హిట్లర్ అనుచరులనో, యూదు వ్యతిరేకులనో విష ప్రచారం చెయ్యడంలో ఇజ్రాయిల్‌ది, దాని వత్తాసుదారులది అందె వేసిన చెయ్యి.

ఇక అసలు విషయానికి వద్దాం. పాలస్తీనా దేశాన్ని ఆక్రమించి అక్కడి అరబ్ ప్రజల స్థానంలో యూరప్‌కు చెందిన యూదు మత అనుచారకుల సమాక్రమాన్ని నిర్మించే కార్యక్రమం పేరు జియోన్ వాదం (జియోనిజం).

ఆక్రమణవాదంగా జియోనిజం 19వ శతాబ్దపు చివరిలో అవతరించింది. ఇది యూరప్ లోని పారిశ్రామిక దేశాలు ఆఫ్రికా, ఆసియాలో మిగిలి ఉన్న ప్రాంతాలను వలసలుగా మార్చుకునే ప్రయత్నంలో తీవ్రంగా పోటీపడుతున్న కాలం. ఇది పోలెండ్‌లో, రష్యాలో తీవ్రంగా వివక్షకు గురవుతున్న యూదు మతస్తులు తమ విముక్తి కొరకు సంఘటితమవుతున్న కాలం కూడా. అదే సమయంలో పశ్చిమ యూరప్‌లోని యూదులు సాపేక్షంగా స్వేచ్ఛ అనుభవిస్తున్న కాలం. తూరుపు యూరప్‌లోని యూదుల పోరాటాన్ని వలసవాదం వ్యాపించే ప్రయత్నాన్ని ప్రారంభించిన వ్యక్తి థియోడర్ హెర్జ్.

హెర్జ్ ఆస్ట్రియా – హంగేరీ సామ్రాజ్యంలో భాగమైన బుడాపెస్ట్ నగరానికి చెందిన ఉన్నత మధ్యతరగతి యూదుడు. వియన్నాకు చెందిన ఒక పత్రికకు ప్యారిస్‌లో విలేకరిగా పనిచేసేవాడు. ఫ్రెంచ్ యూదు సైనిక అధికారి ఆల్ఫ్రెడ్ డ్రేఫస్ ను రాజద్రోహ ఆరోపణపై శిక్షించడంతో డ్రేఫస్ కుంభకోణం బైటపడింది. ఫ్రాన్స్‌లోని ప్రగతిశీల వాదులకు, ఛాందస చర్చ్, రాచరిక వాదులకు, సైన్యంలోని కరడుగట్టిన తిరోగమన వాదులకు ఇది పోరాట వేదికగా మారింది. ఎమిల్ జోలా వంటి ఫ్రెంచ్ రచయితలు డ్రేఫస్‌ను ప్రతిభావంతంగా సమర్థించడంతో, ఫ్రెంచ్ ప్రభుత్వం దిగి వచ్చి డ్రేఫస్‌ను క్షమాభిక్ష పేరుతో విడుదల చేసింది. ఈ వ్యవహారంతో ఫ్రాన్స్‌లోని కాథలిక్ చర్చి రాజకీయ పలుకుబడి పూర్తిగా దెబ్బతిన్నది.

కానీ, హెర్జ్ దీని నుండి నేర్చుకున్న పాఠం, యూదులు కూడా ఒక జాతీయ ప్రాంతాన్ని ఏర్పర్చుకోవాలని. ఈ ప్రయత్నంలో హెర్జ్, అప్పటికే ఆఫ్రికాను ఆక్రమిస్తున్న సెసిల్ రోడ్స్ అనే బ్రిటిష్ వ్యాపారవేత్తను (మన భాషలో చెప్పాలంటే గాలి జనార్ధనరెడ్డికి పెద్దన్న) తనకు ఆదర్శంగా స్వీకరించాడు. ప్రధానంగా వెనుకబడిన తూర్పు యూరప్, రష్యాలోని యూదు మధ్య తరగతి, చైనా వ్యాపారస్తులను కూడగట్టి యూదు బేకర్లు, పారిశ్రామికవేత్తల సహాయంతో ఏదో ఒక ప్రాంతాన్ని వలసగా మార్చుకొనే ప్రయత్నంలో తన జీవితం గడిపాడు.

ఆ సమయంలోనే పాలస్తీనా ప్రాంతం వారి దృష్టికి వచ్చింది. యూదు మతస్తుల తొలి దేవాలయం ఉన్న జెరూసలేం పాలస్తీనాలో ఉండడం వల్ల, జెరూసలేం పట్టణంతో యూదులకు మతపరమైన అనుబంధం ఉంది. – కాథలిక్ మతస్తులకు వాటికన్‌తో ఉన్న అనుబంధంతో పోల్చవచ్చు.

తన పథకాన్ని నెరవేర్చుకోవడానికి హెర్జ్ ఎంచుకున్న పద్ధతి, ఆ ప్రాంత పాలకులకు ధన, రాజకీయ సహాయాల ఆశచూపి పైరవీలు చెయ్యడం. ఆ కాలంలో పాలస్తీనా ప్రాంతం టర్కీ దేశపు ఒట్టోమన్ సామ్రాజ్యంలో భాగంగా ఉండేది. క్షీణావస్థలో ఉన్న ఒట్టోమన్ సామ్రాజ్య పాలకుడు సుల్తాన్ అబ్దుల్ హమీద్‌తో హెర్జ్ ముందుగా మంతనాలు

జరిపాడు. పాలస్తీనా ప్రాంతపు పరిపాలన తాము ఏర్పర్చుకున్న కంపెనీకి (ఈస్ట్ ఇండియా కంపెనీ వంటి) పట్టా రాసిస్తే, దివాలా తియ్యనున్న ఒట్టోమన్ ఖజానా నిర్వహణ బాధ్యత రోత్షిల్డ్ వంటి యూదు బ్యాంక్ యజమానులు స్వీకరిస్తారని ఆశ చూపాడు. కాని కూలిపోనున్న తన సామ్రాజ్యంలోని ఆ భాగం మీద అధికారం వదులు కోవడానికి అబ్దుల్ హమీద్ సుముఖత చూపించలేదు.

ఇటువంటి పైరవీలే హెర్జ్ తిరిగి జర్మన్ కైసర్ పాలకునితో, ఆస్ట్రో హంగేరియన్ పాలకులతో, రష్యాలోని జార్ ప్రభుత్వంతో, బ్రిటిష్, ఫ్రెంచ్ ప్రభుత్వాలతో చేసాడు. రష్యాలోని యూదు ప్రజలపై హత్యాకాండ నిర్వహించిన హోంమంత్రి (నరేంద్రమోడీతో పోల్చదగిన) వాన్ ఫెల్వ్ తో చేతులు కలపడానికి హెర్జ్ వెనుకాడలేదు. యూదులను వదిలించుకునే మార్గం లభిస్తుందని వాగ్దానం చేసాడు. అదే సమయంలో పశ్చిమ యూరప్‌లోని యూదు బ్యాంక్ యజమానులు వ్యాపారవేత్తలను కలిసి తమ దేశాలలోకి పెద్ద యూదు రాడికల్ భావాలు గల యూదులు వలస రాకుండా దారి మళ్లిస్తానని వాగ్దానం చేసాడు.

తొలుత హెర్జ్ ప్రయత్నాలను అటు పాలకులు గానీ, యూదు ధనవంతులు గానీ పెద్దగా పట్టించుకోనప్పటికీ, బ్రిటిష్ ప్రభుత్వం తాత్కాలిక ఏర్పాటుగా హెర్జ్ నాయకత్వంలోని ప్రపంచ జియోనిస్ట్ సంస్థ కు తన వలసపాలనలోని ఉగాండ ప్రాంతాన్ని ఇవ్వజూపింది. కాని ఈ పథకాన్ని తూర్పు యూరప్‌లోని జియోవాదులు బలంగా వ్యతిరేకించారు. 1904లో హెర్జ్ హఠాత్ మరణంతో ఈ వివాదం సమసిపోయింది.

మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభంతో, జియోనిస్ట్ సంస్థకు బ్రిటిష్ ఆదరణ పెరిగింది. తన యుద్ధ ప్రయత్నాలకు యూరప్‌లోని బ్యాంక్ యజమానుల, అమెరికన్ తోడ్పాటు, ఆయా దేశాలలో యూదు ధనవంతుల సహాయం అవసరం అయ్యింది. అంతేకాకుండా, ఐర్లాండ్‌లో ప్రొటెస్టంట్లను తనకు అనుకూలంగా మలచుకొని విభజించి పాలించిన అనుభవం దృష్ట్యా, కీలకమైన పాలస్తీనా ప్రాంతంలో తమకు విశ్వాసపాత్రులైన ఒక శ్రేణి ఉండడం మంచిదని బ్రిటిష్ పాలకులు భావించారు.

ఈ పథకంలో భాగంగా బ్రిటిష్ విదేశాంగ మంత్రి డేవిడ్ బాల్ఫోర్ 1917లో తన బాల్ఫోర్ ప్రకటన జారీ చేశాడు. టూకీగా చెప్పాలంటే, తమది కాని ప్రాంతంలో వలసలు ఏర్పర్చుకోవడానికి సహకరిస్తామని జియో వాదులకు హామీ ఇచ్చింది. అదే సమయంలో తన సైనిక అధికారి టి.ఇ. లారెన్స్ (లారెన్స్ అఫ్ అరేబియా) ద్వారా అరబ్బులకు స్వాతంత్ర్యం కల్పిస్తామనే వాగ్దానంతో వారిని ఒట్టోమన్ సుల్తాన్‌తో పోరాటానికి ప్రోత్సహించింది.

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసేనాటికి ఒట్టోమన్ సామ్రాజ్యం కుప్పకూలిపోయింది. అరబ్బుల స్వాతంత్ర ఆకాంక్షకు ద్రోహం తలపెట్టిన బ్రిటిష్, ఫ్రెంచ్ పాలకులు అరబ్ ప్రాంతంలో తమ వలస రాజ్యాలుగా సైక్స్-పికొట్ ఒప్పందం ఆధారంగా విభజించుకున్నారు. బ్రిటిష్ పాలకులు మెక్కా ప్రాంతపు హష్మితె నేత అయిన షరీఫ్ హుసేన్ కుమారులను డమస్కస్, బాగ్దాద్ ప్రాంతాలకు రాజులుగా ప్రకటించి తమకు అనుకూలమైన అరబ్ శ్రేణిని తయారుచేస్తూనే, ప్రపంచ జియోనిస్ట్ సంస్థకు తన ఆధీనంలోని పాలస్తీనాలో వలసలు కల్పించారు.

పన్నులు, కౌలు పై ప్యారిస్, బ్యూరట్‌లలో జీవించే భూస్వాముల వద్ద తప్పు తడకల పత్రాలతో భూమి మీద నివసిస్తున్న చిన్న రైతులను, కౌలుదారులను తమ భూముల నుండి బేదఖల్ చెయ్యడంలో బ్రిటిష్ వలస ప్రభుత్వం (లీగ్ ఆఫ్ నేషన్స్ మ్యాండేట్ పవర్ అనే ముసుగులో) వారికి సహకరించింది. ఈ భూములలో సోషలిజం పేరుతో సమిష్టి వ్యవసాయక్షేత్రాలు ఆరంభించారు. భూముల నుండి, వృత్తుల నుండి దూరమైన అరబ్ ప్రజల స్థానే తూర్పు యూరప్, రష్యాలోని యూదులతో వ్యవసాయం ప్రారంభించారు.

కరడుగట్టిన సామ్రాజ్యవాది విన్‌స్టన్ చర్చిల్ దీని పట్ల హర్షం వ్యక్తం చేస్తూ ఒక పత్రికకు వ్యాసమే రాశాడు, "... అంతర్జాతీయ కమ్యూనిజంకు ప్రత్యామ్నాయంగా, జియోవాదం యూదుల ముందు ఒక జాతీయ భావం ఉంచుతుంది. పాలస్తీనా పై విజయం సాధించడం వల్ల, యూదులకు ఒక జాతీయ ఆవాసాన్ని ఏర్పర్చే అవకాశం, బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వం వంతు అయింది. బ్రిటిష్ రక్షణలో 30-40 లక్షల యూదులతో జోర్డాన్ నది తీరంలో ఒక రాజ్యం ఏర్పడితే అది బ్రిటిష్ సామ్రాజ్య ప్రయోజనాలకు ఎంతో తోడ్పడుతుంది.." (ఇల్లుస్ట్రేటడ్ సండే హెరాల్డ్, 8 ఫిబ్రవరి 1920).

బ్రిటిష్ రక్షణలో పాలస్తీనా వలసలు ముమ్మరమయ్యాయి. తమ జీవనోపాధి కొరకు, స్వతంత్రం కొరకు యూదు వలసలకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు మొదలవడంతో బ్రిటిష్ సైనిక అధికారి చార్లెస్ ఒర్డే వింగేట్‌కు యూదులను ఒక పారామిలిటరీగా ఉపయోగించుకోవచ్చనే ఆలోచన వచ్చింది. దీంతో, పాలస్తీనా లోని జీవిష్ ఏజెన్సీ సహాయంతో స్పెషల్ నైట్ స్క్వాడ్స్ వంటి దళాలను ఏర్పరిచి వారికి సైనిక శిక్షణతో పాటు, టెర్రరిస్ట్ చర్యలలో శిక్షణ ఇచ్చాడు. హగన్నా, పాల్మాచ్, ఇర్గున్, లేహి పేర్లతో ఏర్పడిన జియోనిస్ట్ దళాల నాయకత్వం, మోష్ దయాన్ వంటి ఇజ్రాయిల్ అధికారులు వింగేట్ శిష్యులు.

ఒక వైపు నగ్నమైన జాత్యాహంకారం ప్రదర్శిస్తూ ఆక్రమణ జరుపుతూనే, మరోవైపు పాలస్తీనా నిర్జన ప్రదేశం (ల్యాండ్ విథౌట్ పీపుల్), ఎడారిని వికసింపజేయడం వంటి అబద్ధపు ప్రచారం చేశారు. బయటి ప్రపంచానికి ఎన్ని అబద్ధాలు చెప్పినా, తమ ఆంతరంగిక చర్చలలో తమ ఉద్దేశాలను జియోనిస్ట్ నాయకులు స్పష్టంగా ప్రకటించుకున్నారు. ఉదాహరణకు ఇర్గున్, లేహి వంటి టెర్రరిస్ట్ సంస్థల, లికుడ్ ప్రకాశంలోని బెగిన్, షమీర్, షెరాన్, నితాన్‌యహు వంటి రాజకీయ నాయుకుల సిద్ధాంతకర్త అయిన వ్లాదమీర్ జబాటిన్స్కీ తన ఇనుప గోడ (ది ఐరన్ వాల్) అనే వ్యాసంలో ఇలా రాసాడు, "... జియోనిస్ట్ ఆక్రమణ, ఎంత చిన్న మోతాదులో అయినా, స్థానిక ప్రజల సమ్మతికి వ్యక్తీకరణకు నిర్వహించక తప్పదు. ఏ ఆక్రమణ స్థానిక ప్రజలతో నిమిత్తం లేని శక్తి రక్షణలోనే కొనసాగగలదు - ఇది స్థానిక ప్రజలు ఛేదించలేని ఇనుప గోడ వంటిది. అరబ్బుల పట్ల ఇదే మన విధానం. వేరే ఏ మాదిరిగా దీనిని సూత్రీకరించడం ద్వంద్వత్వం (హిపొక్రసీ) అవుతుంది." (ది ఐరన్ వాల్. వి అండ్ ది అరబ్స్ 1923 (రుస్స్‌వైట్), ది జీవిష్ హెరాల్డ్, 26 నవంబర్ 1937).

రెండవ ప్రపంచయుద్ధం ఆరంభంలో బ్రిటిష్ ప్రభుత్వం, పాలస్తీనా ప్రజలలో పెరుగుతున్న వ్యతిరేకతను చల్లబర్చడానికి, యూదువలసలపై ఆంక్షలు విధిస్తూ ఒక శ్వేతపత్రాన్ని 1939లో జారీచేసింది. దీనితో

***వలసవాద అభివృద్ధి నమూనా, దానికి కొనసాగింపుగా కోస్తాంధ్ర అభివృద్ధి నమూనాల మధ్య పడి అస్తిత్వాన్ని కోల్పోయిన రాయలసీమ, కేవలం తన అస్తిత్వం కోసమే కాదు, ప్రజావిముక్తి దిశగా ఉద్యమించాల్సిన అవసరాన్ని గుర్తుచేస్తున్నారు* పాణి**

# రాయలసీమ అస్తిత్వాన్ని గుర్తించాలి

*(... గత సంచిక తరువాయి)*

**రా**యలసీమలో సమిష్టితత్వాన్ని ప్రేరేపించే అస్తిత్వ వ్యక్తీకరణ జరగలేదు. రాయలసీమకు తనదైన అస్తిత్వం లేకపోలేదు. అసలు ఏ ప్రాంతానికైనా తనదైన సొంత చరిత్ర, సొంత గాథ ఎందుకు ఉండదు? కానీ రాయలసీమకు అలాంటిది ఒకటి ఉన్నదని వివరించడానికి చాలా కష్టపడాలి. అంటే అది చెప్పడానికి, చూపడానికి ఆ ప్రాంతవాసులు ప్రకటించుకొని పులకించడానికి సిద్ధంగా ఏమీ లేదు. కరువు, ఆకలి చావులు, వలస లాంటి కొన్ని బాధాయమ ప్రత్యేకతలున్నాయి. తాజా పరిణామాల్లో అన్ని ప్రాంతాల్లో ఇలాంటి విషాద సన్నివేశాలు అలుముక పోయాయి. రాయలసీమకు సంబంధించి వాటి ప్రత్యేకత ఏమిటి? అని వివరించడానికి కూడా ఏమీ లేదు. ఇది కాకపోతే ముఠాతత్వం మరొకటి. దీని గురించి రాయలసీమ లోపల బైట కూడా చాలా అసంగత విషయాలు పోగుపడి ఉన్నాయి. అందుకే ఆధునిక రాయలసీమ చరిత్ర అనబడేదేమైనా నిర్మాణమై ఉన్నదా? అందులో రాయలసీమ భూస్వామ్యం గురించి, వలసవాదం వచ్చాక జరిగిన ఆధునిక పరిణామాల గురించి ఏమైనా సమాచారం ఉంటే పాలెగాళ్ల వ్యవస్థ గురించి ఒక అంచనాకు వచ్చే వీలుండేది. ఒక ప్రాంత స్వీయ అస్తిత్వం అనేది ఆ ప్రాంత చరిత్రతో, చరిత్ర పట్ల సవ్యమైన వైఖరితో సంబంధం లేకుండా ఎలా ఉంటుంది?

అంటే రాయలసీమ గాథ ఏమిటో నిర్మించవలసి ఉంది. ఇప్పటిదాకా ప్రచారంలో ఉన్నదానిలో చాలా అపసవ్యమైన సూత్రీకరణలు, నమ్మకాలు ఉన్నాయి. రాయలసీమలో అప్పుడప్పుడు బూర్జువా శక్తులు గాని, ప్రజాస్వామిక శక్తులు గాని చేసిన ప్రయత్నాలేవీ ఉద్యమాలు కాకపోవడానికి రాయలసీమకు తానేమిటో తనకు తెలియని స్థితి ప్రధాన కారణం. ఇప్పుడేదైనా ఉద్యమం జరగాలంటే మొట్టమొదట ఈ ప్రయత్నం చేయాలి. ఆధునిక చరిత్రలో రాయలసీమకు సంక్రమించిన అస్తిత్వం గురించి తెలుసుకొనే క్రమంలో ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు కాలం

---

పాలస్తీనాలోని యూదు దళాలు బ్రిటిష్ అధికారాన్ని వ్యతిరేకించడం మొదలుపెట్టాయి. యుద్ధం ముగిసే నాటికి, ఇర్గున్, లేహి సంస్థలు అరబ్బులతో పాటు బ్రిటిష్ అధికారులను బాంబులు, కాల్పులతో హత మార్చడం మొదలుబెట్టాయి. మరోవైపు, తూర్పు యూరప్‌లోని యూదు శరణార్థులను పాలస్తీనాకు రహస్యంగా తరలించడం మొదలుబెట్టాయి.

బలహీనపడిన బ్రిటిష్ ప్రభుత్వం ఈ మొత్తం వ్యవహారాన్ని, అప్పటికి ఇంకా సామ్రాజ్యవాద దేశాలు అధికంగా ఉన్న ఐక్యరాజ్య సమితి చేతిలో పెట్టి వదిలించుకుంది. అరబ్ స్వతంత్రాకాంక్షను గుర్తించకుండా పాలస్తీనా ప్రాంతాన్ని యూదు అరబ్ ప్రాంతాలుగా విభజించాలని సమితి తీర్మానించింది. (యుఎన్‌జిఎ రిసల్యూషన్ 181, 29 నవంబర్ 1947). జనాభాలో 30 శాతం కూడా లేని యూదులకు 55 శాతం భూమిని, గాజా మినహాయించి కీలకమైన తీర ప్రాంతం మొత్తాన్ని, జల వనరులున్న టిబెరియాస్ సరస్సుని యూదు ప్రాంతంగా సమితి తీర్మానించింది. (33 ఓట్లు అనుకూలం, 13 ఓట్లు వ్యతిరేకం, 10 గైర్‌హాజరు). స్టాలిన్ నాయకత్వంలోని సోవియట్ యూనియన్ ఈ తీర్మానానికి అనుకూలంగా ఓటు వేయడమే కాకుండా, తరువాతి అరబ్ – ఇజ్రాయిల్ యుద్ధంలో ఇజ్రాయిల్‌కు చెకొస్లావేకియా ద్వారా ఆయుధ సహాయం కూడా అందించింది.

ఈ తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ అరబ్బులు పెద్ద ఎత్తున ఆందోళన చేపట్టగా, జియోనిస్ట్ నాయకుడు డేవిడ్ బెన్ గురియోన్, బ్రిటిష్ అధికారం ముగిసే ముందురోజు 14 మే, 1978న తమ స్వతంత్ర రాజ్యాన్ని ప్రకటించాడు. దీనికి కొన్ని నెలలు ముందుగానే జియోనిస్ట్ దళాలు పెద్దఎత్తున మారణకాండ సాగించి సుమారు 7.5 లక్షల పాలస్తీనియన్‌లను తమ ప్రాంతాల నుండి తరిమివేశారు. ఈ హత్యా కాండతో బాగా వెలుగులోకి వచ్చింది. డేర్ యెసిన్‌లో 9 ఏప్రిల్ 1948న లేహి సంస్థ సాగించిన సుమారు 254 మంది స్త్రీలు, పురుషులు, పిల్లల ఊచకోత. ఇజ్రాయిల్ ప్రధాన మంత్రులు అయిన మెనచేమ్ బేగిన్, యిజ్హాక్ షమీర్ లు పూర్వరంగంలో ఇర్గున్, లేహి గ్రూపులకు నాయకత్వం వహించిన వారే. 1948లో దేశ బహిష్కరణకు గురైన పాలస్తీనా ప్రజలు, వారి సంతతి ఈ నాటికీ తమ ప్రాంతానికి తిరిగి పోలేకున్నారు.

రేఖామాత్రంగా ఇది పాలస్తీనా పోరాట చరిత్ర. వివరంగా తెలుసుకోదలచినవారు ముందు పేర్కొన్న రచయితల రచనలు చదవగలరు.

**చదవదగ్గ పుస్తకాలు :** రాల్ఫ్ షూమన్ – ది హిడెన్ హిస్టరీ ఆఫ్ జియోనిజం; లెన్ని బ్రెన్నర్ – జియోనిజం ఇన్ ది ఏజ్ ఆఫ్ డిక్టేటర్స్; ఇల్లాన్ పపె – ఎ మాడర్న్ హిస్టరీ ఆఫ్ పాలస్తీనా; తన్య రేన్‌హార్ట్ – ఇజ్రాయిల్ – పాలస్తీనా హౌ టు ఎండ్ ది వార్ ఆఫ్ 1948; వాల్టర్ లక్వెర్ – ఎ హిస్టరీ ఆఫ్ జియోనిజం

వీ

నుంచి కోస్తా ఆధిపత్య శక్తుల వల్ల జరిగిన అన్యాయం చర్చనీయాంశం కావాలి. 1953 నుంచి ఆంధ్రరాష్ట్రంలో లేదా ఆంధ్రప్రదేశ్‌లో రాయలసీమకు జరిగిన అన్యాయం గురించి, అంతకుముందు శ్రీబాగ్ ఒప్పంద కాలం నుంచి రాయలసీమకు కోస్తా నాయకులు చేసిన అన్యాయాల గురించి చర్చనీయాంశం చేయాలి. ఈ క్రమంలో స్థానిక ఆధిపత్య శక్తుల గురించి కూడా తప్పక వివరించాలి.

దీనికి సంబంధించి ఒక్క విషయమైనా తప్పక ప్రస్తావనకు తేవాలి. 1936 నాటికే రాయలసీమ వాళ్లకు కోస్తా వారి విషయంలో మీరు-మేము అనే భావన ఉండేది. ఇది ఎందుకు కలిగింది? దీనికేమైనా న్యాయబద్ధమైన కారణాలుంటే ఆ భావనను గౌరవించాల్సి ఉంటుంది. అదొక వంచన నుంచో, అనుమానం నుంచో, భయం నుంచో కలిగి ఉంటే దానికి సంబంధించిన వాస్తవిక సమాచార క్రోడీకరణలో ఈ 'మేము' అనే భావన చుట్టూ స్వీయ చారిత్రక, సాంస్కృతిక ప్రత్యేకత్వాన్ని నిర్మించాల్సి ఉంటుంది. అసలు ఆ ప్రాంతం ఇప్పటిదాకా దాని అవసరం గుర్తించలేకపోవడమే దాని వెనుకబాటుతనానికి ఒక ఉదాహరణ కావచ్చు. అన్యాయానికి గురైన ప్రతి సందర్భంలో తిరుగుబాట్లు వస్తాయని, ఒకసారి 'మేము' అనే భావన కలిగాక అది అట్లాగే చిరకాలం నిలిచి ఉంటుందని నమ్మనవసరం లేదనేది రాయలసీమ చరిత్రలోని ప్రత్యేకత.

కోస్తా ప్రాంత ప్రజలతో వేరుబడే సొంత చరిత్ర, అస్తిత్వం, ప్రత్యేకత్వం ఉన్నా, ఆ ప్రాంత ఆధిపత్య శక్తుల చేతిలో సుదీర్ఘకాలం భంగపడినా రాయలసీమ తనను తాను వ్యక్తీకరించుకోలేకపోయింది. అదొక నిర్మాణ స్వభావాన్ని సంతరించుకోలేకపోయింది. ఇదొక విచిత్రమైన, విషాదకరమైన స్థితి. గుర్తింపు ఉద్యమాలు వచ్చాక మనకు దేన్నయినా చూడ్డం మహా తేలికైపోయింది గాని ఆ కళ్లద్దాలతో చూస్తే చాలా విషయాలు తేల్చలేమని, అనేకం అగమ్యగోచరంగా ఉండి పోతాయని రాయలసీమ ద్వారా చెప్పవచ్చు. ఉదాహరణకు సీమలో ప్రాంతీయ అస్తిత్వం మీద ఉద్యమాలు జరగకపోవడానికి కారణం వెతికితే ఇతరేతర రోజువారీ సమస్యల మీద పోరాటాలు చేసిన అలవాటు కూడా పెద్దగా లేదని తేలుతుంది. అవే జరిగి ఉంటే అస్తిత్వ ఉద్యమమనే ప్రాంతీయ ఉద్యమానికి ప్రేరణ కలిగేది. వేరే దేనితో సంబంధం లేకుండా ఎకాయెకి అస్తిత్వ స్పృహ ఒకనాటి తెల్లవారుజామున భళ్లున కలగడం, ఇక పోరాటానికి నడుం బిగించడం అనేవి నిజంగా జరిగేవి కావు. సిద్ధాంతాల్లో ఇట్లా అస్తిత్వ పోరాటాలు, ఇతరేతర పోరాటాలనే వేర్వేరు డబ్బాలు తయారు చేసుకొని మోసుకతిరగవచ్చుగాని సామాజిక జీవితం అట్లా ఉండదు. ఉదాహరణకు తెలంగాణలోనే ప్రాంతీయ ఆకాంక్షలకు, సాయుధ పోరాటాలకు ఉన్న సంబంధం చాలా కీలకమైంది. కమ్యూనిస్టుల నాయకత్వంలో జరిగిన పోరాటాల భూమిక ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి సజీవమైన ఆధారమైంది.

తెలంగాణ సమస్య ముందుకు వచ్చినప్పుడే సీమ సమస్యలు ప్రస్తావనకు రావడం ఎందుకు? అని అసహనానికి లోనయ్యే వారు కొందరుండొచ్చు. సీమ సమస్యలను ఆ ప్రాంత బూర్జువావర్గం తెలంగాణకు పోటీగానే తెస్తున్నారనే విషయంలో అనుమానం లేదు. తమ స్వప్రయోజనాల కోసమే రాయలసీమ పాలకులు తెలంగాణ వ్యతిరేక వైఖరి తీసుకున్నారు. ఆలోచనాపరులకు, మధ్యతరగతికి కూడా ఇప్పటి ప్రత్యేక తెలంగాణ నేపథ్యంలో సీమ సమస్యల స్పృహ కలగడం యాదృచ్ఛికం కాదు. తెలంగాణ ఎట్లాగూ వేరైపోయేదే. కాస్త ముందు వెనకల సమస్యే. అప్పుడు రాయలసీమ 1953 నాటి స్థితికి వెళ్లి కోస్తాతో సహజీవనం చేయాల్సి ఉంటుంది. ఇది రాయలసీమలో చరిత్ర తెలిసిన వాళ్లకు భయం కలిగించే అవకాశం ఉంది. కోస్తా పెట్టుబడిదారుల వల్ల రాయలసీమకు శ్రీబాగ్ ఒడంబడిక నుంచి జరిగిన అన్యాయాల చిట్టా తెలుసు కాబట్టి ఆ ప్రాంతం వాళ్లకు రేపటి సంసారాన్ని తలచుకుంటే ఆందోళన కలగడం న్యాయమే.

అందువల్ల ప్రత్యేక రాయలసీమ అనే డిమాండ్ ముందుకు వచ్చింది. అయితే ఈ నినాదం వల్ల తెలంగాణ రాష్ట్ర ఉద్యమానికి అవరోధం కలుగుతుందని (సీమ కష్టాలన్నీ న్యాయమైనవే అని అంగీకరిస్తూ కూడా) అనుకొనే తెలంగాణ వాళ్లున్నారు. యాభై ఏళ్లుగా చేస్తున్న తెలంగాణ పోరాటం చిట్టచివరి దశకు వచ్చిన ఈ దశలో ఇంత వరకు ఏ ఉద్యమాలు చేయని ప్రాంతీయులు పనిలో పనిగా తమకూ ప్రత్యేక రాష్ట్రం కావాలని అడిగితే కలిగే అసహనం ఇందులో ఉన్నది. దాని వల్లే ప్రత్యేక రాయలసీమ తెలంగాణకు అవరోధం అనిపిస్తుంది. కానీ చరిత్ర అట్లా నడవాలని ఏమీ లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక రాష్ట్రం కోరుకొనే ఏ ప్రాంతమైనా తెలంగాణ వలె యాభై అరవై ఏళ్లు మళ్లీ పోరాటం చేయాల్సిన అవసరం ఉండదు. చరిత్రే అలాంటి పనిని తప్పనిసరి చేస్తే ఏమోగాని ఒకచోట ఒక ప్రాంత ప్రజలు సాధించిన విజయం మిగతా ప్రజలందరికీ దారి చూపుతుంది. ప్రపంచంలో ఎక్కడ ఏ ప్రజాఉద్యమం జరిగినా దాని స్ఫూర్తి ఎల్లెడలా వ్యాపిస్తుంది. ఆ ప్రజల చైతన్యం, అనుభవం, విజయాపజయాల పరంపర భూమికగా మిగతా ప్రాంతాల్లో ప్రజలు ఉద్యమాలు సాగిస్తారు. అంతేగాని దేనికి ఏది పోటీ కానవసరం లేదు. అసలు ప్రత్యేక రాయలసీమ ఉద్యమానికి ఉన్న విషాదకర పరిమితి ఏమంటే ఇప్పటికీ తన గురించి తనకేమీ తెలియని ప్రాంతం ఇప్పుడే తెలుసుకుంటూ ఈ నినాదాన్ని ముందుకు తెస్తోంది. అది రాయలసీమ బూర్జువా నాయకత్వమంతా సమైక్య ఉద్యమంలో తలమునకలై ఉన్న కాలంలో.

ఈ వాతావరణం మధ్య రాయలసీమలో మూడు నినాదాలు రోడ్డు మీదికి వచ్చాయి. 1) సీమాంధ్ర అనే సమైక్యవాదం. కోస్తా, రాయలసీమ అగ్రకుల పాలకుల పెట్టుబడి ప్రయోజనాలు దీనికి ప్రాతిపదిక. ఈ రెండు ప్రాంతాల పెట్టుబడి కలయిక వల్ల పుట్టిన అపవిత్ర పదబంధమే సీమాంధ్ర. 2) హైదరాబాద్‌లో పెట్టుబడులు ఉన్నా సీమలో కూడా ఎంతో కొంత పెట్టుబడి పెట్టి దాని ప్రయోజనాల కోసం, తద్వారా సీమ రాజకీయ చిత్రపటం మీద కొత్త స్థానాన్ని సంపాదించుకోవాలనే ప్రయోజనం కోసం వచ్చిందే 'తెలంగాణ ఇస్తే రాయలసీమ కూడా ఇవ్వాలి' అనే నినాదం. చాలా విషయాల్లో ప్రజాస్వామికంగా ఆలోచించే వాళ్లు కూడా ఈ పోటీ వైఖరి ఏర్పరుచుకున్నారు. 3) సీమాంధ్ర బంధనాలను తెంచుకొని సీమ ప్రాంతం విముక్తమై ప్రత్యేక రాష్ట్రంగా వేరైపోవాలనేది మూడో నినాదం. ఈ మూడింటిలో ఉద్యమం కావలసిందీ, కాగలిగేదీ మూడోదే.

కానీ పైన చెప్పిన అనేక కారణాల వల్ల రాయలసీమ రాజకీయ చైతన్యం గల సమాజమనిపించుకోలేకపోయింది. ఈ మాట అనడానికి మొహమాటపడనవసరం లేదు. ఇదొక వాస్తవ స్థితి. చరిత్రతో సంబంధం లేనిది కాదు. దీన్ని గుర్తించి దానితో వ్యవహరించడం ఆ ప్రాంత ఉద్యమ శక్తులకు తప్పని సరి. ప్రత్యేక రాష్ట్ర ఆందోళనలు ఊపందుకున్న తరుణంలో, స్థానీయ సంస్కృతి గురించి ఒకింత పులకింతతో పురా చరిత్రను తలపోస్తున్న తరుణంలో ఒక ప్రాంతం గురించి ఇట్లా అనడం ఆ ప్రాంతవాసులకు, ఆ ప్రాంతీయవాదులకు కోపం తెప్పించవచ్చు. కాని ఈ వ్యాఖ్యలో ఎంతో కొంత నిజం ఉందని ఒప్పుకోడానికి ప్రాంతీయాభిమానం అడ్డుపడనవసరం లేదు. పైగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డప్పటి నుండి ముఖ్యమంత్రులను అందించిన జాబితా ఉన్న ప్రాంతంలోని రాజకీయ చైతన్యాన్ని ఇంత తక్కువగా అంచనా వేయడం ఏమిటని కోప్పడవచ్చు. బూర్జువా రాజకీయాల్లో భాగంగానైనా అన్ని బూర్జువా ప్రక్రియలు నిరాటంకంగా సాగి, వాటిలోనైనా ప్రజా భాగస్వామ్యం ఉండి, తమ బలమైన ప్రతినిధులను ఎంపిక చేసుకొని ఉండింటే అప్పుడు తప్పక సీమను రాజకీయశక్తిగా గుర్తించవలసిందే. అట్లా జరిగిందని చెప్పలేం.

అందువల్ల రాయలసీమలోని రాజకీయ సంస్కృతి గురించి లోతుగా ఆలోచించవలసిందే. రాయలసీమ స్వీయ అస్తిత్వానికి దీనికి సంబంధముంటుంది. దాన్ని దాచెయ్యడానికి లేదు. అసలు రాయలసీమలో రాజకీయ నాయకత్వం అటు భూస్వామ్య సాయుధ ముఠాలకు, భూమి, గనులు, సారాయి, అడవి తదితర అక్రమ వ్యాపారాలకు, వాణిజ్యానికి, మాఫియాకు మధ్య మిగిలిపోయింది. మెల్లగా పాత భూస్వామ్య పునాది మీది నుంచి వ్యాపార, పారిశ్రామిక రంగాల వైపు అతి వికృతంగా, జుగుప్సాకరంగా అడుగులు వేస్తూ కొత్త వర్గంగా అది అవతరిస్తున్న సంధికాలం ఇది.

ఈ విస్తృత నేపథ్యంలో రాయలసీమ వాసులు ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌ను వినిపిస్తున్నారు. దీనికి రెండు వైపుల నుంచి ప్రశ్నలు ఎదురవుతున్నాయి. అందులో ఒకటి ప్రబలమైన అవరోధం కాగా రెండోది న్యాయంగా కలిగే సందేహం. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి సీమ రాజకీయ నాయకులే అడ్డంకి కావడం ఒక ప్రధాన సమస్య. వారికి తమ ప్రాంతం పట్ల ప్రేమ ఉండగల లేదా ఓట్ల అవసరార్థమైనా ప్రాంతీయ సమస్యల గురించి మాట్లాడగల ప్రజాస్వామిక స్పృహ లేదు. ఇప్పుడైతే ఏకంగా సీమాంధ్ర ఉద్యమంలో ముమ్మరంగా ఉన్నారు కాబట్టి తెలంగాణను ఎట్లా ఆపాలని తప్ప సీమ గురించి మాట్లాడే తీరిక కూడా వాళ్లకు లేదు. ప్రత్యేక రాయలసీమ అని అడిగితే తెలంగాణను ఎట్లా వేర్పాటువాదమని దాడి చేస్తున్నారో సీమ ప్రత్యేక ఉద్యమాన్ని కూడా అట్లే అనగల బరితెగింపు వారికి పుష్కలంగా ఉంది.

రెండో తరహా ప్రశ్న సీమ పట్ల ప్రేమ ఉండి, సమస్యల మీద పోరాడాల్సిందేననీ, కోస్తా నాయకులు, సీమ నాయకులు కూడా రాయలసీమను అన్యాయం చేశారనే ఆగ్రహంతో ఉన్న వారికి కూడా నాలుగు జిల్లాలే ఒక రాష్ట్రమేమిటి? అసలే కరువు, నీళ్లు లేవు, అటు తెలంగాణ వాళ్లో, కోస్తా వాళ్లో ఇస్తే తప్ప నీళ్లు రావు. ఆదాయ మార్గాలు లేవు. పెద్ద నగరం లేదు. సముద్రతీరం లేదు. ప్రజల్లో ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష లేదు. రాష్ట్రంగా విడిపోతామని డిమాండ్ పెట్టడానికి పునాది అయిన ప్రత్యేకతత్వం లేదు. వీటన్నిటి కంటే ప్రత్యేక రాష్ట్రమైతే మళ్లీ పాలెగాళ్ల అధీనంలోకి వెళ్లిపోతుందేమో? అనే భయ సందేహాలతో చాలా మంది ఉన్నారు.

వీటి నుంచి బైట పడాలంటే రాయలసీమకు ఇద్దరు శత్రువులు ఉన్నారని గుర్తించాలి. ఒకరు కోస్తా పాలకవర్గం. రెండు, సీమ పాలకవర్గం. ఈ రెండు శక్తుల వల్ల సీమ ఎంత దగాపడింది ముందు తెలుసుకుంటే ప్రత్యేక రాష్ట్ర నినాద స్వభావం, అవసరం తేలుతాయి. ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ అవసరం ఉన్నదా లేదా? అనేది తేల్చుకుంటే మిగతా విషయాల కోసం ఉమ్మడిగా అన్వేషించవచ్చు. దీని కోసం కొంచెం చారిత్రక, సిద్ధాంత చర్చలోకి వెళ్లాలి.

ప్రత్యేక రాష్ట్రం అనే డిమాండ్ పెట్టుబడి సృష్టించిన అసమ అభివృద్ధి నుంచి తలెత్తుతుంది. అక్కడి నుంచి స్వయంపాలన దిశగా బలోపేతమవుతుంది. దీనికి ఆ ప్రాంత సుదీర్ఘ చారిత్రక, సాంస్కృతిక ప్రత్యేకతత్వంలోకి వెళ్లి స్వయంపాలనను హేతుబద్ధంగా సమర్థించు కుంటుంది. అప్పుడు అసమానత, వెనుకబాటుతనం అనే ప్రాతిపదికల కంటే స్వయం అస్తిత్వం, స్వయం పాలన బలమైన ఆకాంక్షగా మారుతాయి.

తెలుగు భాషా ప్రాంతంలో ప్రత్యేక రాష్ట్రాన్ని అడిగిన మొదటి ప్రాంతం రాయలసీమే. అందువల్ల 1800 నాటి పరిస్థితుల దృష్ట్యా ఇప్పుడు కోస్తా అనీ, రాయలసీమ అనీ అనుకుంటున్న ప్రాంతాల మధ్య ఏపాటి బంధం ఉన్నదో వెతకాలి. నిజాం నవాబు రాయలసీమను ఈస్టిండియా కంపెనీకి ఇచ్చేశాక ఒకే పాలన కిందికి రెండు ప్రాంతాలు రావడం తప్ప అంతకముందు సీమకు, కోస్తాకు కనీసం పాలనా పరంగానైనా 'ఒకే' భావన ఉన్నదా? సందేహమే.

విజయనగర పాలన తర్వాత రాయలసీమ మైసూరు సంస్థానంలో ఉంది. లేకుంటే నైజాం సంస్థానంలో ఉంది. దక్షిణ భారత దేశంపై వలసవాద అధికారం సుస్థిరమయ్యే క్రమంలో వచ్చిన పాలనాపరమైన మార్పులకు సీమ, ఆంధ్ర కలయిక మంచి ఉదాహరణ. తీవ్రమైన అసమానతలు లేవదీసిన వలస అభివృద్ధి నమూనాకు ఈ రెండు ప్రాంతాల సహజీవనం, అసమానత తిరుగులేని తార్కాణం.

ఈ 'ఉమ్మడి' భావన వలస కాలంలోనే తీవ్రమైన ప్రశ్నలు ఎదుర్కొంది. తెలుగువారనే గుర్తింపు కింద, ఒకే పాలన కింద శతాబ్దానికి పైగా ఉన్నాక, ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడాలనే తెలుగుజాతి ఆకాంక్షను, 'ఒకే' భావనను శంకిస్తూ రాయలసీమ ఆందోళన పడింది. దీనికి వలసవాద అభివృద్ధి నమూనా కారణం అయినప్పటికీ రాయలసీమ వాళ్లకు అనుమానం కలిగింది మాత్రం 'ఒకే' భావన మీద అని మర్చిపోరాదు.

ఒక్క మాటలో చెప్పాలంటే 1800 నుంచి 1930 దాకా ఒకే మాతృభాష, ఒకే జాతి, ఒకే పాలన కింద ఉండడం అనేవేవీ కోస్తా, రాయలసీమ వాసుల అంతరంగాలను కలపలేదు. అందుకే ఇంకో జాతి ఆధిపత్యం నుంచి విడివడి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడాలని సాగిన ఆంధ్రోద్యమంలోనే ఆ దూరం కనిపించింది. చాలా విషాదమే కావచ్చు గాని ఒక ప్రశ్న దీన్నుంచి ఉదయిస్తుంది. తెలుగుజాతి అని గర్వంగా చెప్పుకొనే ఉమ్మడి అంశాల పట్ల ఎంత గౌరవం ఉన్నా, తెలుగు జాతి అనేది అసలు ఎంతవరకు రూపొందింది? ఎలా రూపొందింది? అనే మౌలిక సందేహం అది.

వలసవాద నేపథ్యంలోని పెట్టుబడి సందర్భంలో తలెత్తిన జాతి భావనకున్న పరిమితి అని అర్థం చేసుకోదలిచినా, అది సృష్టించిన సకల అసమానతల పర్యవసానంగానే కోస్తా, రాయలసీమ రెండు భిన్నమైన అభివృద్ధి నమూనాల కిందికి వెళ్లిపోయాయి. స్థూలంగా వలస వాదమనే అభివృద్ధి చట్రంలో భాగమే అయినా ఈ రెండు ప్రాంతాల్లో వలసవాదులు అనుసరించిన అభివృద్ధి నమూనాలు భిన్నమైనవి.

వర్షాధార, చెరువుల ఆధారిత వ్యవసాయ ప్రాంతం పట్ల, నదులు పారే ప్రాంతం పట్ల బ్రిటిష్ వలసవాదులు ఈ తరహా అభివృద్ధి నమూనాలు అనుసరించడానికి అభివృద్ధి, నాగరికత మొదలైన విషయాల్లో వాళ్లదైన అవగాహన పనిచేసింది. ఈ కారణం వల్ల కోస్తా ప్రాంతంతో రాయలసీమ వాసులకు మిగిలింది బహుశా భాషా బంధమొక్కటే. మాట్లాడే భాష ఒకటే కాబట్టి, అదొక సామాజిక సంబంధం అవుతుంది కాబట్టి ఆ మేరకు 'మనం' అనే భావన ఏర్పడి ఉండొచ్చు. కానీ రెండు ప్రాంతాలు రెండు వేర్వేరు అభివృద్ధి నమూనాల కిందికి వెళ్లిపోవడం అనేదాన్నుంచే మీరు, మేము అనే రెండు అస్తిత్వాలకు పునాది పడింది. ఆ తర్వాత కూడా సీమకు కోస్తాకు మధ్య తారతమ్యంలో ఈ నమూనా పాత్ర ఉంది. అదొక ప్రమాణంగా మారడం, తద్వారా అక్కడి నుంచి వెలుబడేవే మొత్తం తెలుగువారికి సంబంధించినవిగా మారిపోవడం గమనించవచ్చు. అంటే అదొక అసమ సంబంధంగా, వివక్షకు, అన్యాయానికి ఊపిరి పోసిన సంబంధంగా స్థిరపడిపోయింది.

ఈ మొత్తాన్ని వలసవాదం నేపథ్యంలో చూడడం ఎలా చారిత్రకమో ఆ అభివృద్ధి నమూనాకు వ్యాఖ్యాతలై దాన్ని పకడ్బందీగా అమలు చేస్తూ అధికారాన్నీ, సంపదనూ కోస్తా పెట్టుబడిదారీ వర్గం పోగేసుకున్నదనేది కూడా అంతే చారిత్రకం. అది 1930 నాటికే వ్యవస్థీకృతమైపోయింది. కేవలం కోస్తా పెట్టుబడిదారుల భావనలోనే కాదు, అదొక సజీవ వ్యవస్థగా అప్పటికే ఉనికిలోకి వచ్చింది. రాయలసీమ వాళ్లు కోస్తా సంపన్నవర్గాన్ని దానికి ప్రతినిధులుగా గుర్తించారు కాబట్టే ఆ రోజుల్లోనే అది బైటపడింది. తెలంగాణకైతే ఈ మొత్తం వ్యవహారంతో సంబంధమే లేదు. అది పూర్తిగా వేరే కథ. తెలుగుజాతి రూపొందడం వెనుక ఈ క్లిష్టమైన ప్రక్రియ నడిచింది. ఇవాళ మా తెలుగు తల్లికి మల్లె పూదండ అని ఎంత పలికించినా అది బలవంతపు 'కోరస్' అయిపోయిందేగాని యుగళం కాలేకపోతోంది.

తెలుగు జాతి ఉజ్వల వారసత్వాన్నంతా సొంతం చేసుకుంటూనే, గౌరవిస్తూనే, పదిలపరుచుకుంటూనే తెలుగుజాతిగా 1953లో ఏర్పడ్డ భాషా రాష్ట్రంలో రెండు వేర్వేరు అస్తిత్వాలున్నాయని గుర్తించడానికి ఇబ్బంది పడనవసరం లేదు. ఆధునిక రాయలసీమ చరిత్ర అంతా రెండు సందర్భాల కింద పడి అణగారిపోయింది. ఒకటి, వలసవాద అభివృద్ధి నమూనా; రెండు, దానికి కొనసాగింపుగా కోస్తాంధ్ర అభివృద్ధి నమూనా. ఈ రెంటి కింద సీమ స్వీయ అస్తిత్వం, సొంతదనం పూర్తిగా సంక్షోభాన్ని అనుభవించవలసి వచ్చింది. ఎంతగానంటే తన స్వీయ అస్తిత్వ వ్యక్తీకరణకు నోచుకోలేకపోయింది.

తెలుగు సంస్కృతి, భాష, ఆచార వ్యవహారాలు, ఆలోచనారీతులు, అభివృద్ధి క్రమం... వగైరాలన్నిటికీ కోస్తా గీటురాయి కావడమే కాక కోస్తా అనే గోదాములో రాయలసీమ ప్రత్యేకత్వం మటుమాయమై పోయింది. అదే సమయంలో రాయలసీమ వికృత భూస్వామ్యం, ముఠాతత్వం మాత్రమే సీమ ప్రత్యేకతగా ప్రచారమైంది. సీమవాసులు కూడా ఈ ప్రచారాన్ని స్వీకరించ వలసిన స్థాయిలో ఈ వికృతత్వం దశాబ్దాల పాటు రాజ్యమేలింది.

ఇవాళ సీమ ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ బలంగా వినిపించడానికి అది అన్ని రకాలుగా అడ్డంకి అయింది. దాన్ని అధిగమించాలంటే కోస్తా తరహా అభివృద్ధి నమూనా పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకొని, ఇవాళ ప్రచారంలోకి వచ్చిన సమైక్యాంధ్ర అనే దానికి అదే పునాది అని గుర్తించాలి. కేవలం రాయలసీమకే కాదు, విశాలాంధ్రలో తమకు అన్యాయం జరిగిందని, ప్రత్యేక రాష్ట్రం కావాలనే ఆకాంక్షలన్నిటికీ కారణం ఈ అభివృద్ధి నమూనా.

కాబట్టి రాయలసీమ ప్రత్యేక రాష్ట్రం అన్నప్పుడు ఎన్ని సందేహాలైనా తలెత్తవచ్చు. సీమ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ, రాష్ట్ర మనుగడ గురించి ఎన్నో ప్రశ్నలు కలగవచ్చు. అవన్నీ పట్టించుకోవలసినవే, అన్వేషించ వలసినవే. సుమారు డెబ్భై ఏళ్లుగా రాయలసీమకు జరిగిన అన్యాయం కోస్తా తరహా అభివృద్ధి నమూనా వల్లనే అని, సమైక్య రాష్ట్రంలోని విధానాల వల్లనే అని విస్మరించడానికి లేదు.

ప్రత్యేక రాష్ట్రం గురించిన ఆలోచనలో సహితం సమస్యలనేకం ఉండొచ్చు. వాటికి వెరసి, లొంగిపోయి సమైక్య రాష్ట్రాన్ని పరిష్కారంగా అంగీకరించలేం. రెండు వందల ఏళ్లుగా అనేక దశల్లో కోస్తాతో కలసి కొనసాగిన చరిత్రను, సీమ అంతర్గత చరిత్రను విశ్లేషించి సీమ అస్తిత్వాన్ని నిర్మించి, ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని నిర్మించవలసి ఉంది. నిజానికి అది సిద్ధంగా ఉన్న అంశం కాదు. చరిత్ర, సంస్కృతి, రాజకీయార్థికం వైపు నుంచి నిర్మించవలసి ఉంది. ఇది కేవలం ప్రాంతీయ ఘనత చాటుకొనే గుర్తింపు వాదం కానవసరం లేదు.

ఒక ప్రాంత ప్రజా జీవితాన్ని, అందులోని క్లిష్టతలను, సంక్షోభాన్ని, అది ఎదుర్కొన్న వివక్షను, అన్యాయాన్ని ఎలుగెత్తి వినిపించే సామాజిక వ్యాఖ్యానంగా ఉండాలి. దాని మీద ఆధారపడి ఆ ప్రాంతంలోని పురోగామి శక్తులను గుర్తించే కర్తవ్యం కావాలి. ప్రత్యేక రాష్ట్రమనే బూర్జువా డిమాండ్ సాధించడానికి చేసే ఈ ప్రయత్నం తప్పక ఆ ప్రాంత ప్రజావిముక్తికి దారి చూపేది కావాలి.

*(అయిపోయింది)* వీ

*ప్రపంచ ప్రఖ్యాత మార్క్సిస్ట్ తత్వవేత్త, రాజకీయార్థిక శాస్త్రవేత్త ఇస్త్వాన్ మెస్జరోస్ కొత్త పుస్తకం 'ది స్ట్రక్చరల్ క్రైసిస్ ఆఫ్ కాపిటల్' కు 'మంత్లీ రీవ్యూ' సంపాదకవర్గ సభ్యుడు **జాన్ బెలామీ ఫాస్టర్** రాసిన ముందుమాట*

# సోషలిజం మార్గదర్శి ఇస్త్వాన్ మెస్జరోస్

మన కాలంలో ఇస్త్వాన్ మెస్జరోస్ ప్రాధాన్యత ఏమిటో చెప్పమని నన్నెవరైనా అడిగితే నేను వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్ చెప్పిన మాటనే మళ్లీ చెప్పవలసి ఉంటుంది. మెస్జరోస్ రాసిన ఇటీవలి పుస్తకం 'ది ఛాలెంజ్ అండ్ బర్డెన్ ఆఫ్ హిస్టారికల్ టైమ్' (2008) కు గాను ఆయనకు వెనిజులాలో అత్యున్నతమైన, విమర్శనాత్మక ఆలోచనలకు ఇచ్చే అవార్డును ఇస్తూ ఛావెజ్ ఆయనను 'సోషలిజం మార్గదర్శి' అని అభివర్ణించారు (మెస్జరోస్ కృషి సోషలిజం వైపు పరివర్తన సాగించే దారి మీద వెలుగు పరుస్తుంది గనుక ఆయనను మార్గదర్శి అనదలచుకున్నానని ఛావెజ్ అన్నారు. సైమన్ రోడ్రిగ్స్ సంకలిత రచనల ప్రతిని మెస్జరోస్‌కు అందజేస్తూ ఛావెజ్ ఆ పుస్తకం మీద ఈ మాట రాశారు. 2001 సెప్టెంబర్ 10న మిరాఫ్లోర్స్ ప్యాలెస్‌లో జరిగిన ఒక విందులో ఛావెజ్ ఆ పుస్తకం ప్రతిని మెస్జరోస్‌కు అందజేశారు. అదే సందర్భంలో బియాండ్ కాపిటల్ మీద కూడ చర్చ జరిగింది. తన సొంత పుస్తకంలో తాను రాసుకున్న లెక్కలేనన్ని వ్యాఖ్యలను, అభిప్రాయాలను ఛావెజ్ ఆ రోజు చూపించారు).

నిజంగానే మెస్జరోస్ రచనలు, ముఖ్యంగా 'మార్క్స్ థియరీ ఆఫ్ ఎలీనేషన్' (1970), 'ది పవర్ ఆఫ్ ఐడియాలజీ' (1989), 'బియాండ్ కాపిటల్' (1995), 'ది ఛాలెంజ్ అండ్ బర్డెన్ ఆఫ్ హిస్టారికల్ టైమ్' (2008), 'ది స్ట్రక్చరల్ క్రైసిస్ ఆఫ్ కాపిటల్' (2009), 'సోషల్ స్ట్రక్చర్ అండ్ ఫార్మ్స్ ఆఫ్ కాన్షియస్నెస్' (2010 రానున్నది) సోషలిజం నిర్మించడానికి అవసరమైన వ్యూహాత్మక దృక్పథాన్ని అందిస్తాయి. అటువంటి దృక్పథం లేకపోవడమే గత కొన్ని దశాబ్దాలుగా ప్రపంచ వ్యాపిత పెట్టుబడిదారీ వ్యతిరేక ఉద్యమంలోని ప్రధాన బలహీనతగా ఉంది. పెట్టుబడి అనుభవిస్తున్న 'వ్యవస్థాగత సంక్షోభం' కేవలం ఆ వ్యవస్థ దాని 'అత్యున్నత పరిమితికి' చేరినందు వల్ల మొదటిసారి మాత్రమే ఏర్పడుతున్నది కాదని మెస్జరోస్ అంటారు. అందుకు భిన్నంగా ఒక విశాల పునాది గల, ఆధిపత్యం వహించగల సోషలిస్ట్ ప్రత్యామ్నాయం తలెత్తడానికి తగిన పరిస్థితులు రూపొందాయనే వాస్తవం వల్లనే పెట్టుబడి సంక్షోభాన్ని ఎదుర్కొంటుందని ఆయన అంటారు. అందువల్లనే ప్రపంచ వ్యాపితంగా నూతన విప్లవ పరిస్థితికి స్థావరాలు ఏర్పడుతున్నాయని ఆయన అంటారు. పెట్టుబడిదారీ వ్యవస్థ మీద, ఆ మాటకొస్తే సోవియట్ యూనియన్ వంటి పెట్టుబడిదారీ అనంతర వ్యవస్థల మీద, ఆయన చేసిన విమర్శ ఎంత విస్తృతమైనదీ, లోతైనదీ అంటే అది సోషలిజపు చారిత్రక అవసరం గురించి శక్తిమంతమైన ఆలోచనలు కల్పిస్తుంది. ఆ విమర్శే పెట్టుబడి మీద ఆయన విమర్శగానూ కొనసాగి, మొత్తంగా ఒకే వ్యూహాత్మక వాదనగా సాగుతుంది. అందుకే మెస్జరోస్ ఉద్గ్రంథం బియాండ్ కాపిటల్ ప్రాధాన్యత గురించి చెబుతూ ఛావెజ్ ఆ ప్రాధాన్యత అంతా దాని ఉపశీర్షికలో ఉందని అన్నారు. ఆ ఉపశీర్షిక 'పరివర్తనా సిద్ధాంతపు దారిలో' అనేది. 'ఇది ఒక సైద్ధాంతిక ప్రయత్నం. ఎందుకంటే ఒక పరివర్తనా సిద్ధాంతాన్ని కార్ల్‌మార్క్స్ అభివృద్ధి చేయలేదు గనుక' అని ఛావెజ్ అన్నారు.

మెస్జరోస్ రాసిన స్ట్రక్చరల్ క్రైసిస్ ఆఫ్ కాపిటల్ పుస్తకానికి ఒక తక్షణ సందర్భం ఉన్నట్టు అనిపిస్తుంది. అది మహా సంక్షోభం అని చాలా మంది మామూలుగా, మరో మాట లేనందువల్ల వాడుతున్న ఒక పరిస్థితి. అది మనందరినీ చుట్టుముట్టిన విస్తృతమైన ద్రవ్య, ఆర్థిక సంక్షోభం. 1930ల మహాసంక్షోభం తర్వాత అంత స్థాయిలో సంక్షోభం మరెన్నడూ రాలేదు. మెస్జరోస్ తన పుస్తకాన్ని ఈ వర్తమాన ఆర్థిక సంక్షోభంతోనే ప్రారంభించి దానితోనే ముగించారు. కాని, ఆయన ఈ పరిస్థితిని 1970ల ప్రారంభం నుంచి సాగుతూ వస్తున్న ఒక విశాలమైన అపసవ్యతలో భాగంగా చూస్తున్నారు. ఈ వ్యవస్థాత్మక సంక్షోభాన్ని కేవలం ఒక సంకుచితమైన ఆర్థిక పదజాలంలో చూడగూడదని ఆయన అంటున్నారు. అది, విశ్వవ్యాపిత పర్యావరణ సంక్షోభాన్ని కూడా కలగలపుకొని ఉందని ఆయన అంటున్నారు. ఈ పర్యావరణ సంక్షోభం విశ్వవ్యాపిత ఆధిపత్యపూరిత సామ్రాజ్యవాదపు అత్యంత ప్రమాదకరమైన రూపమైందని ఆయన అంటారు. అలాగే ప్రస్తుత సంక్షోభాన్ని కొనసాగుతున్న వ్యవస్థలోని నిచ్చెన మెట్ల అధికార సంబంధాల నుంచి తలెత్తే అనేక సామాజిక, సాంస్కృతిక వైరుధ్యాల సమ్మేళనంగా చూడాలని కూడా ఆయన అంటారు. 'పెట్టుబడిదారీ వ్యవస్థ అనుభవిస్తున్న ఈ మహా వ్యవస్థాత్మక సంక్షోభం వలయాలుగా ఎప్పటికప్పుడు వచ్చే ఆర్థిక సంక్షోభాలను' అధిగమించిందని ఆయన అంటున్నారు. 'అది కేవలం పెట్టుబడిదారీ విధానాన్ని మాత్రమే కాదు, పెట్టుబడిదారీ వ్యవస్థకు సంబంధించిన ఊహించగల రూపాలన్నిటినీ ప్రభావితం చేస్తున్నది' అని ఆయన అంటారు. అలాగే 'ఒక సామాజిక పునరుత్పత్తి వ్యవస్థగా పెట్టుబడికి ఉండగల అత్యున్నత పరిమితులను' ఈ సంక్షోభం బయటికి తెస్తున్నదని ఆయన అంటారు. ప్రస్తుత ప్రపంచ ఆర్థిక సంక్షోభానికి 'నిజంగా విశ్వవ్యాపిత స్వభావం' ఉన్నదని అందువల్లనే 'అది 1929–33 నాటి ప్రపంచ మహా ఆర్థిక సంక్షోభం కన్న ఎక్కువ తీవ్రమైన, పోల్చడానికి వీలులేని' ప్రమాదాన్ని కలగజేయబోతున్నదని ఆయన అంటారు.

పెట్టుబడి వ్యవస్థాత్మక సంక్షోభం తీవ్రతరం కావడం, నిజమైన సోషలిస్ట్ పరివర్తన అనివార్యత – ఈ రెండూ కూడా మెస్జరోస్ అవగాహనలో గతితార్కికంగా అవిభాజ్యమైన సంబంధంలో ఉన్నాయి. అందువల్లనే రెండోదాని గురించి మాట్లాడకుండా మొదటిదాని గురించి మాట్లాడడం అసాధ్యం అని ఆయన అంటారు. ఆయన విమర్శ పెట్టుబడి మీద, పెట్టుబడిదారీ విధానం మీద కాదు. అందువల్లనే ఆయన విమర్శ పెట్టుబడిదారీ విధానంతో సమానంగా తొలి 'సోషలిస్ట్' లేదా పెట్టుబడిదారీ అనంతర ప్రయోగాల మీద కూడా సాగుతుంది. పెట్టుబడి సంబంధాన్ని సంపూర్ణంగా రద్దుచేయడంలో ఆ ప్రయోగాలు విఫలమైనందువల్ల, పెట్టుబడి సంబంధాన్ని రాజ్యం సహాయంతో మధ్యవర్తిత్వం వహించాలని అనుకోవడంవల్ల అవి ఒక చారిత్రక అగమ్యగోచర స్థితికి చేరాయని ఆయన అంటారు. అయితే, అదే సమయంలో ఆ ప్రయోగాలు ఇరవై ఒకటో శతాబ్ది సోషలిజం తీసుకోవలసిన మార్గం మీద కూడా వెలుగులు పరిచాయని ఆయన అంటారు. మెస్జరోస్ విశ్లేషణలో ఆ మార్గాన్ని క్రోడీకరించాలంటే 'సారాభూతమైన సమానత్వం, ఆత్మవిమర్శ, ఉత్పత్తి సంబంధాలను సామూహికంగా, స్వయం సంఘటితం చేసుకోవడం' ఈ మూడు కలగలిసి ఒక సుస్థిరమైన సోషలిస్ట్ సమాజాన్ని నిర్వచిస్తాయని ఆయన అంటారు.

లేబర్ పార్టీ, సోషల్ డెమొక్రటిక్ ఉద్యమాలు తీసుకుంటున్న ఆత్మరక్షణాయుతమైన పూర్తిగా ఆర్థికవాద దృక్పథంతో కూడిన విధానాన్ని కూడా మెస్జరోస్ తీవ్రంగా ఖండిస్తారు. పెట్టుబడి విఫలమైందని చూసి దాన్ని కాపాడడానికి చేయగలిన ప్రయత్నమల్లా చేస్తూ తమనూ, కార్మికవర్గం మొత్తాన్నీ బానిసత్వంలో ఉంచే ఆర్థిక శక్తినే కాపాడడానికి అవి ప్రయత్నిస్తున్నాయని మెస్జరోస్ అంటారు. అందుకు భిన్నంగా ఒక సామాజిక పునరుత్పత్తి వ్యవస్థగా పెట్టుబడి ప్రస్తుతం అనుభవిస్తున్న బలహీనతను అవకాశంగా తీసుకొని దాన్ని పూర్తిగా వాడుకోవడం అత్యవసరమని మెస్జరోస్ అంటారు. ఆ అవకాశం తీసుకొని రాజకీయ సాధనాల ద్వారా అసలు క్రీడా నియమాలనే మౌలికంగానూ, మళ్లీ మార్చడానికి వీలులేకుండానూ మార్చేయాలని ఆయన అంటారు. కార్మికవర్గం వ్యవస్థలో అంతర్భాగమైపోయిందని అనే వాళ్లను వ్యతిరేకిస్తూ ఆయన అది వ్యవస్థాగతంగానే అసాధ్యమని అంటారు. చివరికి అతిసంపన్నమైన పెట్టుబడిదారీ దేశాలలో కూడా అది సాధ్యం కాదని, ఎక్కువలో ఎక్కువ అది ట్రేడ్ యూనియన్ నాయకత్వానికి మాత్రం వర్తించవచ్చునని ఆయన అంటారు. కార్మికవర్గం ఎప్పుడయినా, ఎక్కడయినా పరాయీకరించబడిన శక్తిగానే ఉంటుందని, బ్రహ్మాండమైన విప్లవ మార్పుకు ఉపయోగపడే, పక్కన పెట్టడానికి వీలులేని శక్తిగానే ఉంటుందని ఆయన అంటారు. అంతేకాదు, అసలు అటువంటి విప్లవ పరివర్తన వాస్తవికంగా జరుగుతుందా అనే ప్రశ్నకు జవాబిస్తూ మెస్జరోస్ 'సాధ్యమే' అని ముక్కుసూటి సమాధానం చెపుతారు. నిజమైన మానవ విముక్తి, మార్క్స్ మాటల్లో చెప్పాలంటే 'పైనుంచి కింది దాకా' సమాజాన్ని మార్చడం జరగాలంటే కేవలం నిరంతరమైన పోరాటం ద్వారా మాత్రమే సాధ్యం అని అంటే అది చరిత్ర గమనానికి సంబంధించిన అంశమని ఆయన అంటారు.

ఈ పుస్తకంలో వివరించిన పెట్టుబడి వ్యవస్థాత్మక సంక్షోభం దశాబ్దాలుగా పెరుగుతూ వస్తోంది. అది ఇప్పుడు ప్రపంచంలోని ప్రతిమూలా ఒక అత్యవసర పరిస్థితికి చేరింది. ఈ వ్యవస్థకు విమర్శకులుగా ఇంతకాలమూ ఉన్నవాళ్లు ఇక సోషలిజం ఎప్పుడో ఒకప్పుడు దానంతటదే అంతిమంగా రూపొందుతుందనే భ్రమలో పొద్దుపుచ్చడానికి వీలులేదు. సోషలిజం రాకకోసం ప్రపంచం ఎదురు చూడవచ్చునని వాళ్లు ఇక ఎంతమాత్రమూ అనుకునే అవకాశం లేదు. 2006 జనవరిలో వరల్డ్ సోషల్ ఫోరం సమావేశంలో కారకాస్‌లో ఛావెజ్ చేసిన ఉపన్యాసాన్ని మెస్జరోస్ ఈ పుస్తకంలో ఉటంకించారు. అక్కడ ఛావెజ్ ఇటువంటి వ్యవస్థ వ్యతిరేక కార్యక్రమాలను వార్షిక మొక్కుబడి సమావేశాలుగా మార్చగూడదని పిలుపు ఇచ్చాడు. 'ఏడాదికోసారి జరుపుకునే ఈ పర్యాటక, జానపద ఉత్సవాలు ఘోరం. ఎందుకంటే, వీటి ద్వారా మనం కేవలం కాలం వృథా చేస్తున్నాం. మనకింకా సమయం వ్యర్థపరిచే అవకాశం లేదు. మనమింకా భవిష్యత్తు శతాబ్దాలలో ఏదో సాధిస్తామని మాట్లాడే అవకాశం లేదు... మనమింకా పొద్దుపుచ్చడానికి వీలులేదు. ఈ భూగోళం మీద మానవ జీవిత పరిస్థితులను రక్షించే సవాల్, మానవ జాతిని రక్షించే సవాల్, చరిత్ర గతిని మార్చే సవాల్, ప్రపంచాన్ని మార్చే సవాల్ మన ఎదురుగా ఉంది'.

ప్రస్తుత పెట్టుబడిదారీ విధానానికి ఒక లక్షణమైన మితిమీరిన విధ్వంసం ఇవాళ ప్రపంచవ్యాప్తంగా జరుగుతోంది. అది భూగోళం మొత్తం మీద జీవజాతులన్నిటినీ ప్రమాదానికి గురిచేస్తున్నది. ఆ పరిస్థితికి గతితార్కిక ప్రత్యర్థి చరిత్ర క్రమాన్ని పురోగమింపజేసే అవకాశం మాత్రమే. చరిత్ర గతిని పురోగమింపజేయడం అంటే సారభూతమైన సమానత్వం కొరకు విశాల పునాదిపై సాగే నిజమైన విప్లవ పోరాటాన్ని క్రియాశీలంగా రూపుదిద్దడమే. 19వ శతాబ్దానికి చెందిన సాంస్కృతిక చరిత్రకారుడు, మితవాది జాకబ్ బర్క్‌హార్డ్ట్ అంతకు ముందు జరిగిన ఒక విప్లవ యుగం గురించి ఒక వ్యాఖ్య చేశాడు. అప్పటి వరకూ అది ఒక చారిత్రక సంక్షోభం అని వచ్చిన వివరణల మీద వ్యాఖ్యానిస్తూ 'సమస్త విషయాలలోనూ ఒక సంక్షోభం వచ్చింది. అది అన్ని యూగాలకు వ్యాపించింది. ఒకే నాగరికతకు చెందిన వారందరినీ లేదా అత్యధిక సంఖ్యాకులను అది చుట్టుముట్టింది... ఆ చారిత్రక క్రమం ఒక భయానక పద్ధతిలో హఠాత్తుగా వ్యాపించింది. మామూలుగా శతాబ్దాలలో జరిగే పరిణామాలు దైవిక ఘటనలలాగా నెలలోనో, వారాలలోనో జరిగిపోయాయి. సంపూర్ణమయాయి'.

ఇవాళ కూడా పెట్టుబడి వ్యవస్థాత్మక సంక్షోభం ఒక చారిత్రక నేపథ్యాన్ని కల్పిస్తున్నది. ఆ భూమిక మీద సామాజిక విముక్తి కొరకు ఒక కొత్త విప్లవోద్యమం జరిగే అవకాశం ఉంది. ఆ ఉద్యమంలో మామూలుగా శతాబ్దాలలో జరిగే మార్పులు దైవిక ఘటనలలాగా దశాబ్దాలలోనో, సంవత్సరాలలోనో కూడా జరగవచ్చు. అయితే అటువంటి అత్యవసరమైన, బలమైన మార్పుకు శక్తి అంతా ప్రజలలో మాత్రమే ఉంటుంది. మానవజాతి తనను తాను ఈ చారిత్రక మార్పుకు చోదకశక్తిగానూ, లక్ష్యంగానూ ఉంచుకోవడానికి ఎంత సంసిద్ధంగా ఉంటే అంతగా మార్పు జరుగుతుంది. ఒక సామూహిక పోరాటం ద్వారానే సమసమాజం, ఒక సుస్థిర ప్రపంచం రూపొందుతాయి. మన కాలపు చరిత్ర మన ముందు ఉంచుతున్న అసాధారణమైన సవాలు, మనమీద పెడుతున్న అపూర్వమైన బాధ్యత ఇదేనని మెస్జరోస్ నొక్కి చెబుతారు. వీ

*దాదాపు పన్నెండు వేల ఏళ్ల క్రితం వరకు పాతరాతి యుగమే కొనసాగిందనీ, ఆధునిక ముసుగులు తొడుక్కున్న మత, ధార్మిక నమ్మకాలకు పునాదులు ఆదిమ తెగలలో ఉన్నాయనీ అంటున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# మతవిశ్వాసాల పునాదులు

ప్రపంచమంతటా మనుషులు నమ్మే రకరకాల మతాలు ఎప్పటినుంచీ మొదలయాయో ఊహించాలే గాని ఖచ్చితంగా చెప్పలేము. సుమారు 5 లక్షల ఏళ్ల క్రితం నుంచి పది, పన్నెండు వేల ఏళ్ల క్రితం వరకూ పాతరాతియుగం కొనసాగింది. ఆ కాలపు అవశేషాలనూ, రాతి వస్తువులనూ, చెక్కడాలనూ బట్టి కొన్ని విషయాలు తెలుస్తున్నాయి. కొన్ని విశేషాలు ఇతరత్రా లభిస్తాయి. ఈనాటికీ నాగరికత సోకకుండా తమకు ప్రత్యేకమనిపించే తంతులు నిర్వహిస్తూ బతికే ఆదిమతెగలు ప్రపంచమంతటా కనిపిస్తాయి. వారి ఆచారాలూ, నమ్మకాలూ మనకు విచిత్రంగా, అనాగరికంగా అనిపించినప్పటికీ ఆధునిక ముసుగులు తగిలించుకున్న నేటి మతవిశ్వాసాల పునాదులన్నీ వాటిలో కనిపిస్తాయి. వీటిలో కొన్ని వివరాలు కొందరికి జుగుప్సనూ, కొందరికి కోపాన్నీ కలిగించవచ్చు. అయినా కాస్త ఆలోచిస్తే మనుషులకు మొదటినుంచీ ఉన్న కొన్ని మానసిక బలహీనతలే ఈ విషయంలో పని చేశాయని స్పష్టమౌతుంది.



పాతరాతియుగపు సమాధి

అనాగరికదశలో ఉన్నప్పుడు మనుషులకు ఒక అస్పష్టమైన తాత్వికచింతన ఏర్పడడానికి చావు అనేదే ముఖ్యకారణమని పాత అవశేషాలనుబట్టి తెలుస్తుంది. 5 లక్షల ఏళ్లనాటి పీకింగ్ గుహల్లోనూ, 70 వేల సంవత్సరాలనాటి యూరప్ గుహల్లోనూ చనిపోయినవారి తలలను కోసి పాతిపెట్టడం, అంతకు ముందుగా చనిపోయినవారి జ్ఞాపకార్థమో, వారి శక్తిని పొందేందుకో ఆ తలల అంతర్భాగాలను తినడం వగైరా తంతులు అప్పటివారు జరిపినట్టు తెలుస్తోంది.

ఫ్రాన్స్‌లో దొరికిన కొన్ని అవశేషాల్లో అలాంటి పుర్రెలను పానపాత్రలుగా తయారుచేసి ఉపయోగించారని తెలిసింది. ఇవన్నీ జాగ్రత్తగా దాచిన వస్తువులు కనక వీటికి ఏవో ఆటవిక పూజాసామగ్రి వంటి ప్రాముఖ్యత ఉండేదని అనుకోవచ్చు. శవాలు పాతిన చోట్లలో తంతులు జరిగిన దాఖలాలు కనిపిస్తాయి. కొన్ని స్థలాల్లో కుంకుమవంటి ఎర్రని పొడి కనిపించింది. ఎర్రని పొడి వాడకం చాలా ప్రాచీనమైనది. మనవాళ్లు పూజల్లో విరివిగా ఉపయోగించే కుంకుమ రక్తానికి ప్రత్యామ్నాయమైన సంకేతమని ఈనాడు చాలామందికి తెలియదు. బలులివ్వడం ఆచరణలో కష్టమౌతున్నకొద్దీ పురాతన ఆచారాలను సూచనప్రాయంగా ద్యోతకం చేసే సంకేతాలు మాత్రమే మిగిలాయి. సున్నమూ, పసుపూ కలిపితే సులువుగా, చవకలో తయారయే కుంకుమ ఇందుకు ఉపయోగపడుతుంది. అలాగే కొత్తగా కట్టిన ఇళ్ల గుమ్మాలకు పుచ్చకాయను (అది అన్నిచోట్లా, ఎల్లకాలమూ దొరకదు కనక గుమ్మడి పండును) వేలాడగట్టడం, దానిమీద మనిషి ముఖంలా గీతలు గీయడం, నరబలికి సంకేతం. ఎర్రగా, రక్తం ఓడుతున్నట్టు కనబడే పుచ్చకాయ బలి అయినవాడి తలకు 'న్యాయబద్ధమైన' సంకేతం అన్నమాట.

ఈ ఎర్రని రంగుపొడి ప్రపంచంలో అనేకచోట్ల మానవులు నివసించిన అతిప్రాచీనమైన గుహల్లో శవాలను పాతిపెట్టిన చోట కనబడింది. ఆస్ట్రియాలోని ఒక గుహలో 5 మీటర్ల లోతున పాతిన ఇద్దరు కవల శిశువుల అవశేషాలు దొరికాయి. 27 వేల ఏళ్లనాటి ఈ పిల్లలను జాగ్రత్తగా చర్మంలో చుట్టి, మేమత్ ఏనుగు దంతాల చాటున ఖననం చేశారు. వారి శరీరాలకు ఎర్రనిపొడి పూశారు. ఏదో పెద్ద తంతు జరిపి ఉంటారని ఈ ఏర్పాటునుబట్టి తెలుస్తోంది. రక్తం అనేది

జీవానికీ, ప్రాణానికీ ప్రతీక. రుతుస్రావం జరగడం స్త్రీల సంతానోత్పత్తికి సంకేతం. ఇటువంటి విషయాలు ఆదిమానవుల మేధస్సును చాలా ప్రభావితం చేసి ఉంటాయి కనకనే ఇప్పటికీ మన పూజల్లో కుంకుమ లేకుండా జరగదు. బలి ఇచ్చిన మేక రక్తాన్ని ముఖానికి 'రక్ష'గా పూసుకునే అలవాటు పశ్చిమాసియా తెగల్లో ఉందట. మన దేశంలో జంతువు (లేదా మనిషి) రక్తాన్ని ముఖానికో, నుదుటికో పూసుకునే అలవాటు కొనసాగి ప్రస్తుతం ఎర్రని తిలకాలూ, బొట్లూ మిగిలాయి. దీనికి మరేదో వివరణ ఇవ్వడానికి అష్టవంకర్లు తిరగనవసరంలేదు. ఇప్పుడు మనకేలా అనిపించినా ప్రాచీనుల తంతులన్నీ సమాజశ్రేయస్సు కోసం ఏర్పాటైనవే అని గుర్తుంచుకోవాలి.

ప్రాచీనులు శవాలను పాతిపెట్టడంలో పద్ధతి ఉండేది. కొన్నిచోట్ల పడమటి దిక్కుకేసి అమర్చిన 27 పుర్రెలు కనబడ్డాయి. ఈ తలలన్నీ శరీరాల నుంచి నరకబడ్డాయి. ఫ్రాన్స్‌లోని ఒక స్థలంలో ఒక యువకుడి శవాన్ని కుడివేపుకు తిప్పి, మోచేతిని తలకింద అమర్చి పాతారు. దగ్గరలోనే రాతి ఆయుధాలు ఉంచారు. ఆ పక్కనే ఆ కాలపు ఎద్దును కాల్చిన అవశేషాలున్నాయి. అంటే ఏదో విందు కూడా జరిగిందన్నమాట. మరొకచోట ఒక నియాండర్తాల్ మానవుడి శవాన్ని ఇలాగే పడమటి వేపుకు తిప్పి, రాతి పనిముట్లతో సహా జాగ్రత్తగా బండల మధ్యన పాతిపెట్టారు. కొన్నిచోట్ల శవం తలచుట్టూ వలయాకారంలో అమర్చిన రాళ్లు కనిపిస్తాయి. ఇవన్నీ మనం ప్రాచీనం అనుకునే ఈజిప్ట్ నాగరికత వగైరాలకన్న ఎంతో పాత సంఘటనలు. ఏది ఏమైనా అంతటి ప్రాచీన యుగంలోనే మనుషులు చనిపోయిన సాటివారి గురించీ, చావును గురించీ ఎంతో ఆలోచించేవారని స్పష్టంగా తెలుస్తోంది.

చచ్చిపోవడమనేది తప్పనిసరి అని తెలిశాక ప్రాచీనులు చావును గురించి ఎంతగా బెదిరి ఉంటారో మనకు తెలియదు. కష్టాలమయంగా గడిచిన అప్పటి కాలంలో ప్రాణానికి ఇప్పటికన్నా చాలా ఎక్కువ విలువ


ఎర్రనిపొడితో 27 వేల ఏళ్లనాటి శిశువుల అవశేషాలు


70 వేల ఏళ్ల క్రితం పాతిపెట్టిన నియాండర్తాల్ శవం

ఉండేదని ఊహించవచ్చు. అసలే సగటు ఆయుఃప్రమాణం చాలా తక్కువగా ఉండి, రోగాలూ, గాయాలూ, ప్రమాదాలూ బలి తీసుకున్నప్పుడల్లా అప్పటి జనాభా తగ్గుతూ ఉండేది. నలుగురూ కలిసి ఐకమత్యంతో బతికితేగాని పూట గడవని ఆ కాలంలో చావు అనేది చాలా అవాంఛనీయం అనిపించి ఉండాలి. ఈ కారణాలవల్ల చావు అనేది ఎంతో తాత్వికచింతనకూ, తొలి మతపరమైన తంతులకూ దారితీసి ఉండాలి. చనిపోయిన తరవాత ఏమవుతుందోననే అనుమానాలూ, అపోహలూ, చనిపోయినవారి శక్తిని నిలిపి ఉంచే ప్రయత్నాలూ, వేరే రూపంలో వారు కొనసాగుతారేమోననే ఆశతో రకరకాల సంకేతాల అన్వేషణలూ, ఇలా ఆలోచించడం కేవలం పొట్ట పోసుకునేందుకు పాటుపడే జీవితాలకు సంబంధించని దిశలో మనుషుల మానసిక జీవితాన్ని మలుపు తిప్పి ఉంటుంది. ఇప్పటికీ 'పరలోకం' గురించి ఆలోచించడానికి మనని పురికొల్పడంలో దేవుడికన్నా మరణం గురించిన ఆలోచనలే బలంగా పనిచేస్తాయనడంలో సందేహం లేదు.

మనిషి ఏనాడైనా తనకు తెలిసిన విషయాలను గురించి నమ్మకంగా, ఆత్మవిశ్వాసంతో ప్రవర్తిస్తాడు. తెలియనివే కలవరపెట్టి బాధిస్తూ ఉంటాయి. అందులో ముఖ్యమైనది చావు. తెలియని వాటి గురించే బాధంతా. జబ్బు చేస్తే మందులు తీసుకుంటాం కాని పూర్తి నమ్మకం ఉండదు. చావు భయంతో మొక్కుకోవడం, జ్యోతిష్కుల దగ్గరికి వెళ్లడం వగైరాలు చూస్తాం. మనస్సు బలహీన పడినప్పుడల్లా మతాలు కావలసివస్తాయి. అయితే ఒకసారి వచ్చి తిష్ఠ వేసిన మతాలు మనను వదిలి పెట్టకుండా బాధిస్తూ, అప్పుడప్పుడూ రక్తపాతానికీ, హింసకూ కూడా కారణమవుతూ ఉంటాయి. వీ

## మానవ హక్కుల ఉల్లంఘన

మానవ హక్కుల ఉల్లంఘనలు పెరిగిపోవడానికి నక్సలిజమే కారణమన్న ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వాన్ని సుప్రీంకోర్టు తప్పుపట్టింది. నక్సల్స్ అధికంగా ఉన్న ప్రాంతమైన ఛత్తీస్‌గఢ్ అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వం రు. 7300 కోట్ల ప్యాకేజీని రూపొందించింది. దంతేవాడలో పోలీసుల కాల్పుల్లో మరణించిన పది మంది గిరిజనుల భౌతిక కాయాలను మళ్లీ పోస్ట్‌మార్టం కోసం వెలికితీయాలన్న ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం నిర్ణయంపై కూడా సుప్రీంకోర్టు అసంతృప్తి వ్యక్తంచేసింది.

## నాగాలతో చర్చలు

నాగా ఉద్యమ నాయకులైన తుయింగలెంగ్ ముయివాతో సహా నలుగురి బృందం ప్రధాని మన్మోహన్ సింగ్, హోం మంత్రి చిదంబరం, హోం శాఖ కార్యదర్శి జికె పిళ్లై, ప్రత్యేక కార్యదర్శి యు.కె. బన్సల్‌లను మార్చ్ 2న చర్చల నిమిత్తం కలిశారు. సమావేశానంతరం విలేకరులతో ముయివా మాట్లాడారు. చర్చల సందర్భంగా మాట్లాడుకోవాల్సిన అంశాల గురించి చర్చించామని, తాము ప్రభుత్వంతో సంప్రదింపులు కొనసాగిస్తామన్నారు. నాగాలాండ్ అంశానికి పరిష్కారం చూపేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉంటే తాము తప్పకుండా చర్చలకు వస్తామన్నారు.

## తొక్కిసలాటలో 65 మంది మృతి

ఉత్తరప్రదేశ్‌లోని మాన్‌గఢ్‌లో మహరాజ్ ఆశ్రమంలో మార్చ్ 4న అన్నదాన కార్యక్రమం ఏర్పాటు చేశారు. అన్నంకోసం వేలాదిగా తరలివచ్చిన నిరుపేదలను అదుపు చేసేందుకు అధికారులు వారిని వెనక్కి తోసివేసారు. దీంతో భయాందోళనకు గురైన మహిళలు తమ పిల్లలను తీసుకొని పరుగులు తీసారు. అక్కడున్న ప్రధాన గేటు విరిగిపోయింది. తాత్కాలిక షెడ్ కూలిపోయింది. తీవ్రమైన తొక్కిసలాట జరిగి ఎటూ తప్పించుకోలేని పరిస్థితిలో 65 మంది మరణించారు. గేట్ పక్కనే ఉన్న బోరుబావిలో పడి కొంతమంది మరణించినట్లు ప్రత్యక్ష సాక్షులు తెలిపారు. మరో వందమంది గాయపడ్డారు. మరణించిన వారిలో 37 మంది మహిళలు, 26 మంది చిన్నారులున్నారు.

## మహిళా బిల్లుకు రాజ్యసభ ఆమోదం

శాసనసభలో మూడింట ఒక వంతు కేటాయించే మహిళా రిజర్వేషన్ బిల్లు మార్చ్ 9న 191-1 ఓట్ల తేడాతో రాజ్యసభలో ఆమోదం పొందింది. ఈ బిల్లును ఎస్.పి, ఆర్‌జెడి, ఎల్‌జెడి, ఎల్‌జెపి, బిఎస్‌పి, తృణముల్ కాంగ్రెస్ పార్టీలు బిసి, మైనారిటీ రిజర్వేషన్‌లు అమలు చేయాలంటూ వ్యతిరేకించినా బిల్లు ఆమోదం పొందింది. ఏప్రిల్ 7 తరువాత లోక్‌సభలో కూడా ఆమోదం పొందితే అసెంబ్లీ, పార్లమెంట్‌లలో మహిళలకు 33 శాతం సీట్లు దక్కుతాయి.

## మైనింగ్ మాఫియా చేతిలో వ్యవస్థలు

ఖనిజ సంపదలున్న అటవీ ప్రాంతాలను ఆక్రమించి బహుళజాతి కంపెనీలకు కట్టబెట్టేందుకే కేంద్రం మావోయిస్టులను, గిరిజనులను ఊచకోత కోస్తున్నదని ప్రముఖ రచయిత్రి అరుంధతీరాయ్ విమర్శించారు. గాలి జనార్ధన్‌రెడ్డి, మధు కోడాలాంటి అనేక మైనింగ్ మాఫియాలకు ప్రభుత్వాలు కొమ్ముకాస్తున్నాయని తెలిపారు. ప్రభుత్వాలు, న్యాయ వ్యవస్థల కొనుగోలుకు, ప్రజల్ని అణిచివేసేందుకు అక్రమంగా సంపాదించిన వేల కోట్ల రూపాయలను వెచ్చిస్తున్నాయని ఆమె న్యూఢిల్లీలో మార్చ్ 5న విలేకరుల సమావేశంలో ఆరోపించారు. ఛత్తీస్‌గఢ్‌లో లక్ష మందికి పైగా గిరిజనులు నిర్వాసితులయ్యారని, వెయ్యి మంది మహిళలపై అత్యాచారాలు జరిగాయని ఆమె పేర్కొన్నారు.

## షర్మిల మళ్లీ అరెస్ట్

సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం-1958ను తొలగించాలని డిమాండ్ చేస్తూ మణిపూర్‌లో గత తొమ్మిదేళ్లుగా షర్మిల నిరాహార దీక్ష చేస్తున్నారు. ఆమెను అరెస్ట్ చేసి జైల్లో వేశారు. అక్కడా ఆమె దీక్షను కొనసాగించారు. ఆమెను విడుదల చేయాలని గత ఏడాదిగా ప్రజాస్వామ్యవాదులు రిలే దీక్షలు చేస్తున్నారు. దీంతో ఆమెను మార్చ్ 8న విడుదల చేశారు. అయినప్పటికీ ఆమె తన దీక్షను కొనసాగిస్తుండడంతో మార్చ్ 10న మళ్లీ ఆమెను అరెస్ట్ చేశారు.

## లక్ష మంది ఉద్యోగులకు ఉద్వాసన

ప్రభుత్వ రంగ సంస్థయిన బిఎస్ఎన్ఎల్‌లో 30 శాతం వాటాను ప్రభుత్వం విక్రయించాలని, మూడో వంతు(లక్ష మంది) ఉద్యోగులను తీసివేయాలని ప్రధాని సలహాదారు శామ్ పిట్రోడా సారథ్యంలోని కమిటీ సిఫారసు చేసింది. బిఎస్ఎన్ఎల్ పునర్ వ్యవస్థీకరణకు సంబంధించి నియమించిన పిట్రోడా కమిటీ మార్చ్ 4న తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది.

## విదేశీ యూనివర్సిటీలకు స్వాగతం

భారత్‌లోని విద్యా మార్కెట్‌ను విదేశీ యూనివర్సిటీల పరం చేసేందుకు కేంద్ర ప్రభుత్వం గేట్లు తెరిచింది. ప్రతిపక్షాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నా, భారత్‌లో వీటి స్థాపనకు కేంద్ర కాబినెట్ ఆమోదించింది. విదేశీ యూనివర్సిటీలను స్థాపించుకోవచ్చని, డిగ్రీలను ప్రధానం చేయవచ్చని స్పష్టం చేసింది. ఈ మేరకు ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ ఆధ్వర్యంలో జరిగిన కేంద్ర మంత్రివర్గం విదేశీ విద్యా సంస్థల (ప్రవేశం, కార్యకలాపాల నియంత్రణ) బిల్లు-2010ని ఆమోదించింది. ఈ విద్యాసంస్థలలో రిజర్వేషన్ చట్టాలు వర్తించవని కేంద్ర మానవ వనరుల మంత్రి కపిల్ సిబల్ తెలిపారు.

## గిరిజనులను కాలరాస్తున్న వేదాంత

ఒరిస్సాలోని నియమ్‌గిరి కొండల్లోని బాక్సైట్ నిల్వలను వేదాంత రిసోర్సెస్ మైనింగ్ కంపెనీ సొంతం చేసుకునే ప్రయత్నం చేస్తోంది. కేంద్ర ప్రభుత్వం నియమించిన నిపుణుల కమిటీ కూడా వేదాంతను తప్పుబట్టింది. ఈ మైనింగ్ ప్రాజెక్టు కోసం వేదాంత అటవీ చట్టాలను, గిరిజనుల హక్కుల చట్టాలను ఉల్లంఘించినట్టుగా నిపుణుల కమిటీ పేర్కొంది. రిఫైనరీ విస్తరణ కోసం వేదాంత నిర్వహించిన పబ్లిక్ హియరింగ్ తూతూ మంత్రంగా సాగిన విధానాన్ని ఈ నివేదికలో పేర్కొన్నారు. ఈ మైనింగ్ ప్రాజెక్టును ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ తీవ్రంగా వ్యతిరేకించింది. అటవీ, గిరిజన హక్కులను కంపెనీ ఉల్లంఘిస్తోందంటూ గిరిజన హక్కుల సంఘాలు, పర్యావరణ సంఘాలు ఆరోపిస్తున్నాయి.

## కరెన్సీ మాల

బహుజన సమాజ్ పార్టీ (బి.ఎస్.పి) నాయకురాలు, ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి మాయవతి ఇటీవల నిర్వహించిన పార్టీ ర్యాలీలో ఆమెను కోట్లాది రూపాయల నోట్ల మాలతో సన్మానించారు. దీనిపై కాంగ్రెస్, సమాజ్‌వాది పార్టీ (ఎస్.పి) లోక్‌సభ చివరి రోజును స్తంభింపజేశాయి. అంత డబ్బు ఎక్కడి నుంచి వచ్చిందన్న దానిపై ఆదాయపు పన్ను శాఖ దర్యాప్తు చేస్తోంది. వెయ్యి రూపాయల నోట్లతో మాయవతికి పెద్ద మాల తయారు చేశారు. దాని ఖరీదు 10-15 కోట్ల రూపాయలు ఉండగలదని అంచనా. అయితే ఆ మాల కేవలం 21 లక్షలు మాత్రమేనని బి.ఎస్.పి అంటోంది. వీ

## చిలీలో భూకంపం

దక్షిణ అమెరికాలోని చిలీ దేశంలో ఫిబ్రవరి 27న భూకంపం సంభవించింది. భూకంప తీవ్రత రిక్టర్ స్కేల్‌పై 8.8గా నమోదయింది. రాజధాని శాంటియాగోలో తీవ్ర ప్రాణనష్టం, ఆస్తినష్టం సంభవించింది. రెండున్నర గంటల వ్యవధిలో దాదాపు 90 సెకన్లపాటు ప్రకంపనలు చోటుచేసుకొన్నాయి. భూకంప కేంద్రం శాంటియాగోకు 115 కిలోమీటర్ల దూరంలో ఉండడంతో తీవ్ర నష్టం వాటిల్లింది. దాదాపు ఏడు వందల మందికి పైగా మరణించారు. ఫిబ్రవరి 28న, మార్చ్ 1న మళ్లీ భూ ప్రకంపనలు సంభవించాయి. దీంతో శిథిలాలుగా ఉన్న భవనాలు కుప్పకూలాయి. భూకంపానికి తోడు చిలీలోని రాబిన్‌సన్ క్రూసో దీవుల సమీపంలో సునామీ అలలు ఎగసిపడ్డాయి. చిలీతోపాటు పసిఫిక్ తీర ప్రాంతాలైన దక్షిణ అమెరికా, హవాయ్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, జపాన్, ఫిలిప్పీన్స్, రష్యాలకు సునామీ హెచ్చరికలు జారీచేశారు.

## ఫోన్సెకాపై కోర్ట్ మార్షల్

శ్రీలంకలో మాజీ ఆర్మీ చీఫ్ శరత్ ఫోన్సెకాపై మార్చ్ 16 నుంచి కోర్ట్ మార్షల్ మొదలయింది. కొలంబోలోని నేవీ హెడ్‌క్వార్టర్స్‌లో ముగ్గురు సభ్యుల ప్రథమ కోర్ట్ మార్షల్ ముందు ఆయన తన లాయర్లతో హాజరయ్యారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్ర పన్నారన్న ఆరోపణతో పాటు, సైనిక సామాగ్రి కొనుగోళ్లలో అవినీతికి పాల్పడ్డారన్న ఆరోపణ కూడా ఎదుర్కొంటున్నారు. ఫోన్సెకా పెట్టుకున్న బెయిల్ పిటిషన్‌ను శ్రీలంక సుప్రీం కోర్టు నిరాకరించింది. తదుపరి విచారణ ఏప్రిల్ 8న జరుగనుంది.

## థాయ్‌లాండ్‌లో రక్త నిరసన

ప్రస్తుత పార్లమెంట్‌ను రద్దుచేసి, కొత్తగా ఎన్నికలు నిర్వహించాలనే డిమాండ్‌తో థాయ్‌లాండ్‌లో ప్రజలు వినూత్న రీతిలో నిరసనలు చేపట్టారు. ఇందులో భాగంగా థాయ్ ప్రజలు తమ రక్తాన్ని సీసాల్లో నింపి ప్రభుత్వ కార్యాలయాలు, ప్రభుత్వాధినేతల ఇళ్లపై పోస్తూ నిరసనలు తెలిపారు. మార్చ్ 16న ప్రధాని అభిసిత్ వెజ్జాజీవా కార్యాలయం ముందు నెత్తుటి బాటిళ్లతో ప్రదర్శన నిర్వహించి, మార్చ్ 17న ఆయన నివాసం ముందు బైటాయించారు. ఆ తర్వాత రక్తంతో నిండిన ప్లాస్టిక్ కవర్లను ప్రధాని నివాస కాంపౌండ్‌లోకి విసిరారు. ఈ నిరసనల్లో అన్ని ప్రజాస్వామ్య అనుకూల వర్గాలకు చెందిన దాదాపు లక్ష మంది వరకు పాల్గొన్నారు. ఇన్ని నిరసనలు జరిగినా ప్రధాని ఎట్టి పరిస్థితుల్లోనూ పార్లమెంట్‌ను రద్దుచేసే ప్రసక్తి లేదని స్పష్టం చేశారు.

## గిరిజా ప్రసాద్ కొయిరాలా మృతి

నేపాల్ కురువృద్ధుడు, ఐదుసార్లు దేశ ప్రధానిగా పదవీ బాధ్యతలు చేపట్టిన గిరిజా ప్రసాద్ కొయిరాలా మార్చ్ 20న మరణించారు. ఆయన వయస్సు 85 సంవత్సరాలు. ఆయన 1925లో బీహార్ (భారత్)లో జన్మించారు. ఢిల్లీ వర్సిటీలో చదివారు. 1948లో నేపాల్ మజ్దూర్ కాంగ్రెస్ సభ్యునిగా చేరి రాజకీయ ప్రస్థానం చేశారు. 1991 ఎన్నికల్లో నేపాలీ కాంగ్రెస్ పార్టీ పూర్తి మెజారిటీ సాధించడంతో కొయిరాలా మొదటిసారి ప్రధాని పదవి చేపట్టారు. 1994లో నేపాలీ కాంగ్రెస్ అధ్యక్షుడయ్యారు. మావోయిస్టులకు, ప్రధాన రాజకీయ పార్టీలకు మధ్య శాంతి చర్చలలో కొయిరాలా ప్రముఖ పాత్ర పోషించారు. 2008లో రాచరికాన్ని రద్దుచేసినపుడు కొద్దికాలం పాటు దేశాధ్యక్షుడిగా పనిచేశారు. రాజరికాన్ని రద్దు చేయాలని మొట్టమొదటిసారి కొయిరాలానే అసెంబ్లీలో తీర్మానం ప్రవేశపెట్టారు.

## ఇరాక్‌లో ఎన్నికలు

ఇరాక్‌లో మార్చ్ 8న పార్లమెంట్‌కు రెండవసారి ఎన్నికలు జరిగాయి. పార్లమెంట్‌లో ఉన్న 325 సీట్లకు గాను 6200 అభ్యర్థులు పోటీలో ఉన్నారు. ఇందులో 1718 మంది మహిళలు. ప్రధాన పోటీ సున్ని తెగకు ప్రాతినిధ్యం వహిస్తున్న ముఖ్యమంత్రి నౌరి అల్ మలికి, షియా తెగకు ప్రాతినిధ్యం వహిస్తున్న అమ్మర్ అల్ హకీం మధ్య ఉంది. ఎన్నికలు శాంతిపూర్వకంగా జరగడానికి అధికారులు దాదాపు రెండు లక్షల మంది సాయుధ దళాలను మోహరించారు. ఎన్నికల సందర్భంగా పలుచోట్ల హింసా ఘటనలు చోటు చేసుకొన్నాయి. ఇందులో దాదాపు 24 మంది చనిపోయారు. బాగ్దాద్‌లోనే దాదాపు 12 మంది దాకా చనిపోయారు.

## రష్యాలో ధరల మంటలు

రష్యాలో విపరీతంగా పెరిగిన ధరలకు బాధ్యత వహిస్తూ ప్రధాని పుతిన్, స్థానిక అధికారులు రాజీనామా చేయాలంటూ మార్చ్ 20న దేశవ్యాప్తంగా వేలాది మంది నిరసన ప్రదర్శనలు జరిపారు. ఈ నిరసన ర్యాలీలో అన్ని వర్గాల ప్రజలూ, కమ్యూనిస్టులూ పాల్గొన్నారు. దేశంలోని అన్ని నగరాలలో ఈ నిరసన ప్రదర్శనలు వెల్లువెత్తాయి.

## పోప్ క్షమాపణ

మతాధికారుల లైంగిక వేధింపులకు గురైన బాధితులకు పోప్ బెనడిక్ట్ ఐర్లాండ్‌లో క్షమాపణ చెప్పారు. 'జరిగినదానికి మీరెంతగానో బాధపడ్డారు. అందుకు నా క్షమాపణ' అంటూ పోప్ పంపిన లేఖను ఐర్లాండ్‌లోని అన్ని చర్చ్‌లు, క్రైస్తవ మత సంస్థల్లో చదివి వినిపించారు. 1975 నుంచి మూడు వందలకు పైగా లైంగిక వేధింపుల కేసులు నమోదైనట్లు ఐర్లాండ్ ప్రభుత్వం వెల్లడించింది.

## విస్తృత అధికారాలు తొలగించాలి

ఏళ్ల తరబడి సాగిన సైనిక నియంతృత్వం కింద రాజ్యాంగానికి చేసిన సవరణలను తొలగించాలని పాకిస్తాన్ ప్రధాని యూసఫ్ రాజా గిలానీ అన్నారు. బ్రిటన్ పత్రిక 'ఫైనాన్షియల్ టైమ్స్'తో మాట్లాడుతూ అధ్యక్షునికున్న విస్తృత అధికారాలను తొలగించి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించాలని అభిప్రాయపడ్డారు. ప్రధాని పదవిని పలుమార్లు చేపట్టడానికి వీలుగా రాజ్యాంగాన్ని సవరించాల్సిన అవసరం ఉందన్నారు.

## అమెరికా ఉపాధి బిల్లు

అమెరికా ప్రతినిధుల సభ 15 బిలియన్ డాలర్ల ఉపాధి బిల్లును ఆమోదించింది. బిల్లుకు అనుకూలంగా 217 ఓట్లు రాగా, వ్యతిరేకంగా 201 ఓట్లు వచ్చాయి. అధ్యక్షుడు బరాక్ ఒబామా నిరుద్యోగ సమస్యకు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వాలని నిర్ణయించారు. నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలిచ్చే వ్యాపార సంస్థలకు టాక్స్ హాలిడే ప్రకటించాలని నిర్ణయించారు. ఉపాధిలో కొనసాగిస్తే వాణిజ్య సంస్థలకు మరిన్ని రాయితీలు ఇవ్వడానికి అమెరికా ప్రభుత్వం ఆలోచిస్తోంది. అమెరికా సాధారణ మూల నిధిలో ఇప్పటికే 1.6 ట్రిలియన్ డాలర్ల లోటు ఉన్నట్లు తెలుస్తోంది. వీ

